# ర స ప్రు వు

## వేము వంశ గాథావళి

గ్రంథకర్త

ఆచార్య వి. యల్. యస్. భీమశంకరం

మొదటి ముద్రణము
ప్రతులు 1000
మార్చి, 1998.

వెల:
ప్రత్యేక ప్రతి రూ. 300
సాదా ప్రతి రూ. 200

ప్రతులకు
ప్రొఫెసర్ వి. యల్. యస్. భీమశంకరం,
12-13-75, 4వ వీధి,
తార్నాకా,
హైదరాబాదు - 500 017
ఫోను: 7018500

ప్రచురణకర్త: ప్రొఫెసర్ యాబలూరి శ్రీధరమూర్తి.
ముద్రణ: మిలింద్ ప్రకాశన్, సుల్తాన్ బజార్,
హైదరాబాదు.

# ర స ప్రు వు

## వేము వంశ గాథావళి

గ్రంథకర్త

ఆచార్య వి. యల్. యస్. భీమశంకరం

# ర సో వై సః.

రచన

డా॥ నండూరి రామకృష్ణమాచార్య,
రాష్ట్రస్థాయి అధ్యక్షుడు,
ఆంధ్ర పద్య కవితా సదస్సు.

అంతర్జాతీయ విఖ్యాతిని ఆర్జించిన విజ్ఞాన శాస్త్రవేత్త - భూభౌతిక విద్యా పారంగతుడు, ఆచార్య (వి. యల్. యస్) వేము లక్ష్మీనారాయణ సుబ్రహ్మణ్య భీమశంకరం - ప్రౌఢ పద్య కవితా ప్రబంధం "రసస్రువు" వ్రాయగల్గుట ఒక సారస్వత విచిత్ర విరోధాభాసం. తెలుగుపై అతనికి అభిరుచి ఉగ్గుపాలతోడనే అలవడినది. అతని కన్నతల్లి శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారు తన కొడుకు భీమశంకరమునకు గోరు ముద్దలు గుజ్జన గూళ్లు తినిపించే చిన్నారి పొన్నారి శైశవంలోనే భారత భాగవత పద్యాలు రంగరించి వినుపించు చుండెడివారు. ఆ విధంగా తెలుగు పద్య కవిత- బాల భీమశంకరమునకు - శ్రుత పాడిత్యంగా సంక్రమించింది.

తల్లి - తన కొడుకును అల్లారు ముద్దుగా పెంచడానికి కారణాంతరం ఉంది. అతడు లేకలేక కలిగిన ముద్దు బిడ్డడు. తల్లి ఎన్నో నోములు నోచి - ద్రాక్షార భీమేశ్వర వర ప్రసాదిని కన్నది. భీమశంకర నామం ఆ విధంగా సంక్రమించినది. తండ్రి శ్రీ వ్యాసమూర్తి ఆంగ్ల సంస్కృతాంధ్రభాషాభిమాని తల్లి తండ్రిగారు - శ్రీ యనమండ్ర నారాయణమూర్తి పంతులుగారు విజయనగర మహారాజావారి ఆంతరంగికుడు. ఆ యూరి కళాశాలలో ఆంగ్లోపన్యాసకుడు. ఆ సమయంలో యావదాంధ్రమునకు విజయనగరం సాంస్కృతిక గరిమనాభి. విద్యా రాజధాని కవి భీమశంకరం తదుపరి విజయనగర కళాశాలా విద్యార్థి ఆయనకు రక్తంలో ఆజన్మ సాంస్కృతిక వాతావరణం సంక్రమించింది.

ఆచార్య భీమశంకరం ఆజానుబాహువైన సుస్ఫురద్రూపి రూపమునకు తగిన మెదడు - మెదడుకు తగిన చదువు - చదువుకు తగిన పదవి - పదవికి తగిన పరోపకార పారీణత - పరోపకార పారీణతకు అనువుగా పిత్రార్జితమైన ఆస్తి పాస్తులు కలిగిన భీమశంకరం బ్రదుకు అన్ని విధముల వర్ధించిన విందు విస్తరి.

జీవిత వైకుంఠపాళీ ఆటలో భీమశంకరం ఎన్నో నిచ్చెనలు ఎక్కినట్టివాడేగాని పాము కాట్లకు గురి కాలేదు. అవకాశాలు కలిసి వచ్చినవి. ఇంగ్లాండు రాజధాని లండనులో అతనికి - లార్డ్ పి. యమ్. యస్. బ్లాకెట్ అనే నోబెల్ బహుమతి గ్రహీత సన్నిధి - సాహచర్యం లభించి శిష్యనిర్విశేషుడై ఎంతో ఎత్తుకు ఎదుగ గలిగినాడు. ఎన్నో దేశాలు సందర్శించిన విదేశ యాత్రిక త్రిదశుడు కాగలిగినాడు. విదేశయానము వలన వర్తమానంలో భవిష్యద్దర్శనం లభించ గలదు. పలుసారులు భూప్రదక్షిణము చేసిన భీమశంకరం విజ్ఞానశాస్త్ర విద్వాంసుడు మాత్రమే గాక ఐన్‌స్టీన్ వలె గుండె పండినట్టి గొప్ప వ్యక్తి. వేదాంతి - కవి - విద్వాంసుడు - విజ్ఞాన శాస్త్రవేత్త. ఎన్నో కాంతిరేఖలు కలిసిన పూర్ణపురుషుడు. మతము, విజ్ఞానశాస్త్రము పూర్ణపురుషుని లోని అంతర్భాగములైన ఏక దేశములు. ఆచార్య భీమశంకరమునకు మతముపై ప్రగాఢ విశ్వాసము గలదు. ఐన్‌స్టీన్ సుప్రసిద్ధ సుభాషితము:

తే||గీ|| మతము - శాస్త్ర విజ్ఞాన గుంఫనము లేక
గ్రుడ్డి దగును సమ్యక్ దృష్టి కోలు పోయి,
మహిత విజ్ఞాన శాస్త్రమ్ము - మతము లేక
కుంటి దగును చైతన్యంబు కోలు పోయి.

[Religion without Science is blind,
Science without Religion is lame]

ఆచార్య భీమశంకరము సమగ్ర దృష్టిని ఆరాధించే విజ్ఞాన శాస్త్రవేత్త. ఈ ప్రబంధంలో ఆద్యంతముల నైక్యసంధానమును కావించే పరమేశ్వరారాధన

అంతర్వాహినిగా ప్రవహించుచున్నది. అనిర్వచనీయమైన అనుభవైక వేద్యమైన దివ్య వాతావరణము వెల్లివిరియ జేయుచున్నది.

ఈ కృతిలోని ప్రథమ ప్రార్థనాపద్యము - "శ్రీ వాణీ గిరిజా కృపా విభవ" ముద్రలో ఆదికవి నన్నయను జ్ఞప్తికి వెలయించుచున్నది. అంతేగాక - సచ్చిదానంద లీలా తాండవ లోలుని కాలి చిరుగజ్జెల సవ్వడి ఈ ప్రబంధములోని పద్యశిల్పమునకు సర్వత్ర - శ్రుతి లయలు సమకూర్చుచున్నది. ఆలంకారికులు కవితా పరమ ప్రయోజనమును రసప్రతీతిగా అభివర్ణించి యున్నారు. రసము లోకోత్తర సద్యఃపరనిర్వృతి. విగళిత వేద్యాంతరము. బ్రహ్మానంద సహోదరము. అది ఒక దివ్య యజ్ఞదీక్ష. ఈ ప్రబంధము లోని ఇతివృత్తము నాట్య యజ్ఞ సమసమాంతర వృత్త చంక్రమణము. ముఖ్యపాత్ర - వేము ముని నాట్యము నటరాజు కేళీ తాండవమునకు పతాకా ప్రతీకము. నటరాజు - నటస్వరూప వ్యంజితుడు - "రసో వై సః" వేదవాక్కు ఈ ప్రబంధమునకు జీవనాడి. ఈ ప్రబంధములో ప్రతి పద్యము రస సమామ్నాయ పాకం - గాన నిష్యంద తుందిలము. ఇందలి ఇతివృత్తమునకు గర్భసంధి ప్రాయమైన సన్నివేశము, నరమేధము నాపిన వేము ముని నాట్యము. "రసస్రువు" సార్థక ప్రబంధము.

స్థూలదృష్టితో అనుశీలించినచో - ఈ కావ్యం వేము వంశ గాథ. సూక్ష్మదృష్టితో చూచినచో - ఈ ప్రబంధం - వేయి సంవత్సరాల తెలుగు పద్య శిల్ప సర్వస్వం.

ఆ||వె|| వ్రాసె భీమశంకరము పద్య కావ్యమ్ము
వేము వంశ యశము వెల్లి విరియ;
వేయి యేండ్ల తెలుగు వెల్గు నానుడి జిల్గు
పద్య పద్య మందు ప్రతిఫలింప.

ఇది కేవల కల్పనాకథ కాదు - సాహితీ కృత్రిమ రత్నము కాదు. కేవల చరిత్ర కాదు. ఆచార్య భీమశంకరము వ్రాసిన - "రసస్రువు" సానపట్టిన జాతి రత్నము. ఇతివృత్తము వేము వంశ గాథ కావున - రచయితకు

ఆత్మీయమైన ఊష్మలత కగ్గలమైనది. ఇందు ప్రాచీన ప్రబంధమునకు అనువైన ఆష్టాదశ వర్ణనలకు బదులు - నవీన వర్ణనలు అమరి, ఇందలి ఇతివృత్తమునకు వస్త్వైక్యము సంఘటించినవి.

గోదావరీ మహానది వర్ణనము. మహేశ్వరోపాసన. నాట్యకళారాధన. దుర్గమారణ్యములు పర్వత సీమలు. పట్టిస క్షేత్రము. నందికేశ్వరము. ఈ అభినవ ప్రబంధమునందలి ప్రకృతి వర్ణనలు సహజ సుందర మనోహరములు కథా వస్తువు ప్రకారము ఈ ప్రబంధము అభినవ పట్టిస వీరభద్ర విజయము రచయిత - దక్షారామ భీమేశ్వర ప్రసాద జన్ముడు గోదావరి దక్షిణ గంగ. త్ర్యంబకేశ్వర కాళేశ్వర పట్టిస దక్షారామ కోటిపల్లి శైవక్షేత్ర వాహిని ఆచార్య భీమశంకరం పెద్దకూతురు డాక్టరు శ్రీమతి గొర్తి లక్ష్మి - శివరాత్రినాడు జన్మించినది ఈ ప్రబంధములో ప్రధానపాత్ర వేము ముని పరమ మాహేశ్వరుడు. ఆచార్య భీమశంకరము కలములో కవితా గోదావరి ప్రవహించి రసస్రువు ప్రబంధము పరమ శివారాధనా వాతావరణములో నిబిడీకృతమైనది. ఆచార్య భీమశంకరం సుగృహీత నామధేయుడైన విజ్ఞాన శాస్త్ర వేత్త మాత్రమే గాక ఆంధ్ర వాఙ్మయ జగత్తులో చిరస్మరణీయుడైన కారణజన్ముడు. సత్కవీశ్వరుడు

ఆచార్య భీమశంకరం వ్రాసిన నవీన ప్రబంధం - "రసస్రువు" ఆంధ్ర వాఙ్మయ ప్రపంచములో ముయ్యేలగుట్ట అందలి మూడు ఎల్లలు: 1 ప్రౌఢ సాహితీ శైలి; 2 ఛందో విశ్వరూప ప్రదర్శనం; 3 ఆధ్యాత్మిక వేదాంత దర్శనం

ఈ కావ్యంలో ఎడనెడ ద్రాక్షాపాకం - <u>కదళీ</u> పాకం లేకపోలేదు గాని అధిక స్థాయిలో కనిపించేది ప్రౌఢసంస్కృత సమాసభూయిష్ఠమైన <u>నారికేళపాకమే</u> విజ్ఞాన స్ఫురణకు అనువుగా సూత్ర ప్రాయముగ చెప్పవలెననిన,

$$\text{ఆచార్య భీమశంకరం} = \frac{(\text{శ్రీ కృష్ణ దేవరాయలు} + \text{విశ్వనాథ సత్యనారాయణ})}{2}$$

రసస్రువు - ఆముక్తమాల్యదా ప్రబంధం కోవకు చెందునట్టిది. భీమశంకరమునకు సనాతన సంస్కృతిపై - సంస్కృత భాషపై గల అభిరుచి అభినివేశాలకు అతని పద్య శిల్ప సౌష్టవం ఉదాహరణ ప్రాయము.

అలనాడు ప్రభువైన శ్రీకృష్ణదేవరాయలు తెలుగులో ఆముక్తమాల్యద వ్రాసి యున్నాడు. నేడు-విజ్ఞాన వేత్త-భీమశంకరం తెలుగు ప్రబంధం వ్రాసినాడు.

ఆ॥వె॥ రక్తికట్టు - కృష్ణ రాయలే ప్రవచింప
"దేశ భాష లందు తెలుగు లెస్స"
పెద్దన అదె అన్న - పేలవమ్ముగ దోచు
తెలుగు లెస్స అనుచు తలప రెవరు.

వృత్తిచే తెలుగు ఉపాధ్యాయులు తెలుగులో కవితవ్రాయడంలో విశేషం లేదు. అర్థ శాస్త్ర వేత్త - అంతర్జాతీయ విఖ్యాతిని ఆర్జించిన ఆచార్య రామనాథం సవ్యసాచియై పద్య గేయ ప్రబంధాలు వ్రాసినారు. అణ్వింధన శాఖలో ఉద్యోగి ఆచార్య ఫణీంద్ర, ఉండేలు మాలకొండారెడ్డి, సాహిణి లక్ష్మిపతిరావు మున్నగు ఇంజనీరులు తెలుగు పద్య రచన చేయుట ముదావహం తెలుగువారు గర్వించదగిన విషయం ఆచార్య శ్రీ భీమశంకరం తెలుగులో ప్రౌఢ పద్య ప్రబంధం నిర్మించుట.

ఆ॥వె॥ పద్య కవిత యందు - పాల మీగడ గడ్డ
భీమశంకర కవి బెళుకు రచన;
శైలియందు - నారికేళ పాకమయమ్ము;
ప్రౌఢ భావ రస నిరంతరమ్ము

ఆధునిక వాఙ్మయ యుగ కర్తగా పలువురిచే ప్రశంసింప బడిన శ్రీ గురజాడ అప్పారావు గారు కోరినది - "క్రొత్త పాతల మేలి కలియిక" - కేవల నూతనత్వం కాదు. శైలిలో భావములలో ఆచార్య భీమశంకరం కవిత -

"క్రొత్త పాతల మేలి కలియిక"

ఈ రచయిత వేదాంతి  పలుతావులలో రచయిత అద్వైతమును నవ్య విజ్ఞాన శాస్త్ర వాదములను - సామరస్య సమన్వయం - సలిపినాడు  శ్రీ భీమశంకరం మేటి కవులలో మేధావి  మేటి మేధావులలో మేటి కవి

ఆ॥వె॥  వియ్యమందె - కవిత విజ్ఞాన శాస్త్రమ్ము
ప్రౌఢ  భీమశంకర  రచనమున;
సహృదయులకు - మానస దిగంతరాళముల్
పెరిగి - విశ్వ మెల్ల  విస్తరించు

# ఛందో విశ్వరూప ప్రదర్శనము.

ఆచార్య భీమశంకరం వ్రాసిన ఆధునిక ప్రబంధమునకు ఆంధ్ర సాహితీ చరిత్రలో అద్వితీయ  స్థానము ప్రాతఃస్మరణీయ యశస్సు కల్పించే అంశం ఛందో విశ్వరూప ప్రదర్శనం.

విశ్వ సాహితీ జగత్తులో ఆంధ్రకవితకు ఉన్న విశిష్టత - ఛందో వైవిధ్యం  వేయి సంవత్సరాలుగా వెల్లివిరిసిన పద్య కవితలో - చంపకమాల, ఉత్పలమాల, మత్తేభ శార్దూలాలు  మున్నగు  వృత్తాలు - సీసం, కందం, తేటగీతి, ఆటవెలది మున్నగునవి విరివిగా,  మత్తకోకిల, స్రగ్ధర, తరువోజ, కవిరాజ విరాజితము, మరి కొన్ని ఛందస్సులు విరళంగా కవులు వాడి యున్నారు. నన్నయ భావానుగుణముగా లయవిభాతి మున్నగు ఛందాలు వ్రాసినాడు తిక్కన ఎన్నో క్రొత్త ఛందస్సులను స్త్రీ పర్వములో వాడియున్నాడు. అస్మద్గురు వరేణ్యులు కవిసమ్రాట్ విశ్వనాథ వారు తమ "శ్రీమద్రామాయణ కల్పవృక్షము" నందు మరికొన్ని అసాధారణ ఛందములు వ్రాసి యున్నారు. అయితే - ఆచార్య శ్రీ భీమశంకరం వ్రాసిన ప్రబంధము రసస్రువులో సాక్షాత్కరించు ఛందో విశ్వరూప ప్రదర్శనం మరి యే సమకాలిక తెలుగు

కావ్యములో కనిపించదు ప్రసిద్ధికి ఎక్కిన ఛందస్సులతో పాటు లక్షణగ్రంథాలలో మాత్రమే గోచరించే ఛందస్సులు విరివిగా ప్రదర్శించిన విశిష్టత శ్రీ భీమశంకరమునకు దక్కినది

అంతేగాక భీమశంకరము గర్భ కవితలు కొన్ని సమకూర్చి యున్నాడు. అవి క్లిష్ట ప్రహేళికలు అందలి నిర్మాణ సామర్థ్య చాతుర్యములు తెలిసిన ఉద్దండ పండితులు - గర్భ కవితలను అనుశీలించిన వారందరూ - చూసి అగ్గింపగలరు.

ఆ।।వె।। ఛంద మందు జొన్పి - సర్కస్సు గరిడీలు
గొప్ప గర్భ కవిత కూర్చ నగును;
పద్య శిల్ప సౌష్ఠవ ప్రభా రింఛోళి
గర్భ కవిత యందు - క్రాలు చుండు

ప్రాచీన ప్రబంధములలో ఒకటి రెండు గర్భ కవితా పద్యాలు కనిపించుచున్నవి. శ్రీ భీమశంకరం ఏడెనిమిది గర్భ కవితా పద్యాలు వ్రాసినాడు. అవి అతని పద్య నిర్మాణ శక్తి సామర్థ్యాలు వెల్లడించునట్టివే గాని - కవితా గమనమును కుంటుపరచు నట్టివి గావు.

సంస్కృత మహా భారతమున వ్యాస ప్రోక్తములైన "కూట శ్లోకములు" - గర్భ కవితను శబ్దార్థముల మించునవి ఉన్నవి. హిమాలయ పర్వత పంక్తులలో జన సామాన్యమునకు అందని గౌరీశంకర్- కాంచనగంగ - ఎవరెస్టు శిఖరము లేల ఉండవలె? అవి - విశ్వ శిల్ప శిఖరాయమానములు. దోసిట పారిజాతము లధోముఖియై కవితా కన్యక విరజిమ్మ వచ్చును. శిరీష కుసుమ పేశల సుధామయోక్తులును జన రంజకములు. నారికేళపాకమును మించు 'వజ్ర పాకములు' - కూటశ్లోకములు. గర్భ కవితలు సారస్వత శిల్ప శిఖరాయమానములు - జనసామాన్యమునకు దురవగాహములైనను, అక్షర సమామ్నాయ శిల్ప శిఖరోన్నతములు. కవి- శక్తి సామర్థ్యములకు పతాకా ప్రతీకములు.

ఆచార్య భీమశంకరము వ్రాసిన పద్య కవితా ప్రబంధము - రసస్రువు - నాకు నచ్చినది నేనీ కావ్యమును మెచ్చుకొనుటకు పెక్కు కారణములు ఉన్నవి అందులో కొన్నింటిని చర్చించుట అవసరము

1. తెలుగు పద్యమునకు సహజ కవచ కుండలములు యతి ప్రాసలు భీమశంకరము వ్రాసిన ప్రతి పద్యములో వేయి యేండ్ల తెలుగు వెలుగు పునాది కన్పించుచున్నది. యతులు సహజ సిద్ధములు. స్వయం వ్యక్తములు ప్రాసలు బహుళముగా 'బిందు పూర్వకములు' లేదా 'ద్విరుక్తములు'. ఇవి కవితా గానమునకు మృదంగ నాదం చేకూర్చునవి. శ్రవఃపేయములు. ఆచార్య భీమశంకరం పద్యాలలో దుష్కర ప్రాసములుగా ఎన్నదగినవి ఎన్నో ఉన్నవి. అయితే - ఆ ప్రాసలు అలవోకగా సహజసుందరములుగా సాక్షాత్కరించునట్టివే తెలుగు కవులు వేయి సంవత్సరాలు చేసిన సాధనా తపస్సు - పద్య శిల్ప సౌష్ఠవం ఆచార్య భీమశంకరం కవితలో సిద్ధి పొందినది

ఉ|| ఎక్కడ నుండి వచ్చెను? కవీశ్వర - చెచ్చెర - భీమశంకరా!
చిక్కని చక్కనౌ కవిత - చిందులు త్రొక్కెడి మిన్నువాకయై
మిక్కుటమైన వెల్లు మిరుమిట్లను గొల్పుచు - తెల్గు బాసలో
గ్రక్కున తేనెపట్టులుగ కన్పడు ప్రాసములున్ వడుల్ సదా!

భీమశంకరం కవిత చదువుచున్నపుడు - దీపావళి పండుగ స్మరణకు వచ్చును.

ఆ||వె|| కవిత మ్రోగగలదు - కంచు ఢక్కావోలె
పృథివి దద్దరిల్లు పేర్మి తోడ;
తేజరిల్లు కవన దీపావళిని కూర్చి
భీమశంకర కవి కవితా మతల్లి.

2. "ఇది పద్య కవితాయుగము కాదట.
పద్యం పగిలి పోయిన అద్దమట!" -

ఇది వచన కవితా యుగమట!! ఐదంయుగీనులైన వచన కవులు నోరు కలవారు. అల్ప సంఖ్యాకులైనను వారు విజృంభించి - "మా వచన కవితలనే దుడ్డు కర్రలతో పద్యాల నడుములు విరుగ గొట్టగలము" అని డబాయించు చున్నారు. ఆ దుడ్డు కర్రలు విరిగినవి గాని పద్య కవితా సరస్వతి నడుము విరుగలేదు.

నేటికీ ఒక సమస్య ఇచ్చినచో - దానిని హృదయంగమముగా పూరించగల సమర్థులు - కవులు తెలుగునేల నాలుగు చెరగులలో అసంఖ్యాకులు, సజీవులని ఆకాశవాణి నిరూపించినది. ఈ మధ్య గూడ ఎన్నో పద్య కావ్యాలు వెల్లివిరిసినవి. ఆచార్య శ్రీ వేమూరి వేంకట రామనాథంగారి కావ్యపరంపరలు-- విరిసరులు ఇత్యాదులు, శ్రీ యార్లగడ్డ సుబ్బారావు గారి కాకతీయ తరంగిణి, బేతవోలు రామబ్రహ్మం గారి వరద గోదావరి, బులుసు వేంకటేశ్వర్లుగారి మువ్వ, రాళ్లపల్లి కవితా ప్రసాదుగారి కాదంబని.

ఆచార్య భీమశంకరం రసస్రువు 700 పద్యాల ప్రౌఢ పద్య కవితా ప్రబంధం - తెలుగు పద్యం చిరంజీవి అని ఋజువు చేయు చున్నది. ఆంధ్ర దేశంలో నేడు ఆశు పద్య కవిత చెప్పుచున్న అష్టావధానులు సహస్రాధిక సంఖ్యాకులు. శతావధానులు శతాధిక సంఖ్యాకులు. సహస్ర, ద్విసహస్రావధానులు గూడ ఉన్నారు.

ఆ॥వె॥ చదల యందు - సూర్య చంద్రులుండెడి దాక
ఉర్వి మీద కొండ లుండు వరకు;
జగతి వరలు దాక - శబ్దార్థ సంక్రాంతి
బ్రతికియుండు తెలుగు పద్య కవిత.

3 నేడు పద్య కవితలు వ్రాసేవారు తల యెత్తుకొని తిరుగుటకు భయపడు చున్నారు కాని ఆచార్య భీమశంకరం తల యెత్తుకొని ధైర్య సాహసాలతో తాను పద్య కవినని చాటుకొన్నాడు అంతేగాక - ఒక చక్కని చిక్కని సుదీర్ఘమైన

ఉత్పలమాలిక వ్రాసి - వచన కవితను అధిక్షేపించినాడు

"ఉన్నది ఉన్నయట్లుగ అనుక్త దిగంబర గీత లల్లినన్
కన్నది కన్నులన్ వచన గాథలు చెప్ప కవిత్వమౌనె? ఏ
మున్నది రక్తి గొల్ప?..... ... మనోజ్ఞ భావమా!
సన్నుత కావ్య వస్తువ! రసంబు! అలంకృతి! శైలి! అర్థ సం
పన్నమ!............." అని ఎలుగెత్తి చాటగలిగినాడు

అసలు సిసలైన కవిత వ్రాయుటకు - గణాలు, యతి ప్రాసలు -ఛందస్సు చాలదు కవి భావములు సమగ్రంగా విశదీకరించగల శక్తి - ప్రపంచములో ఏ భాషలోని శబ్దాలకు లేదు అందుచే కవి ఛందస్సుకు అతీతమైన అనురణన ధ్వనిని ఉపాసించ వలసి వచ్చును భీమశంకరం నాదబ్రహ్మోపాసకుడు ఛందస్సుకు అతీతమైన శ్రుతి లయలు ఉపాసించినవాడు అతని పద్యాలు సులువుగా అర్థంకావు. ద్రాక్షా పాకంలో పదలాలిత్యమును ఉపాసించి ప్రజా రంజకుడైన కరుణశ్రీ - పద్యాల తరువాత నారికేళ పాకంలో వ్రాసే ధైర్యం పుంజుకున్న కవితా శౌర్యసాహసాలు ప్రదర్శించిన వాడు భీమశంకరం.

మా గురువర్యులు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి అభిభాషణ: "పద్యం అర్థంకాక పోతే - పూర్వకాలంలో పరితది తప్పు అనేవారు నేడు కవిది తప్పు అంటున్నారు " భీమశంకరం - ప్రౌఢనిర్భరవయఃపరిపాకంలో ప్రౌఢపద్యప్రబంధము వ్రాసినాడు.

నేడు ఆచార్య భీమశంకరం - లోగడ శ్రీకృష్ణదేవరాయలు సాహితీ సామ్యవాదులు కారు అభిజాత్య సాహితీ వర్ధిష్ణువులు. వారిది సాహితీ ప్రజాస్వామ్యము కాదు.

సాహిత్యమునందే గాక నిజ జీవితమునందు కూడ సదా ప్రథమ స్థానములో నిలిచినవాడు భీమశంకరం.

ఆ॥వె॥ రెండవ రకమునకు గుండెలో స్థానమ్ము
ఆత డివ్వ డెపుడు - ప్రాగ్రసరుడు;
బ్రతుకు తెరువులందు- పరిపూర్ణతను కోరు
భీమశంకరమన - భీతి కలుగు.

అతడు ఇల్లు కట్టినచో మహారాజ ప్రాసాదముగా భాసించవలె. గృహప్రాంగణమున వ్రేలాడే మంజు మంజుల విద్యుద్దీప కళికా మంజరీ మంజూషిక - ధగద్ధగాయమానముగా వెలుగందవలె. అచ్చువేసిన గ్రంథములు - అందలి అక్షరములు అంద చందములకు ఆలవాలము కావలె.

శ్రీ భీమశంకరం - జీవితంలో, సాహిత్య జీవితంలో మూర్తీభవించిన రాజసము. మత్తేభగమనుడైన భీమశంకర కవీశ్వర సాహితీ మందహాసము మధురోదాత్త రస భావ సముత్తేజకరము.

ఇక - చిట్టచివరి మాట ఒకటి చెప్పవలసియున్నది. ఇది 1998 వ సంవత్సరం. 1945-47 సంవత్సరాలలో భీమవరం కళాశాలలో భీమశంకరమునకు తెలుగు పద్య పారమును చెప్పు అదృష్టము నాకు పట్టినది. అర్ధశతాబ్ది పైబడి భీమశంకరం కవితా ప్రతిభ - "సమాధి" నిష్ఠాగరిష్ఠమై నిల్చినది. రాజశేఖరుడు తన కావ్య మీమాంసలో

ప్రతిభ = భావయిత్రి + సమాధి + కారయిత్రి

అన్నాడు. నవనవోన్మేషమైన ప్రజ్ఞాశాలిని ప్రతిభకు ఇంతటి సుదీర్ఘ సమాధి నిష్ఠ - కవులలో లభించుట అరుదు శ్రీ భీమశంకరమునకు లభించినది. అందుచే ఇంతటి ప్రౌఢ కవిత నతడు వ్రాయ గలిగినాడని నా అభిప్రాయము.

కం॥ రస మేతత్ బ్రహ్మానం
ద సహోదరమని వచించినారు కళా లా
లసు లగు లాక్షణికు లదియె
సుసుధీ గళముల వెలసె "రసో వై సః"గా

ఈ రచయిత భూభౌతిక శాస్త్రవేత్త ఈతని అద్భుత రచనా ప్రక్రియ ఒక భౌగోళిక వైచిత్రి - భూమిలోపలి రాతిపొరలను, మట్టిని చీల్చుకొని పైకుబికిపడు జెల వలె, నీటి బుగ్గ వలె, చిమ్మన గొట్టము నుండి పెల్లుబుకు మధుర రస స్రవంతి వలె - కవితా ధారాపాకము భీమశంకరములో స్వయం వ్యక్తమైనది ఇది సహజ సాహితీ రసస్రువు

ఆ॥వె॥ నేల చీల్చు కొనుచు నింగిపై కెగ జిమ్మ
ఊట నీటి ధార - ఉబుకు నట్లు
వ్రాయు భీమశంకర కవి దుందుడుకుగా
గగన మంటు కవిత - కలము కదిపి

ఆంధ్ర పద్య సాహితీచరిత్రలో చిరస్మరణీయ స్థానము నార్జించుకొనిన ఆచార్య భీమశంకర సత్కవీశానునకు నా అభినందనములు

25-2-1998,
శివరాత్రి,
పట్టిస క్షేత్రం

నండూరి రామకృష్ణమాచార్య
రాష్ట్రస్థాయి అధ్యక్షుడు, ఆంధ్ర పద్య కవితా సదస్సు.
ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వ అధికారభాషాసంఘ పూర్వాధ్యక్షుడు.
420, పి.జి.రోడ్డు, 35 జవహర్ నగర్, సికింద్రాబాదు-500003
ఇంటిఫోను 817397

# స్వగతము.

కవిత్వరచనా వైభవము దైవదత్తమని పెద్దలందురు. ఈ సూక్తి నా పట్ల వర్తించి నట్లనిపించును. నేను తెలుగుభాష ప్రత్యేకించి అధ్యయనము చేయలేదు. సంస్కృతము నేర్చుకొన లేకపోయితిని. ఈ భాష యందు మా కుటుంబున కున్న గౌరవాభిమానముల మూలమున, నా కా దేవభాషలో ఏ కొలదిపాటి పరిచయము నయిననూ కలుగజేయవలెనన్న మా నాయనగారి ఉత్సాహ నిర్ఝరి ఆంగ్లేయ భాషా భిత్తిక నధిగమించ జాలక, వ్యాకరణములో రామ శబ్దముతోడనూ, అమరములో 'యస్యజ్ఞాన దయాసింధో' తోడనూ ఆగిపోయినది.

ఇంటర్మీడియట్ దాకా తెలుగు రెండవ భాషగా నేర్చితిని. అప్పటి దాకా నయినను అన్ని క్లాసులయందును అత్తెసరు మార్కులతోనే ప్యాసవుతూ వచ్చితిని. కాని పాఠ్యభాగములలోని పద్యములన్నియు కంఠతా వచ్చెడివి. వీటిలో చాలామటుకు ఇప్పటికీ గుర్తున్నవి. గణ, ఛందో పరిచయము పది రెండవ ఏటనే కలిగినది. అలంకారములు, సమాసముల నామ నిర్ణయములు, వ్యాకరణము మాత్రం కొరకబడినవి కావు. పెద్ద పెద్ద సమాసములు, సంధులు చేయుట మాత్రం సులువుగనే వచ్చుచుండెడిది. మనకు తెలుగు వ్యాకరణము నేర్పెడి పద్ధతిలో ఏదైన లోపము గలదేమోనని, దీనినిబట్టి నాకు పెద్దయినాక అనిపించినది.

ఏది ఏమైనను, నా తెలుగు భాషాపఠనము అంతటితో ఆగిపోయినది. ఆ తదుపరి నాకు భౌతిక శాస్త్రముపై ఆసక్తి ఏర్పడి, ఆ శాస్త్రముతో పట్టభద్రుడనైతిని.

ఆ సంవత్సరమే, క్రొత్తగా ఆంధ్ర విశ్వవిద్యాలయములో, నిజమునకు యావత్భారతములోనూ భూభౌతిక శాస్త్రాధ్యయనము ప్రవేశ పెట్టిరి. క్రొత్త దగుటవలన, తెలుసు కొనవలెనను జిజ్ఞాసతో నేనా కోర్సునందు జేరి పోష్టు గ్రాడ్యుయేటు పట్టా పొందితిని. తదుపరి ఆ విద్యాలయము నందే అన్వేషక భూభౌతిక శాస్త్రములో డాక్టర్ ఆఫ్ సైన్సును దేశమునుండి ప్రథముడిగా పొంది, నా వృత్తి జీవితమును శాస్త్ర పరిశోధనా వ్యాసంగములో గడుపుటకు నిశ్చయించు కొంటిని.

నాకు తెలిసిన ఏ శాస్త్ర విషయము నైనను ఇంకొకరికి తెలియచెప్పుటలో నాకు తృప్తి, ఆనందమూ అధికముగా కలుగు చుండెడివి. అందువలన, అధ్యాపక వృత్తిలో ఆ విశ్వవిద్యాలయము నందున ప్రవేశించితిని. తదుపరి ఉస్మానియా విశ్వవిద్యాలయమున చేరుటయు, అక్కడ యావత్భారతదేశ మందున పెద్దదగు భూభౌతిక శాస్త్ర విభాగమును సోవియట్ యూనియన్ సాంకేతిక సహకారముతో నేర్పరచు మహదవకాశము కలిగి, నా వృత్తి జీవితమునకొక ఉత్తేజమునూ, ఈ శాస్త్ర రంగములో నొక ప్రత్యేక శాశ్వత స్థానము నూ సాధించ గలిగితిని. ఆ విధముగా నా జీవితాసక్తి, ఆశయము భూభౌతిక శాస్త్ర పరిశోధన, బోధన వ్యాసంగములతోనే పూర్తిగా నిండిపోయినది అవే నన్ను పెంచి పెద్దచేసినవి ఈ ఆసక్తి, అభిజ్ఞతే నన్ను యూరోపాలోని అనేక దేశములను, ఆష్ట్రేలియా, అమెరికాలను వివిధ పర్యాయములు సందర్శించు అవకాశమును కల్పించి, అచట ఉన్నత విద్యాభ్యాసమునకు, శాస్త్ర పరిశోధనలకు, అధ్యాపకత్వమునకు, విజ్ఞాన సభలలో పాల్గొనుటకు దారితీసి, నా మానసిక పరిధిని విస్తృత పరుచు కొనుటకు అవకాశముల నిచ్చినవి

ఇంగ్లాండులో నొక నోబెల్ లారియట్టయిన మహామేధావి లార్డ్ పి యమ్ యస్ బ్లాకెట్ గారి వద్ద ఆనాడు అతినూతనమైన శిలా అయస్కాంత శాస్త్రములో పరిశోధన చేయగలిగితిని. ఈ భూభౌతికశాస్త్ర జ్ఞానమే నాకు అనేక శాస్త్ర, సాంకేతిక పరిశోధన వ్యాసముల కర్తగాను, అంతర్జాతీయముగా పేరెన్నిక గన్న శాస్త్ర గ్రంథముల రచయిత గాను ఖ్యాతిని తెచ్చినవి. ఉస్మానియా విశ్వ విద్యాలయమునందు వివిధ విజ్ఞాన శాస్త్ర విభాగముల పరిషత్తునకు విజ్ఞానాచార్యుడను (డీన్, ఫాకల్టీ ఆఫ్ సైన్సెస్) కాగలిగితిని.

భారతదేశములో ప్రప్రథమముగా అన్వేషణా భూభౌతిక సమాఖ్యను స్వచ్ఛంద సంస్థగా నేటికి ఇరువదిరెండు సంవత్సరముల క్రితము ఏర్పరిచితిని. ఈ సంస్థ నేడు గణనీయమైన అభివృద్ధిని సాధించి, అంతర్జాతీయ స్తోమత నలవరచుకొని, ఈ శాస్త్రమునకు, శాస్త్రజ్ఞులకు విశిష్టమైన సేవ చేయుచున్నది. అంతర్జాతీయ గుర్తింపుగొన్న భారత విజ్ఞానశాస్త్ర పరిషత్తునకు సభ్యునిగ (ఫెలో ఆఫ్ ఇండియన్ నేషనల్ సైన్స్ అకాడమీ) ఎన్నుకొనబడి, ఈ దేశమున ఏ శాస్త్రజ్ఞుడైనను గర్వింప తగిన గౌరవమును చూరగొంటిని. నాటి ఆంధ్రప్రదేశ ముఖ్యమంత్రి, బహుజన ప్రియ నాయకుడు నయిన శ్రీ నందమూరి తారకరామారావు గారు నన్ను మన రాష్ట్ర ఖనిజాభివృద్ధి సంస్థకు అధ్యక్ష, కార్యనిర్వాహక పదవి నలంకరింపుడని కోరెడి అవకాశము నిచ్చినవి. ఈ వృత్తి వ్యాసంగములే అనేక శిష్యపరంపరలను మన రాష్ట్రములోని రెండు విశ్వవిద్యాలయము లందునను, హాలండు లోని అంతర్జాతీయ శిక్షణాసంస్థ యందునను తయారుచేయు అపూర్వావకాశమును, తృప్తిని ఇచ్చినవి.

ఇప్పటికి నే నీ శాస్త్రమునందు నలుబది ఐదు సంవత్సరములు పైబడి కృషిచేయగలిగితిని. ఈ నాడు నా శిష్యులనేకులు ఈ భూభౌతికశాస్త్ర పరిశోధన రంగమున ముందంజ వేసి, భారత దేశమందునను, విదేశములందునను గల వివిధ సంస్థలలో, నా కన్నను ఉన్నత స్థానము లధిరోహించుచున్నారు. ఇక ఈ శాస్త్ర భవిష్యదభివృద్ధి వారి హస్తములలో నుంచి, నేను ఇతర వ్యాసంగముల యందు శ్రద్ధ వహించుట యుక్తము, అవసరమని నా అభిప్రాయము.

ఈ విధముగా నే నీ మధ్య తెలుగు పద్యరచన పై దృష్టి మరల్చితిని దీనికొక ప్రోద్బలము, ప్రోత్సాహము గలవు. మా అమ్మగారు విదుషీమణి. మా నాయనగారికి సంస్కృతము పైననూ, వేదము పైననూ అభిమానము మెండు. నాకు ఊహ తెలిసిన నాట నుండి ప్రతిదినము ప్రొద్దున లేచినది మొదలుగ మా అమ్మగారు వల్లించెడి భారత భాగవతాది పురాణ గ్రంథములందలి పద్యమయ ప్రపంచమున విహరించు చుండెడివాడను. ఆ పద్యము లన్నియు నాకు కంఠస్థమగుటయే గాక, పద్యములలోని మాటల అర్థమును, పద్యముల భావమును ఎరుంగలేని వయస్సుననే, పద్య గమనము పైననూ, అందలి శబ్ద చాతురి పైననూ మక్కువ గలిగియుండెడి వాడను. ఆ వాసనా మూలమున, నా మనస్సు పద్య రచనపైన మరలినది.

ఏదో చిన్నతనమున వ్రాయ ప్రయత్నించిన అస్తవ్యస్తపు పద్యములే గాని, ఈ మధ్యకాలము వరకు పద్యరచనపై ప్రత్యేక శ్రద్ధ చూపలేక పోయితిని. కాని, నా ఉద్యోగ జీవితము నందున గూడ మనోహ్లాదము కొరకు భారత, భాగవత, రామాయణాది గ్రంథముల లోని కొన్ని భాగములను తరచు చదువుచుండెడి వాడను.

ఈ మధ్య వెలువడిన పద్య కవిత్వముతోగాని, విప్లవ, స్వతంత్ర, వచన, దిగంబరాది కవితలతో గాని నాకు పరిచయము తక్కువ. ఎప్పుడైనను వారపత్రికలు తిరుగ వేసినపుడు ఈ ప్రక్రియలు జన బాహుళ్యమున అధికప్రచారము, ఆదరణ పొందుచున్నటుల గ్రహించ గలిగితిని గాని, నా అభిమానము పద్యకవిత యందే కొనసాగినది.

నేను 1991 నవంబరులో ఉద్యోగ విరమణ చేసితిని అయితే, 1996 వరకు ఐదు సంవత్సరములపాటు ఎమెరిటస్ శాస్త్రవేత్తగా భారత ప్రభుత్వ గౌరవ వేతనము మీద నుంటిని. ఈ సమయము నా సంపూర్ణ ఉద్యోగ విరమణకు క్రమేణా దారితీయుటకు ఉపయోగ పడినది ఈ కాలము లోనే భగవత్ స్తుతిగా కొన్ని, చాటువులుగా కొన్ని పద్యములు రచించుట మొదలు పెట్టితిని.

రాను రాను నాకు విడి పద్యములుగాక పద్యగద్యములతో నొక చంపూ గ్రంథమును రచింపవలెనను అభిలాష కలిగినది. ఈ కోరిక కార్య రూపము దాల్చుటకు మా పెద్ద కుమార్తె చి.సౌ. ప్రొఫెసర్ డాక్టర్ గొర్తి లక్ష్మి, యమ్. డి., ప్రోత్సాహము సహకరించినది. తగిన కథావస్తువు కొరకు యోజింప మొదలిడితిని. ఆ సందర్భములో నా చిన్ననాట మా పినతాతగారి కుమారుడు శ్రీ వేము రామకృష్ణమూర్తిగారు (పోలవర గ్రామ వాసి) మాకు పదే పదే చెప్పిన మా వంశోద్భవ గాథలు గుర్తునకు వచ్చినవి.

ఇవిగాక, మా తల్లిదండ్రులు చెప్పిన ఆసక్తిదాయకమైన ఘట్టములు, మా బంధుగులలో వృద్ధులు కొందరు నా కోరికపై తెలిపిన వంశానుక్రమణికలు గూడ జ్ఞాపకమునకు వచ్చినవి.

అవి అన్నియు క్రమరీతిని క్రోడీకరించిన రసవత్తరమైన కథాసంకలనము కాగలదని, అట్టి రచన కవితా శిల్ప ప్రదర్శనకు సావకాశము నిచ్చుటయేగాక, మా పితృదేవతలను స్మరించు తృప్తిని కలిగించును గాన తప్పక ప్రయత్నించ వలెనని తలంచితిని. కాని, తుదకు గ్రంథవిస్తర భీతిచే నాకు తెలిసిన మావంశ చరిత్రనంతయు గాక, కేవలము రెండుప్రధాన కథలను మాత్రమే పొందుపరుప వలెనని నిర్ణయించితిని.

అందులో మొదటిది వేమువంశ పూర్వీకులైన వేమూరి కుటుంబము వేమూరు గ్రామమునందు దుండగులచే హత్యచేయబడగా, వారిలో నొక గర్భిణీ స్త్రీ మాత్రము తప్పించుకొని పారిపోయి పెంటపాడను గ్రామము చేరి తన ఇంటిపేరును 'వేము' గా మార్చుకొనెను. ఆమెకు కలిగిన కుమారుడే మా వేము వంశ మూల పురుషుడు రెండవ కథలో, కొన్ని తరముల తరువాత వేము వంశజుడొకడు మలకపల్లె అను గ్రామము నందు నివసించుచుండగా, ఆ గ్రామ భూస్వాముని ఏకైక పుత్రుని నరబలికై కొందరపహరించి అడవికిగొని పోవ, వేము వంశ పురుషుడు మన్యారణ్యమునకేగి, తన అసమాన నాట్య వైభవముననూ, వాక్చాతుర్యముననూ ఆ బలి నాపించి, బాలుని విడిపించి తండ్రి కప్పగించెను. కృతజ్ఞులైన ఆ కుటుంబము ఆ వేము వంశీయుని విగ్రహమును వారి పూజా మందిరమున నుంచి తరతరములుగా పూజింప జొచ్చిరి. శ్రీ వేము రామకృష్ణమూర్తి గారు తా మా విగ్రహమును మలకపల్లె యందు భూస్వాముల గృహమున తమ చిన్నతనమున చూచినట్లు నాతో చెప్పి యున్నారు

పై రెండు కథలను ఆధారము చేసుకొని, కొన్ని కల్పనలను. అతిశయోక్తులను, చారిత్రక సాంఘికపరమైన యూహలను మేళవించి. కొంత నాకు తెలిసిన విశ్వావిర్భావ శాస్త్ర విషయములను భారతీయాద్వైత సిద్ధాంతముతో సమన్వయపరుప ప్రయత్నించి, ఈ గ్రంథమున పొందు పరచితిని. ఆ విధముగా ఈ పుస్తకము, ఇందలి పాత్రలు, సన్నివేశములు చాల మటుకు ఊహజనితములు ఈ పుస్తకములో వేము వంశ చరిత్ర సూత్ర ప్రాయముగా మాత్రమే చెప్పుటకు వీలైనది. రచనలో పద్య శిల్పమునకు, శబ్ద సౌష్టవమునకు ప్రాధాన్యము నిచ్చితిని. తెలుగు పద్యసౌందర్యముపై నా కాసక్తి మెండు. ఆ అందమును ఆంధ్ర సాహితీ రసజ్ఞులతో పంచు కొనుటయే నా ముఖ్యోద్దేశము.

సంస్కృతాంధ్ర భాషలలో గల ఛందోవైవిధ్య మపారము. భారతీయేతర భాష లందు అనన్యసాధ్యము. దురదృష్టవశాత్తు ఈ విషయము విద్యాధికులకు తప్ప, చాలామందికి తెలియదు. మనకావ్య పురాణాది వివిధ సాహితీ ప్రక్రియలలో ఎక్కడో తప్ప, చాల మటుకు పది పదాఱు ఛందస్సులనే వాడిరి. ఆ నాటి ప్రయోజనముల కవి సరిపోయి ఉండ వచ్చును. కాని నేటి కథాకథన వైలక్ష్యమూ, గమనమూ వేరుగనున్నవి.

ఇతర ఛందస్సుల నెరుగవలెనన్న ప్రత్యేకముగానట్టి ఛందస్సులను ప్రయోగించిన పుస్తకములనో, లేక లక్షణ గ్రంథములనో సంప్రదించ వలసివచ్చును. నా ఉద్దేశములో అరుదుగా వాడబడిన తగు ఛందస్సులను వాడుటవలన చెప్పదలచిన విషయములను మరింత హృద్యముగా చెప్పవీలగును. వివిధ ఛందస్సులలోగల వివిధ గురు,

లఘు వర్ణ సంకలనములు పద్యమున కొక ప్రత్యేక శబ్ద గమనమును చేకూర్చి రసోత్పాదన నధికము చేయును.

ఈ శతాబ్ది లోని మహా కవులు కొందరు మాత్రా ఛందస్సులను వాడి కరుణ, భక్తి, శృంగార, భయానకాది రసముల సమర్థతతో పోషించుట మనకు పరిచితమే. అట్టి రసపోషణ సంప్రదాయ ఛందములతో గూడ సాధ్యమేనని నా అభిప్రాయము. ఒక కథా వస్తువును రచయిత ఒక గ్రంథమున గాని, ఒక దీర్ఘ గేయమున గాని చెప్పదలచినపుడు, రచన అంతయు ఒకే ఛందస్సున గాక (అది సంప్రదాయ ఛందమైనను, లేక అధునాతన మాత్రాబద్ధమైనను) ప్రత్యేక కథాసందర్భములకు వివిధ ఛందములను వాడిన, ఆ ప్రక్రియ అత్యంత రక్తి కట్టించకలదని నా నమ్మకము. ఆ ఉద్దేశముతోనే, నే నీ పొత్తమున అరుదైన కొన్ని ఛందస్సులను కొన్ని సందర్భములందు వాడియున్నాను. ఈ నా కృషి సమంజసమౌనో కాదో రసజ్ఞులైన పాఠకులే నిర్ణయింతురు గాక.

మరియొక విషయము. పురాతనమైన మన తెలుగు పద్యమునకు కొన్ని విశిష్టతలున్నవి. సంస్కృతములోని వివిధ ప్రక్రియలను ఉపయోగించుకొనగల కొద్ది భాషలలో తెలుగు ప్రధానమైనది. అంతియగాక, అట్టి వైచిత్ర్యములను సంస్కృతము నందు కన్ననూ హృద్యముగా తెలుగున ప్రయోగించుటకు వీలగునని పెద్దలందురు. ఉదాహరణకు, ఈనాడు బహు సాహితీ పిపాసవుల నాకట్టుచున్న అష్టావధాన, శతావధానములు. ఇట్టి శబ్ద వర్ణ చతురంగ విలాసములు కొన్ని భారతీయ భాషలలోనే సాధ్యము. ఇతర ప్రపంచభాషల కనూహ్యము.

అటువంటి పురాతనమైన ప్రత్యేక ప్రక్రియలలో కొన్ని చతుర్విధ కవిత్వములు. వీటిలో భాగమైన చిత్రకవిత్వముల* యందు గర్భ, బంధ కవిత్వములు ప్రధానమైనవి. ఒక ఛందస్సు లోనున్న పద్యములో (వచనములో నైననూ) ఇంకొకటిగాని, అంతకన్న ఎక్కువగాని ఇతర ఛందములు గల పద్యములు నిక్షిప్తమగునట్లు రచించుట గర్భ కవిత్వము.

బంధకవిత్వమునందు ఏదో ఒక రేఖాచిత్ర మందున్న గడులందు అక్షరములు విడివిడిగా గడికొక్కటి చొప్పున వ్రాయుదురు. అట్టి అక్షర ములనన్నిటిని ఒక నిర్ణీత క్రమములో కూర్చిన ఏదో ఒక ఛందము గల పద్యము రూపు దిద్దు కొనును. గర్భ, బంధకవిత్వము లతిక్లిష్టములై, రచయితకు ఛందస్సు పైనను, శబ్దాక్షరభావముల పైనను గల స్వాధీనతకు, ఆధిక్య సార్వభౌమత్వమునకు నిదర్శనములుగా ప్రకాశించును.

ఇట్టి కవిత్వములను పూర్వకవులు కొందరు తమ గ్రంథములందు అచ్చటచ్చట పొందుపరచినారు. కాగా తన ప్రబంధ మంతయు చిత్రకవిత్వముతో నింపిన ఘనత గణపువరపు వేంకటకవిది. 17వ శతాబ్ది మధ్యకాలమందు నివసించిన ఈ కవిచంద్రుడు తన 'శ్రీ ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసమ'ను** కావ్యము నంతయూ

---

* 'ఆశుకవితలు, అవధానములు-- చాటువులు'; రచయిత: డా|| కేతవరపు రామకోటి శాస్త్రి; ప్రచురణ: ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు, 1975.

** 'శ్రీ ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము'; గ్రంథకర్త: గణపవరపు వేంకట కవి; సంపాదకుడు: శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి; ప్రచురణ: ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు, 1977

శబ్దార్థాలంకార భూయిష్ఠంబగు చతుర్విధ కవిత్వములతో నింపెను. ఈతని శబ్దాక్షర లాఘవ ప్రదర్శనా దర్శకంబునూ, 'న భూతో న భవిష్యతి గా నుదాహరించ దగ్గ సీసపద్యము నందు అరువదికి పైబడి వివిధ ఛందములకు చెందిన గర్భిత పద్యములున్నవి.

గర్భ, బంధ, ఆశుకవిత్వములు (అవధాన కవిత్వములు ఆశువులే గనుక, వీటితో సహా) జన బాహుళ్యమునకు నిరర్థకమని నవీనులు కొందరు, ఆడంబర శబ్దార్థాక్షర ప్రదర్శనంబులైన సాముగరిడీలు గాని, ప్రతిభాగర్భితంబులు కావని పూర్వ లాక్షణికులు కొందరు విమర్శించిరి. ఈ అధిక్షేపణ సబబైనది కాదని నా అభిప్రాయము. ఉన్నది ఉన్నరీతిని వ్రాయు దిగంబరాది రచనలు తక్క, కవిత్వమనగానే కొన్ని ఉపమ, శ్లేష, ఉత్ప్రేక్షాది అర్థాలంకారములు, యమక, అనుప్రాసాది శబ్దాలంకారములు, భావ, రస పోషణల వంటి కొన్ని ప్రక్రియలుండి తీరవలయును. లేనిచో నది శాస్త్ర వ్యాసమో, దినచర్య పట్టికయో అగును గాని కవిత్వము కానేరదు. ఇది పద్యరచన కైననూ, గద్యరచన కైననూ వర్తించును.

ఆంధ్ర భాషావధూటి నలంకరించు సుందరాభరణములలో చిత్ర కవిత్వము లోకజాతికి చెందినవి. కొందరికి ఆ ప్రత్యేక భూషణంబు లన్న ఆసక్తి లేక పోవచ్చును గాని, అవి మరికొందరికి మనోహరములుగా నుండవచ్చును. ఈ నాడు అవధానము లెంతగా ప్రజాదరణ పొందు చున్నవో అందరెరింగిన సత్యమే కదా. అంతియ గాక, ఈ ప్రక్రియలు మన పురాతన సాహిత్య, సాంఘిక చైతన్య నిదర్శనంబులు గనుక వీటిని పోషించుట మన విధి యని నా ఉద్దేశము.

నాకు చేతనైన రీతిలో ఈ గ్రంథమున తొమ్మిది గర్భకవిత్వ పద్యములను కూర్చితిని వీటి ఔచిత్యమును పాఠకులే నిర్ణయింతురు గాక

ఈ పుస్తకమును, 1996వ సంవత్సరమున అమెరికా దేశము నందలి కాలిఫోర్నియా రాష్ట్రము లోని ఫ్రీమాంటు నగరమందు మా రెండవ కుమార్తె చి|| సౌ|| భారతాల సీత, యమ్. టెక్, ఆమె భర్త చి||మురళి, యమ్. యస్, యం. బి ఎ., ల స్వగృహము నందుండి పూర్తి చేసితిని. నా కీ సావకాశము నిచ్చుటయే గాక, తమకున్న తెలుగు సాహిత్యాభిమానమునకు నిదర్శనముగా, ఈ పుస్తక ప్రచురణకగు వ్యయమును తామే భరింతుమని వారు పట్టుబట్టుచున్నారు.

1997లో ఈ పుస్తకము నందు కొన్ని చేర్పులను మార్పులను చేసితిని. కాని ఎన్నడునూ తెలుగు కవిత్వమును వ్రాయుట, ప్రచురించుట చేయని వాడను గాన, ఈ నా రచన ప్రచురణ యోగ్యమగునో గాదో నిర్ణయించ జాలక కాలయాపన చేయుచుంటిని.

ఇది ఇటులుండ ఒకనాడు, 'ఆంధ్ర పద్య కవితా సదస్సు' యొక్క 'సూవనీరు' సంచికను డా|| నండూరి రామకృష్ణమాచార్యులు వారు ప్రచురించిరని దినపత్రికలో చదివితిని. శ్రీ ఆచార్యగారు మాకు ఒక అర్ధశతాబ్దమునకు ముందు నా ఇంటర్మీడియట్ నందు తెలుగు పాఠములను నేర్పిరి. వారి ముఖతః నేర్చుకొన్న భారత సభాపర్వములోని పద్యములు నాకింకనూ జ్ఞాపకమున్నవి. వారి అద్భుత వాగ్ధాటి, అసమాన బోధనాచాతురి నన్నానాడు ముగ్ధుడను చేసి గురు భావము నుదయింప చేసినవి. మావి వేరు వేరు మార్గంబు లగుటం జేసి, చాల సంవత్సరముల తదుపరి ఈ మధ్యనే తిరిగి కలసుకొంటిమి.

అయిననూ, ధైర్యముచేసి ఒకనాడు నేనాయన వద్దకేగి నా ప్రథమ ప్రయత్నముగా వ్రాసిన పద్య గ్రంథమును వినుడని కోరితిని. వారు పుస్తకము సాంతమును చదివించుకొని, దీనిని తప్పక ప్రచురించవలెనని ప్రోత్సహించుటయేగాక, ఎంతో ప్రేమతో తామే పుస్తకమునకు పీఠిక వ్రాసెదమని తెల్పిరి. ఈ అడగని వరమును పొంది నేను కృష్ణ సారథ్యము దొరికిన విజయుని పోలిక నుప్పొంగితిని. వ్రాత ప్రతిని వారి కొసంగి గ్రంథమును పరిష్కరింప చేసుకొంటిని. ఈ విధముగా ఈ పుస్తకమునకు ప్రచురణ యోగ్యత కల్పింప చేసిన మా మాష్టారికి నేను సర్వదా కృతజ్ఞుడను.

శా॥ విద్వత్పూర్ణ ముఖారవింద రమతో వీక్షింప, సాహిత్య సం
పద్విజ్ఞానము దృష్టిమాత్రమున నాపాదించు విద్యార్థులన్,
సద్విప్రోత్తమ ! ఎన్నగా తరమె నీ సంసిద్ధి ! నండూరి సం
విద్వంశోద్భవ ! రామకృష్ణ సుకవీ ! విజ్ఞాన విభ్రాట్ప్రతీ !

సీ॥ ఎవ్వాని ప్రతిపత్తి నీక్షింప గల్గును
సాహిత్య జిజ్ఞాస స్వాంతమందు,
ఎవ్వాని సూక్తుల నెన్నగా విన్నను
వాగర్థ సంగమ వ్యాప్తి కలుగు,
ఎవ్వాని కవనంబు నేపార చదివిన
ఆనంద డోలికా హర్ష మొదవు,
ఎవ్వాని భాష్యంబు నివ్వటిల్లగ జేయు
తెలుగుల వేయేండ్ల వెలుగు జిలుగు,

తే॥గీ॥ అతడు నండూరి వంశమహాశయుండు -
రామకృష్ణమాచార్యుండు రస విరాట్టు -
ప్రథితు "డాలోచ" నామృత గ్రంథకర్త,
పద్య కవితోద్య మోద్ధార పౌరుషుండు

కం॥ నండూరి రామకృష్ణులు
నిండారిన పద్యకవిత నీరాజనముల్
పండించె నాంధ్ర భాషా
పాండిత్య ప్రభ ననన్య పారీణతతో.

చ॥ అడిగిన వెంటనే, అనుపమాదర హార్దిక వృష్టితోడ, తా
నొడబడినాడు నా మొదటి ఉద్దియ పద్య కవిత్వమున్ వినన్,
వడివడి నవ్వుతోడుత ప్రబంధము చూచి పరిష్కరించె, నే
తడబడి పోతి పీఠికను తప్పక వ్రాయుదు నంచు చెప్పగాన్

ఉ॥ ఆ విధి ప్రోత్సహించి - నను అందల మెక్కగ జేసి, తెల్గులో
భావి వెలుంగు నీ కనుచు ప్రాజ్ఞ కవీంద్రులు రామకృష్ణులున్
వావిగ తెల్పి గ్రంథమును వ్యక్తము చేయగ నాకు నెంతయో
దీవన నిచ్చినారు, ఇవె దీవెనలంచు తలంచి మ్రొక్కెదన్.

మహాపండితులు పరిష్కరించిననూ, వ్రాసినది మిడిమిడి జ్ఞాని గాన, ఈ గ్రంథమున దోషములుండ వచ్చును. అవి అన్నియూ రచయితనైన నావి గాని వేరొకరివి కావు. సహృదయులు ఎత్తిచూపిన మున్ముందు సరి చేసుకొన గలవాడను.

ఈ పుస్తక ప్రచురణలో బాధ్యతను స్వీకరించి, ముఖ వర్ణ చిత్రమును సృష్టించి, తయారు చేయింప జేసిన ఒకనాటి నా విద్యార్థి, ప్రొఫెసర్ యాబలూరి శ్రీధరమూర్తికి, అతని బృందమునకు నా ఆశీస్సులు.

చక్కగా ముద్రించి, పుస్తకమును సర్వాంగ సుందరముగా తయారు చేసిన మిలింద్ ప్రకాశన్, సుల్తాన్ బజార్, హైదరాబాదు వారికి నా అభినందనలు.

హైదరాబాదు,
బహుధాన్య ఉగాది,
29వ మార్చి,1998. (వే. ల. సు. భీమశంకరము)

# విషయ సూచిక

| విషయము | | పుట |
|---|---|---|

# 1. భగవద్వందనము.

శా॥ శ్రీవాణీ గిరిజా కృపా విభవ సుశ్రేయంబు సంవాసమై,
నా వాసంబు సమజ్ఞ శాంతి సుఖ వాగ్జ్ఞానాయురారోగ్య శో
భా విఖ్యాతము, వంశవృద్ధియుతమై భాసింప సాష్టాంగినై
శ్రీ విశ్వంభరు బ్రహ్మ నీశ్వరుల సంసేవింతు నశ్రాంతమున్.

శా॥ ఆరంభించెద నూత్నపద్యరచనా వ్యాసంగ మౌహూర్తమున్
ప్రారంభంబున వేదమంత్ర నుతులన్ ప్రార్థించి పూజించుచున్
హేరంభున్, గణనాథు, దోషహరు, మత్తేభాస్యు, విఘ్నౌఘ సం
హారుం, నా మది నిల్పి వేడెద కవిత్వానంద సౌభాగ్యముల్.

క॥ కరిముఖుని వినుతి చేసెద
సరస విలాస కలిత సుఖసంసారముకై
సురపూజితు వర గణపతి
మరిమరి భజయింతు మహిత మంగళమూర్తిన్.

ఉ॥ డెందము పొంగ, నార్య తన డంభకు పుట్టువు తెల్పుచుండ, సా
మంద విశాలకర్ణ ముఖమండల తుండము నూపుచున్, నిజా
నందము తోడ సూక్ష్మనయనమ్ముల నవ్వులు చిందు శైల రా
ణ్ణందన నందనున్ ప్రమథ నాయకు మ్రొక్కెద విఘ్ననాశకున్.

వ॥ అని ఈ విధంబున ఒక్కనాడు పరమేశ్వర చింతనా మగ్నుండనయి, రసోచిత కవితా శిల్ప నిర్మాణ మనస్కత నొక్క కళాఖండంబు చెక్కందలంచి, శిలాశాస్త్రాభిజ్ఞుండ గావున, నా యుద్యమంబునకు తగిన అనన్యాదృశ వాస్తవ వస్తురూపంబు కొరకు వెదుకుచు, మదీయ పూర్వ పుణ్య ఫల పరిపక్వంబున మనంబు అంతర్గతంబై, నా జనన కారణంబైన మాతృపితృమూర్తుల మనోనేత్రంబున గనుంగొని ప్రణామంబు లాచరించి, దీవనల నంది, తక్షణంబు భూతకాల భూధర మేఖలా కింకిణీరవ మధ్యస్థుండనై విహరించుచు, అతి పురాతనంబును అధునాతనంబును గాక, విపరీత పరిమాణంబును సూక్ష్మంబును గాక, వ్యాపితంబును సంకుచితంబును గాక, మానస నేత్రంబునకు సంగతంబై విస్తరంబు గాని ప్రశస్త ప్రస్తరంబును, వలుదకణ సంకులంబు గాక సూక్ష్మాణు సముద్భూత సముదయోద్భాసితంబై పురావస్తు కథాకథన సముచ్చయంబైననూ అఖండ సమీకృతంబైనదియు, శ్వేత ఘనశ్యామాది ఏకవర్ణంబు గాక సందర్శనానందకర వివిధ విశిష్ట వర్ణరసశోభితంబును, అతికఠినంబు గాక మదీయ హస్తగత నిర్మాణ పరికర చాతురీ లాఘవ ప్రదర్శన దర్శనానుకూలంబును, కాలాభ్ర మంద మండిత ప్రభాకర కరాతప ఘనాఘన ఘోషాజనిత విద్యుత్తరంగ క్షేత్రోద్భవ శక్తియుతంబును, శరచ్చంద్ర జ్యోత్స్నాసమ స్వయంప్రకాశభ్రాజితంబును, ఆంధ్ర సాహితీప్రియ రసజ్ఞ కించత్ ప్రహార స్పందన స్ఫురిత జన్య కర్ణరంజిత మృదు కాకలీ స్వర వివిధచ్ఛందోఠంకార ధ్వాన

తరంగ రంగంబుననయి, శిల్ప విన్యాస లక్షణ లక్షితంబును, ఇతఃపూర్వ మానవ సంపర్క కళంకితంబును శీర్ణంబును గాక, స్వచ్ఛంబును, అవిచ్ఛినంబును, మహోన్నతంబును, కాలగర్భబహిర్గతంబును నగు ప్రాథమిక శిలాఫలకంబు నా మనః ఫలకంబున ననాచ్ఛాదితం బయిన నిట్లని వితర్కించితి

## 2. కృతికర్త పరిచయము.

కం|| హరితస గోత్ర పవిత్రుడ
నిరత శివపదారవింద నియమ వ్రతుడన్
పరమేశ్వర వరవిభవుడ
సరసవిదుడ, వేము వంశ సంతానుండన్.

ఆ||వె|| హరితసాంబరీష యౌవనాశ్వఋషులు
ఆది పురుషు లగుట హరితస భవ
గోత్రసంభవులకు శ్రోత్రియంబబ్బెను,
క్రాంతి దాంతి శాంతి క్షాంతి గలిగె.

ఉ|| అందున వేము వంశ మరుదైనది కోవలు కొన్ని యేను, ఉ
న్నందున వేదశాస్త్రఋఖను లంకిత వైదిక ధర్మవర్తనుల్
అందము చిందు కుందనము లంగనలందరు, సర్వమంగళా
వందన ధ్యాన తన్మయ విభావ నిరంతర యోగవర్తులున్.

వ|| అట్టి వంశంబున కాలానుక్రమణంబున ఏర్పడిన వివిధశాఖలలో నొక ఉపశాఖకు మా ప్రప్రపితామహుండు నాగయ్యే మూల పురుషుండై వర్ధిల్లె. ఆతండు తన చిన్ననాటనే క్రీస్తుశకము పందొమ్మిదవ శతాబ్ది ప్రథమ పాదంబున తన స్వగ్రామంబు వీడి తన విద్యకు తగిన ఆశ్రయ మివ్వగల గ్రామంబు కొరకు వెదకుచు,

కం|| గోదావరి తీరంబులు
వేదంబుల నిర్విరామ వేదిక లగుటన్
మోదంబుగ విద్వజ్జన
సాదనములు వెలసె నిచట సంసేవ్యంబై.

వ|| అందు,

సీ|| గోదావరీ తీర గోత్రపరంపరా
వృత సౌధ మందిర శ్రీకరమ్ము
అల వీరభద్రేశు అతులిత నిలయమ్ము
భద్రకాళీదేవి భవ్య గృహము
ఇల నందికేశ్వర హేలావిహారమ్ము
శివదేవ మాహాత్మ్య సిద్ధవేది
రామపాద యుగళ రంజిత రమణీయ
సాగర వాహినీ సంగమమ్ము
తే||గీ|| మన్య కానన ప్రాంగణ మండపమ్ము
రెడ్డిరాజుల ప్రేంఖణ రింఖసీమ
వేద సాహిత్య సంగీత నాదసురభి,
శ్రీల కిరువైన నిలయమౌ పోలవరము.

వ|| అట్టి గోదావరీ ప్రతీర ద్వంద్వ శివద్వీపారామ మధ్యస్థ మండితంబైన రెడ్డిపోలవరంబున స్దిరనివాస మేర్పరచుకొని, వేదవేదాంగనిష్ణాతులు, సాహితీ పరమేశ్వరులు, లౌకిక రాజ్య పాలనా ధురంధరులునైన పోలవర జమీందారులకు ఆప్తుండై వ్యవహరింప దొడంగె.

ఆ నాగయ్యకు అమ్మన్నయను కుమారుండును, ఒక కుమార్తెయు గలుగ, అందు అమ్మన్న బహుపురాణ వేదవేదాంగ పారంగతుండై గ్రామంబున పేరెన్నిక గాంచి యుక్తవయస్కుండైనంత తండ్రి తగిన వధువును కొనితెచ్చి వివాహంబు జరిపించె.

కం|| లక్ష్మీ నివాసుడయ్యెను
లక్ష్మమ్మను పెండ్లియాడి లక్షణ మొప్పన్;
ఆ క్ష్మాసురు డమ్మన శ్రీ
లక్ష్మీ ధవుడైన విష్ణు లక్షణ మబ్బన్.

తే||గీ|| అన్నదమ్ములు లేనట్టి అమ్మనకును
చక్కనైనట్టి పుత్రుల సాధ్వి కనియె,
నిద్దర ధరప్రసిద్ధులు సిద్ధయశులు
అన్నరామయ్య తమ్ముడమ్మన్న యనగ.

వ|| రామయాహ్వాయుండు తరుణ వయస్కుండైనంత, మేడూరు వంశసంజాతుండైన వ్యాసుల కుమార్తె బుచ్చమాంబతో వివాహ నిశ్చయంబు జరుగ,

కం|| ముచ్చటగా రామయ్యకు
బుచ్చమ్మకు పెండ్లిచేసి బుధహితబంధుల్
నిచ్చలు గౌరీశుల వలె
పచ్చగ వర్ధిల్లుడంచు వాఛించి రొగిన్.

ఉ|| అచ్చపు పైడిముద్ద అనుహారపు ఒప్పులకుప్ప భర్తకున్
నచ్చిన రీతిలో మెలగు నాతిశిరోమణి రోజురోజునన్
వచ్చె బ్రాహ్మణోత్తముల భక్తిని గొల్చెడి పుణ్యసాధ్వి, ఆ
బుచ్చమ సీత బోలు పరిపూత విశిష్ట చరిత్ర కాదొకో.

చ|| హరితస గోత్ర వర్ధనుడు, ఆత్మవిచారణ తత్త్వవేత్త, భా
సురవర పండితోత్తముడు, సూరిజనాశ్రిత ధర్తయున్, రమా
వరద పదారవిందయుగ వందన శీర్షుడు, వేము వంశ సా
గరశశి రామయాహ్వాయుని ఖ్యాతిని నెన్నగ సాధ్యమే యిలన్.

సీ|| ఆజానుబాహుండు, అతిసౌమ్యవంతుండు
విజ్ఞానతేజుండు, విమలయశుడు
బహు పురాణజ్ఞుండు, బ్రహ్మత్వ రూపుండు
విద్యా ప్రపూర్ణుండు, వేదవిదుడు
కవితత్త్వ విభవుండు, కవితా ప్రకాండుండు
కవిజన మిత్రుండు, కర్మయోగి
వ్యాఖ్యాన చతురుండు, విఖ్యాత తర్కుండు
హాస్యాంతరంగుండు, లాస్యమూర్తి
ఆ||వె|| ఏకసంత కవన హేలా విహారుండు
పోలవర పురవర భూరియశుడు
న్యాయవాద వృత్తి నమ్మిక వర్తించి
రామయాహ్వయుండు రహిని మనియె.

వ|| ఆవిధంబున 21

సీ|| ముత్తాత అమ్మన్న మూర్తీభవించిన
వేద శాస్త్ర పురాణ విశ్వవేది
రామయ్య మాతాత రఘురాము భక్తుండు
సంస్కృతాంధ్ర కవిత్వ సరసవిదుడు
అమ్మన్న వ్యాసుండు అనుగు లక్ష్మీపతి
ఆతని పుత్రులు అధికయశులు
కామేశ్వరీదేవి కనకమహాలక్ష్మి
మా యత్త లిద్దరు మానధనలు

తే।।గీ।। వ్యాసమూర్తి నా తండ్రి విఖ్యాత కీర్తి
హూణ విద్యల నేర్చిన జాణయతడు;
చూడముచ్చట గొల్పెడి సుందరుండు
భద్రు డాజానుబాహుండు పసిడి గిండి.

వ।। తనకు రెండవ కుమారుండు జననమంద రామయ్యగారు,

శా।। విద్వల్లోక విశిష్ట విశ్రుతి మహావిజ్ఞాన సంస్తవ్య సం
పద్విఖ్యాతుడు, వేదభాగ కృత సంభావ్యుండు, సంయామ సం
సద్విజ్ఞప్తి పురాణ గ్రంథరచనా సంస్కార సంధాత, కృ
ష్ణద్వైపాయను నర్థి దల్చి, యిడె తన్నామంబు వ్యాసుండనన్.

సీ।। జీమూత సంఘంబు చిమ్మరేగిన రూపు
కాంచన కమనీయ కాయమయ్యె
జీర్ణకౌపీన సంసేవితంబౌ మేను
పాశ్చాత్య పరిధాన వాసమయ్యె
బహు పురాణ రచనా పాటవంబీనాడు
హూణ భాషార్జన వ్యూహమయ్యె
వైవాహికేతర వనితా సంపర్కంబు
ఏక పత్నీత్వమై ఏరుపడియె
తే।।గీ।। చిలుక కాదది చిలుకల కొలికి భార్య,
అడవి కాదది ఉనికి హర్మ్యంబు గాని,
వ్యాస భగవానుడీ వేమువారి యింట
జనన మందంగ బుచ్చమ్మ సాధ్వికపుడు. 25

వ॥ సార్ధక నామధేయుండైన వ్యాసమూర్తి

సీ॥ 'ఎలిమెంటరీ' విద్య నలవోకగా నేర్చె
పోలవరాన బుభుత్స తోడ
'హైస్కూలు' పాఠంబు లతి లాఘవంబున
నరసాపురంబున గరచె నతడు
'కాలేజి' చదువులు కడు శ్రద్ధ నీడేర్చె
రాజమహేంద్రవరంబు నందు
ఆ కాలమందున ఆంగ్లంబు నెరుగుట
ఆంధ్రదేశంబందు అరుదు గాగ
తే॥గీ॥ 'హిష్టరీ' తోడ 'బి య్యే' యు కష్టమైన
దాని సాధించె ధిషణుడై ధైర్య మూని,
తెలుగు హూణ భాషల యందు అలఘు కీర్తి
ప్రతిభ యింటను బైటను ప్రబలె నతడు

వ॥ ఈ విధంబున దినదిన విద్యా ప్రవర్ధమానుండైన కుమారుని
గాంచి రామయ నిరంతరానంద స్పందిత హృదయుండై,

తే॥గీ॥ యౌవన వయస్కుడైనట్టి వ్యాసమూర్తి
పెండ్లి జరిపింపగా కోరి ప్రీతి మెరయ
తండ్రి తగు సంబంధములను తగిన కన్య
కొరకు ఆంధ్రదేశంబంత తరచి వెదకె.

వ॥ ఆ సందర్భంబున,

సీ॥ సాహిత్య సామ్రాజ్య సర్వంసహా చక్ర
మేయూరు చేకొని యేలుచుండె
సంగీత సరసజ్ఞ సంకీర్ణ సంపద
నేయూరు స్థాపించి యెగయుచుండె
వేదవేదాంగ కోవిదుల కాశ్రయ మిచ్చి
యేయూరు పృథ్విని ఎన్నికెక్కె
ఆంగ్లభాషా బోధనాధ్యయన సమాఖ్య
నేయూరు సాధించి ఎంపికయ్యె
తే॥గీ॥ కళల కాణాచి, సిరులకు కల్పతరువు
శిల్ప కుట్టిమారామ సంసేవితమ్ము
వెలయ పూసపాడ్రాజన్య విమల కీర్తి
విజయనగరంబు తెలుగు దేవేరి సమము. 31

సీ॥ ముత్యాల సరులతో మురిపించు సిరులతో
హవణించు గురజాడ అడుగుజాడ,
హరికథా ప్రక్రియల్ అభినయ కీర్తనల్
తవణించు అజ్జాడ తాయి తీవి,
సంగీత సరకట్లు సవరించి రమణయ్య
రవణించు వీణాతరంగ తతులు,
ఆమ్నాయ శబ్దముల్ అనుపమ సంహితల్
రవళించు అవధాని లక్ష్యసిద్ధి,
తర్కకోవిదుడు తాతా సుబ్బరాయుండు
ప్రవచించు సంస్కృత రసిత సరళి,
కుస్తీల గరిడీలు కుస్తరించిన జోదు
కోడి రామ్మూర్తి వెంటాడు కీర్తి,

తే॥గీ॥ తెలుగు నాటను జాతి నుత్తేజ పరుప
తెలుగు సంస్కృతి ప్రజలలో వెలుగు నింప
విజయనగరంబు కళలకు ధ్వజము నెత్తి
విజయ దుందుభి మ్రోగించు వేళ యదియె.

వ॥ అట్టి విజయనగర పురీవరంబున,

సీ॥ పరదేశి పుత్రుండు పరమ పవిత్రుండు
పరిపూత చరితుండు పరిణతుండు
పరమేశ భక్తుండు పరమేష్ఠి విజ్ఞుండు
పరతత్త్వ వేద్యుండు పరమశుభుడు
పరిపాల దక్షుండు పరితృప్త చక్షుండు
పరితోష వంతుండు ప్రౌఢవరుడు
పరిజన రక్షుండు పరిపంథి శిక్షుండు
పరమత సహనుండు ప్రగతిపథుడు
తే॥గీ॥ విజయనగర మహారాజ విశ్వసితుడు,
ఆంతరంగిక కార్య నిర్యంత్రణుండు
ధన్య యనమండ్ర వార్ధి సుధాకరుండు
ప్రజ్ఞ నారాయణుండు నారాయణుండు. 34

వ॥ ఆ ధీమంతుండు బహుముఖ ప్రజ్ఞాశాలి. విజయనగర మహారాజాంతరంగిక కార్యదర్శియై రాజ్యపరిపాలనా దురంధరు డౌచు, తక్కుంగల సమయంబున మహారాజ కళాశాల యందు ఆంగ్లోపాధ్యాయుండై అనేక శిష్య పరంపరల తన ఉపన్యాసంబులతో నుత్తేజితులంజేసె.

ఆ మేధావి విద్వాంసుడే గాక కవిపుంగవుడై, ఆంధ్రాంగ్ల భాషా సారస్వతవ్యాప్తికి కృషి చేసె ఆంగ్లంబున 'ది పారిజాత - లవ్స్ బ్లాసమ్' అను పొత్తంబును, తెలుగున 'అడవి మల్లెలు' అను ఖండ కావ్యంబును, 'స్వర్ణ ఛూతమ'ను నాటకంబును, 'రూపలి' యను చారిత్రాత్మక నవలను రచించె. ఆనాడు తెలుగులో మాత్రాచందస్సున పద్యంబులల్లుట ఒక నూతన ప్రక్రియగా రూపొంద, ఇట్టి అధునాతన బంధంబున సంప్రదాయ ఛందంబున, రెండింట కవిత్వంబు సాగింప కలిగిన దిట్ట. తర్కవ్యాఖ్యాన చతురుండు గావున, శ్రీ దువ్వూరి రామిరెడ్డి రచించిన 'వనకుమారి' పొత్తంబును పరిష్కరించి ఆయన కృతజ్ఞతలం గొనియె. ఆనాడు విజయనగర సాహిత్య సిద్ధాంతుల సారథ్యంబున తెలుగు పద్య గద్య కవిత్వంబు లోనైన విప్లవాత్మక చైతన్య స్పందన పథంబున శ్రీ గురజాడ అప్పారావు పంతులుకు సహచరుడై పురోగమించిన యుగపురుషులలో నొకడై పేరుగాంచె.

35

సీ|| నారాయణాఖ్యుండు నారాయణుని బోలె
శోభించి పెండ్లాడె సుబ్బలక్ష్మి
వారికి కలిగిరి వరలబ్ధ విభవాన
ముమ్వురు సుతులు త్రిమూర్తు లట్లు
పరమేశ్వరుడు, వేంకట రమణమూర్తియు,
సాంబశివుండును సమ్మదమున
ఆర్వురు పుత్రికల్ అల సరస్వతి, లక్ష్మి
కాంత, కామేశ్వరి, కలికి పార్వ

ఆ।।వె।। తియును, దుర్గ, సీత త్రిభువన సౌందర్య
సతులు, మానధనలు, శాంతగుణలు
వినయ ఖనులు, స్వైర విదుషీమణులు వారు
సార్ధ నామధేయ చతుర లగుచు

ఆ।।వె।। వాసిగ యనమంద్ర వారి ప్రథమ పుత్రి
ధీరయగు సరస్వతి యను దాని
ఉప్పులూరి వారి ఉత్కృష్ట ధిషణుండు
భీమశంకరుండు పెండ్లి యాడె 37

వ।। రెండవ కుమార్తె అయిన లక్ష్మీకాంత దినదిన ప్రవర్ధమానయై విద్యాసరస్వతియై అభినవ రతియై రూపొంది తండ్రికత్యంత ప్రియ సంతానమైనంత, ఆతడీ సుగుణ ఖనికి, అపరూప సౌందర్యవతికి, బాలవిద్యాధరికి ఆదర్శవరుని కొరకు మంత నంబులు జరిపించి పోలవర గ్రామమందున్న వేము వంశ రాకాశంశాకుడైన వ్యాసమూర్తి తగినవాడని నిశ్చయించి, వరవధూ వీక్షణ కార్యక్రమంబు నేర్పాటు చేసినంత, పెండ్లి కుమారుండైన తన రెండవ కుమారునితో రామయ్యయు, బుచ్చమాంబయు విజయనగరమున కరుదెంచి యనమంద్ర వారి సదనంబున సుఖాసీనులై ఉన్నంత, పురంధ్రీమణులు వధువుం కొని వచ్చిన సమయంబున,

ఆ॥వె॥ పంచశరుడు ఎంచి పెంచిన మొలకలా
నలువ కలువజిలుగు మలచినట్లు
కలిమికలికి కొలిమి మేలిమి చిలుకలా
వాణి బోణి పాణి వీణ రాణ.

ఆ॥వె॥ వెలుగుచున్న బాలవిద్యా స్వరూపిణి
సదనమందు చూచి ముదము నంది
వ్యాసమూర్తి సుందరాకార మూర్తికి
ఈడుజోడు కన్య యీామె యనుచు. 40

ఆ॥వె॥ రామయాహ్వయుండు రంజిల్లె మనమున
విమల వినయశీల కమలనేత్ర
లక్ష్మికాంత నిచ్చి లగ్నంబు చేయగా
సమ్మతించె నపుడు సంతసాన.

వ॥ అంత బుచ్చమాంబ లక్ష్మీకాంత కన్య దరిచేరి చుబుకంబు ముద్దాడి సంప్రదాయ బద్ధంబుగ నిట్లని ప్రశ్నించె.

సీ॥ కావ్యంబు చదువుదే? గానంబు చేతువే?
కవిత లాలాపింతె కలికికొలికి?
పూజలు జరుపుదే? పురహరు మ్రొక్కుదే?
అతిథుల కొలుతువే హంసగమన?
శాకంబు వండుదే? పాకంబు నేర్చితే?
భక్ష్యంబు పచనింతె పంకజాక్షి?
బట్టలు కుట్టుదే? పాదులు పెంచుదే?
పద్దులు వ్రాయుదే పల్లవాంఘ్రి?

తే॥గీ॥ ఇంటి పను లన్ని శ్రద్ధ నీడేర్చగలవె?
పుట్టినింటి మర్యాదను పుణకరింతె?
అత్తమామల ప్రేమతో నాదుకొందె?
మగని కనుకూల వృత్తిని మసల గలవె?

వ॥ అని అడిగి తగు సమాధానంబుల నంది బుచ్చమ్మ భర్తకు తన సుముఖత్వంబును తెలియజేయ, పెండ్లి పెద్దలు లాంఛనాది వ్యవహారంబులు చర్చించి దైవజ్ఞులచే ముహూర్తంబు శుద్ధిపరపించి కొన్ని దినంబులలో అంగరంగ వైభవంబుగ కళ్యాణంబు జరిపింప,

కం॥ శిక్షిత ధనుడౌ రాముడు
ఆ క్షితికన్యను వివాహమాడిన రీతిన్;
అక్షయ్యంబుగ వ్యాసుడు
దక్షత లక్ష్మిగళమున తాళింగట్టెన్.

ఉ॥ మంగళ తూర్యఘోషములు మానుగమ్రోయ, సుమంగళాంగనల్
మంగళ హారతుల్ మధుర మంజుల మార్దవ సుస్వరాన పా
డం, గణనీయమై వినబడంగ పురోహిత వేదమంత్రముల్
రంగుల మిశ్రమై మనసు రంజిల చేసె ముహూర్తకాలమున్.

తే॥గీ॥ భవుని సామేను పార్వతీభామ బోలె
రెండు దేహంబు లయ్యును వృత్తి యొకటె
వ్యాసమూర్తికి లక్ష్మి ఆవాస మగుట
వ్యాసనారాయణుండౌచు వాసి కెక్కె.

ఆ॥వె॥ వ్యాసమూర్తి బహుళ పాండితీ ప్రతిభలు
దొరతనమ్ము వారి కెరుక రాగ,
చేసినారు 'సబ్ రిజిష్ట్రారు'గా వాని
బ్రతుకు తెరువు కంత బరువు తగ్గ. 48

వ॥ ఈ విధంబున నూతన జీవన యాత్ర సాగించుచు సంసార సుఖంబుల ననుభవించుచు కలతలు లేక కాపురంబు చేయుచున్న దంపతులకు చాలకాలము సంతాన ప్రాప్తి కలుగక విచారంబావహింప, దైవజ్ఞులను సంప్రదించి, పెద్దల ఆలోచనంబున పెక్కు దేవళంబులు దర్శించి, వివిధ తీర్థయాత్రలు సేవించి, ఛప్పన్న వ్రతంబు లాచరించి ఫలితంబు కానకున్న దైవయోగంబున ఉప్పులూరి గణపతి శాస్త్రి అను వేదవిదుండైన మహనీయుండు దక్షారామ మేగుండని సూచించిన, లక్ష్మీకాంతమ్మ త్వరితగతిని ముహూర్తంబు నిశ్చయించి అచటికేగి శ్రీమాణిక్యాంబా సహితుండైన భీమేశ్వరుని సన్నిధానంబున నలుబది రోజులు నిరాహారంబుగ తపంబాచరించి భీమ మండలంబుననున్న సకల పుణ్య క్షేత్రంబుల, దేవతా మూర్తుల సేవించి, స్వప్నంబున భీమేశ్వరాశీర్వాదంబు నంది, యింటికి తిరిగి వచ్చిన కొలది కాలంబునకే గర్భవతి అయి, నవమాసంబులు నిండిన, నన్ను సుఖప్రసవంబు నొందె. ఆ పుణ్య దంపతుల కట్లు నేను భీమేశ్వర వరప్రసాదిగ జన్మించితి.

నాకు జన్మ ప్రసాదించిన నా తల్లి చిన్నతనము నుండి తెలుగు సాహిత్యము నందు ప్రియత్వంబు కలిగి, విదుషీమణియై, కవయిత్రి యయ్యె. మహాభారత రచయిత తిక్కనపై అభిమానంబున ఆయన నెన్నుచు పద్యములు రచించె. చిన్మయాకారుని విశ్వేశ్వరుని స్తుతించుచు. ద్విపద ఖండికయు, గాంధారి వ్యక్తిత్వముపై వచన విమర్శనా వ్యాసంబును, తల్లి ప్రేమకు నిదర్శనంబుగ కుక్కుట గృధ్ర సంఘర్షణ యను గీతికయు నా దృష్టికి వచ్చిన రచనలు.

నా మాతృదేవి 49

సీ|| అక్షరంబులు దిద్దు శిక్షణ సమయాన
పసిపాప వల్లించె పద్యతతిని
పాఠశాలను నేర్పు పాఠంబు పట్టున
బాలిక అల్లెను పద్యకవిత
యౌవనంబబ్బగా అత్యంత భక్తితో
రమణి చర్చించె పురాణరాశి
కల్యాణమైనంత కాంతుని సేవలో
విశ్రాంతి యందు కవిత్వ మల్లె
తే||గీ|| గృహిణియై కొల్చె గౌరీశు కృత్తివాసు
రక్తి సంసార మాధుర్య రసము గ్రోలి,
భక్తి వేదాంత విజ్ఞాన పథము చేరి,
కర్మ యోగినియై లక్ష్మికాంత మనియె.

వ|| ఆ విధంబున ఇరుప్రక్కల పితృదేవతలు విద్వత్కుటుంబికులు
కాగా,

తే||గీ|| అట్టి వంశంబు లందున వ్యాసమూర్తి
లక్ష్మికాంతల దాంపత్య లబ్ధసుతుడ,
భీమశంకరాఖ్యుండను ప్రీతిపరుడ
అమరగురు సమ విబుధ విద్యాశ్రయుండ.

కం|| సంభవలక్ష్మి విభవుడ
పుంభావ సరస్వతీ ప్రపూర్ణయశుండన్;
జృంభిత ప్రజ్ఞా పరుడను
సంభావిత శంభుపాద సంశ్రితచరుడన్.

కం|| శోభిత రచనా నిపుణుడ
భూభౌతిక నూత్నశాస్త్ర మూలస్థపతిన్
స్వాభావిక సహజగురుడ
ప్రాభావిత శిష్యకోటి పరివేష్టుండన్. 54

సీ|| ద్రాక్షార భీమేశు దయచేత పుట్టితి
మాయమ్మ తపముల మహిమ వలన
అఖిల విద్యల నేర్చి నిఖిల శాస్త్రంబుల
భూభౌతికంబున ప్రోడ నగుచు
ఆచార్య వృత్తిలో నధిక మాన్యత లంది
విజ్ఞాన రంగాన వినుతి కెక్కి
భూశాస్త్ర విస్తృత బోధనగ్రంథాల
ప్రచురించినాడను ప్రజ్ఞ మీర

తే||గీ|| అన్నపూర్ణకు పేరైన అతివతోడ
పుత్రపుత్రికా దౌహిత్ర పౌత్రు లెసగ,
శివుని ఆశీస్సుఫలమున చింత లేక
ఆయురారోగ్య సంపద లనుభవింతు.

తే||గీ|| వృత్తి ఉద్యోగ మార్గంబు విడిచిపెట్టి
షష్టిపూర్తితో సౌఖ్యంబు చాలు ననుచు,
అంటిముట్టని రీతిని యింట నుండి
తెలుగు సాహిత్య పథమున మెలగ దలచి.

ఉ|| భావి పురాత నాద్యతన భవ్యచరిత్రుల సత్కవీంద్రులన్
దీవన చేయుచున్ వరుసతీరున మ్రొక్కుచు గౌరవించుచున్
భావ కవిత్వతత్త్వ పదబంధ వినూత్న పథంబునందు, నా
జీవిత శేషమున్ తెలుగు సేవకు అంకిత మౌచు కొల్చెదన్.

## 3. కృతి లక్షణ లక్ష్యములు.

తే||గీ|| భక్తి పితృదేవతల పైన పరిఢవిల్ల
మాతృభాషయె అభిమాన పాత్రమగుట;
గురుల వృద్ధిని తెలియగ కోర్కి గల్గి
వంశకథలను తెలుగున వ్రాయదలచి.

ఆ||వె|| వేమువారి చరిత వినబుద్ధి పుట్టంగ
తిరిగినాడ నెన్నొ తెరువులందు,
అడిగినాడ చేరి అందందు వృద్ధుల
పూర్తి భావ మేది బోధపడదు.

ఆ॥వె॥ సూత్రసిద్ధమైన సూచనల్ వినిపించె
అల్లు వాడవాని పొల్లుదీసి
కొంత యూహతోడ కొంతగా కల్పనల్
ముడివడుచు బహుజన మోదమెసగ.

ఆ॥వె॥ విస్తరంబు గాని పుస్తకం బిష్టమౌ
రసిక జనుల కెపుడు రక్తి గొలుప;
వలుద కాయ మున్న వలతి కన్నను మిన్న
మెరుపుతీగ బోలు మెలత గాదె.

వ॥ ఈ కతంబున,

ఆ॥వె॥ వంశచరిత లోని అంశంబు లన్నింటి
వీలుగాదు వ్రాయ విపులమగుట;
ముఖ్యమైన కథల ముచ్చటించెద కొన్ని
భావితరము కొరకు భద్రపరతు.

కం॥ కావ్యము వ్రాయగ బూనను
సవ్యముగా పద్యరచన సాగుటె చాలున్,
శ్రావ్య వచఃసంకలనము
నవ్యకథా కథనశైలి నా లక్ష్యంబౌ.

వ॥ అయినను, విద్యార్థినై గురుముఖంబున భాషాధ్యయనంబు
చేయని వినీతుండను గావున,

కం|| భాషాజ్ఞానము స్వల్పము
ఆషామాషీగ పదము లల్లుటె తప్పన్,
ఈషణ్మాత్రము కృషియు జి
గీషకు దోడై రచనకు కృతృతత కలిగెన్.

కం|| అస్తవ్యస్తపు పదములు
పుస్తకములు చదివి విన్న పుష్టియె తక్కన్,
కాస్తైన శాస్త్ర పద్ధతి
మస్తిష్కము లోన నాస్తి మానుగ చెప్పన్.

కం|| ఛందము భంగము చెందును
అందందున యతులు ప్రాస లతుకవు పసిగా
ఛాందసుల డెంద మదరగ
అందముగా పద్య మొప్ప అల్లినపట్లన్.

కం|| వ్యాకరణ కరణ మారణ
భీకర నిస్సార ఘోర బీభత్సమునన్
దూకక, మధుర సుధారస
సాకలిత విశిష్ట భావ శబ్దార్థగతిన్.

కం|| చెప్పెద వినుటకు సొంపుగ
కుప్పెద రస నిర్ఝరులను గుంభన తోడన్,
కప్పెద చదువరి హృదయము
ఒప్పుగ జ్యోత్స్నా లహరుల నోజప్రభలన్. 70

కం।। మెండుగ కదళీపాకము
దండిగ మృదుమధుర మైన ద్రాక్షారసమున్,
కొండొకచో సంస్కృత పద
ఖండ సమీకృత సమాస కల్పన తోడన్.

కం।। పద్యంబుల్ రచియింతును
ఆద్యంతంబును మృదుమధురామృతధారా
హృద్యంబై, కవిజన నై
వేద్యంబై, పాఠకవర వేద్యం బనగన్.

కం।। వివిధములౌ ఛందంబుల
నవసరమగు భంగి నుడివి అతిరమ్యముగా
కవితా కన్యకు కూర్తును
నవనవ శోభాయమాన నవవిధ భూషల్.

ఉ।। బమ్మెర పోతరాజ కృత భాగవతాది మహాపురాణముల్
అమ్మల కెల్ల యమ్మ జనకాత్మజ రామకథా ప్రపంచమున్
గుమ్మను పద్యపుష్పముల గుచ్ఛము తిక్కన భారతమ్ము, ని
త్యమ్మును నోట నాశువుగ ఆలతి చేసెడి అమ్మమూలమై.

ఉ।। చిన్నతనాన నె పద్యములు చేరుకు పోయెను మేధ లోనికిన్
విన్నవి విన్నయట్లు వినువీథులనుండి సుశబ్ద సంగతుల్
వెన్నడిగొంచు వీనులకు విందు పసందులు చేయ, వాని నే
నెన్నుచు ఆత్మయందు స్మరియించుచు నుందును మాతృదత్తముల్.

ఉ॥ సారస సంప్రదాయ సరసాక్షర మాలికలన్ సరస్వతీ
నీరజ పాదయుగ్మమున నెయ్యు మొనర్ప నలంకరించి, నో
రారగ నాంధ్రభాష మకరంద తరంగ నిరంతరంబు శ్రీ
మీరగ పద్యముల్ నుడివి మించిన మాతృ ఋణమ్ము తీర్చెదన్.

ఉ॥ ఆగని భావ వేగ హృదయాంతర వేదన శబ్దరూపమై
వాగనుశాసనస్ఫురణ వర్ణవిశిష్టత నొంద పద్యముల్
ప్రోగులు పోతు, సౌరభ విఫుల్ల పయోజ పరాగ మాధురీ
రాగ విలాసమై రసికరాజమనోహరమై చెలంగగన్.

ఉ॥ మల్లెల జల్లు వోలె, మది మత్తుగ ఝల్లను రీతి, నిర్ఝరీ
వల్లకి యట్లు, పూవిలుతు భల్లము భాతి, మరంద పూర సం
ఫుల్ల సరోజ లీల, స్వరపూరిత మానస రాగ మట్లు, నే
నల్లెద పద్యముల్, సరసమౌ నవలా పరిరంభమో యనన్.

ఉ॥ ఉన్నది ఉన్నయట్లుగ ననుక్త దిగంబర గీత లల్లినన్
కన్నది కన్నులన్ వచన గాథలు చెప్ప కవిత్వమౌనె, ఏ
మున్నది రక్తి గొల్ప, మదనోత్సవహేలలు, త్రాగుబోతులున్
అన్నము లేని పేదజను, లార్తులు, ధూర్తులు, వ్యాధిబాధితుల్.

ఉత్పలమాల మాలిక ||

అన్న యిదేటిమాట! అలుసైనది అందము చిందు ఆంధ్ర భా
షోన్నతి, మిన్నుముట్టిన మనోజ్ఞ కళాచతురత్వ సంస్కృతిన్
వెన్నెల కాయ జేసెడి కవిత్వ పటుత్వ మహత్వ తత్త్వ మే
దన్న! దిగంబరించిన ననర్ఘ విహంగ విహారమందు! ఏ
మున్నది గర్వకారణ మహో! పునరుక్తి జుగుప్స దక్క, యే
తెన్నున సాహితీప్రియుల తీర్పుకు నిల్చు! ప్రభూత భావమా!
సన్నుత కావ్యవస్తువ! రసంబు, నలంకృతి, శైలి, యర్థ సం
పన్నమ! శబ్ద నిర్మిత సువర్ణ మనోజ్ఞ విశిష్ట శిల్పమా!

ఉ|| భావము శబ్దమున్ రసము ప్రాభవరీతిని మేళవించి, ఛం
దో విధి రాగరంజిత సుధోక్తు లలంకరణంబు చేసి, స్వా
భావిక వాగ్విలాస సుమవాసన జల్లి కవిత్వ మల్ల, ఆం
ధ్రావని సాహితీ రసిక రాజ్యరమా రమణత్వ మబ్బదే!

శా|| సావీణా వరభామినీ పదలసత్ సంగీత సాహిత్యముల్
భావోద్రేక పరంపరా విభవ వాగ్ భాగీరథీ మాధురీ
రావంబై మది నింప తన్మయ రస ప్రహ్లాద గాత్రుండనై
మోవింతున్ పదలాస్యగుంభితరుచుల్ మోద ప్రమోదంబుగన్.

ఆ||వె|| ఆలకింపుడయ్య ఆంధ్ర వాఙ్మయులార
తెలుగు పద్యమందు తియ్యదనము;
రసము గ్రోలరండు రసికాగ్ర వరులార
చూసి కనుడు శోభ సూరి వరులు. 83

ఆ॥వె॥ చదువ నోర్మి లేని సాహితీ ప్రియులార
ఎన్నుకొనుడు పద్య మేది యైన,
స్థాలమందు రుచికి చాలు నొక్క పులాక
రచనయైన గాని పచనమైన.

## 4. ఇష్టదేవతా ప్రార్థనము.

వ॥ అని తలంచుచు, నాకవనవన ప్రసూన వితానానందేందిందిర, దరహాసముఖ ప్రతిభా భాసుర, సాహిత్య సంగీత రసాస్వాదన ప్రపంచ సామ్రాజ్య విభవ, భావాంతరంగ, భావనా తరంగ సంభవ, వనజభవు వధూటి వాణిని మున్ముందు తలంప నెంచి,

చ॥ బుడుతడు చేతిలో పలక పుల్లను త్రిప్పుచు పిచ్చి బొమ్మలన్
వడివడి గీయునట్లు ఒక వావియు ధ్యేయము లేక పద్యముల్
నుడివెడి నన్ను చేత గొని నూతన మార్గము చూపినట్టి మేల్
పడతిని ప్రౌఢభారతిని ప్రస్తుతి చేసెద ప్రస్తరించెదన్.

శా॥ వీణా పుస్తకరమ్యపాణి, కవితా విన్యాస విస్తారిణీ
వేణీబంభర జృంభితాస్యరమణీ, వేదార్థ విశ్లేషిణీ
వాణీ, నాదసుధామణీ, గుణమణీ, పాండిత్య సంధాయినీ
ప్రాణాయామ విశేషిణీ, నిరత దివ్య జ్ఞాన సంతోషిణీ.

మ|| వరవక్త్రేందు విశేష రూపరమణీ, వాగర్థ సంధాయినీ,
సరసాలోక విహారిణీ, త్రిభువనీ, సాహిత్య సంచారిణీ,
గిరిజా మంగళదేవతా ప్రణయినీ, గీర్వాణనాద ధ్వనీ,
దరహాసామృతవర్షిణీ, సుకవితాధారా పయఃపానినీ.

కం|| వరవీణా మృదుపాణిని
సురుచిర సారంగవేణి శోభిత వక్త్రన్,
సరిగమ పదనిస రసధుని
వరరుచి కవితా మధురిమ పదనటమూర్తిన్.

కం|| కొలుతును సతతము జిలిబిలి
తెలుగుల పలుకుల లలనను త్రికరణ శుద్ధిన్,
మలతును చదువుల బ్రతుకును
విలసిత మృదు మధుర కవన విశ్రుతికొరకై.

కం|| శ్రీకరు భక్త శుభంకరు
భీకర సంసార వార్ధి విజ్ఞత తోడన్
ప్రాకటముగ దాటంగా
మొకరిలుదు శంకరు వరమోక్షార్థుడనై.

సర్వలఘు ఆ||వె||
ఒకదరి గిరిసుతయు, ఒకదరి నిభవిభు
ముఖుడొనరగ సతతము శుభముల వి
తరణ నొసగెడు భవు ధవుని ధవళగిరి
నిలయు కొలుతు నెపుడు నియమనిరతి. 92

శా|| శంభోశంకర యంచు ప్రార్థనల నే సాష్టాంగినై శ్రీకరున్
శుంభత్కేళి భజించెదన్ శివుని నీశున్ వీరభద్రేశ్వరున్
దంభుండన్ జడుడన్ క్షమించి దయతో దాటించి రక్షింపగా
సంభావించిన పాపకర్మఫల సంసారార్ణవక్లేశమున్.

మ|| కరుణన్ బ్రోవు మటంచు మ్రొక్కెద లసత్కారుణ్యధామంబు, శం
కరు పాదంబు మహేశ్వరీ ఘనపురస్కారంబు, మౌనీంద్ర హృ
త్సరసీజాంతర పూర్ణశాంతిసుఖ విస్తారంబు, లోకత్రయీ
భరణోద్యోగ పథంబు మత్ సతత సౌభాగ్యాభిరామంబుగన్.

కం|| బాలున్, సుబ్రహ్మణ్యున్
పాలిత సురలోక సైన్య పాటవ శాలిన్,
శీలిన్, త్రిశూల ఖేలిన్
వాలి భజింతున్ మయూర వల్లీ సహితున్.

శా|| సుబ్రహ్మణ్యుని నెన్నుదున్ నిరతమున్ శుద్ధాంత రంగంబుతో
సుబ్రాహ్మణ్యుని, యోగసిద్ధి భవమౌ సుజ్ఞాన సంజాత నా
నాబ్రహ్మాండ రహస్య తత్వ పరమానందానుసంధాన సా
త్మబ్రహ్మాస్మి వివేక భావపథ సిద్ధాంతార్థ సంప్రాప్తికై.

కం|| శంకరి సర్వశుభంకరి
శంకర ముఖజా మరంద సంపత్కేళిన్,
అంకిత భక్తవశంకరి
సంకటహారిన్ భవాని శర్వాణి శివన్.

శా|| ఆనందార్ణవరూపిణీ! శుభకరీ! ఐశ్వర్య సంధాయినీ!
గానాలోల సుమాళినీ! జయకరీ! కారుణ్య పాథోనిధీ!
నానాలోక సహేతు కల్పనకరీ! నాగేశ్వరీ! ఈశ్వరీ!
జ్ఞానాజ్ఞాన విభేద పాటనకరీ! జ్ఞానాంబికా శాంభవీ!

సీ|| అర్ధమైతివి నీవు అర్ధేందుధరునకు
నిగమార్ధమైతివి నిఖిల భువికి,
శ్రీచక్ర రాజాన చెలువొంద వసియించి
ఋషివరేణ్యుల యోగదృష్టివైతి,
త్రిగుణాత్మకంబౌచు సృష్టి స్థితి లయల
జగము లేలెడి జగన్మాతవైతి,
సింహవాహన మెక్కి చెండాడి దనుజుల
సకల సజ్జనలోక సౌఖ్యమైతి,
తే||గీ|| నిన్ను నమ్మిన వారిని నెమ్మనమున
అన్నపూర్ణవై సంతృప్తి నాదరింతు;
సకల సౌభాగ్య భాగ్యంబు సంతరించి
ఆయురారోగ్య సంతోష దాయి వయితి.

శా|| శ్రీసూక్తంబు పఠించి కొల్చెద శుభశ్రీశక్తి పీఠంబు, ల
క్ష్మీ సామ్రాజ్య చతుర్దిశా వలయ సుశ్రేయాధివాసంబు, అ
స్మత్ సౌభాగ్య విశిష్ట పుణ్యఫల సాక్షాత్కారధామంబు, నా
నాసూనాగరు ధూప దీప తతులన్ నైవేద్య సంపత్తులన్.

కం॥ మంగళ సర్వశుభంగళ
సంగమ మురహర సరసిజ షట్పద రామన్;
రంగ ద్వైభవశృంగన్
సాంగోపాంగంబు ౹మొక్కి సన్నుతి చేతున్.

కం॥ కొండను చిటికిన ౹వేలున
పండువగా నెత్తినట్టి పాండవ సఖుడున్;
అండగ నుండును నాయెడ,
మండిత కవితా విశేష మధువును చిలకన్.

*కం॥ కరుణాలవాల కరివర
వరదా! సురపూజిత మునివందిత చరణా!
మురహర నిరుపమ శమగుణ
చరితా! తిరుమల నివాస! సంపత్కరణా!

*కం॥ రమణా! తిరుపతి వేంకట
రమణా! కమలాసనాది రక్షక రమణా!
రమణీయ రూప రంజక
రమణా! రమణీ రమా సరసిజ ౹భ్రమణా!

వ॥ దేవా! అవధరింపుము. 105

* చతుర్విధ కందములు. వివరణ-1 చూడుడు.

# 5. కథా ప్రారంభము.

ఉ॥ శ్రీయుతమై మహావిభవ శీలత నొప్పెడు భారతాన భ
ద్రాయితమైన దక్షిణ పథంబున ఆంధ్రము నా బరంగు శో
భాయుత దేశ మొప్పు నతిభాసుర పాదప, శైల, నిర్ఝరీ
పేయ తటాక పట్టణ నివేశ్య నిశాన్త విలాస పంక్తితో.

సీ॥ శ్రీశైల, దాక్షార, శ్రీకాళ లింగంబు
లవతరించిన భూమి ఆంధ్రభూమి,
శ్రీగౌతమీ పెన్న కృష్ణవేణీ తోయ
సంఘంబు లాంధ్రుల సంచితంబు,
మంజీర నిక్వాణ శింజినీ ప్రక్వాణ
మంజిమా రవళుల మధువు తెలుగు,
సరసాంధ్ర సంగీత సాహిత్య నాట్యముల్
మకరంద మాధురీ మండితములు,

తే॥గీ॥ విద్య విద్వత్తు విజ్ఞాన విలసనమ్ము
శాస్త్ర సాంకేతిక సమజ్ఞ సంతరించి
భారతావని ప్రగతిలో భాగమగుచు,
ఆంధ్ర సంస్కృతి సుందరి అందమొప్పు.

సీ|| వేద వేదాంగాది వివిధ శాస్త్ర పురాణ
పారీణ వర్యులౌ బ్రహ్మవిదులు
సంగీత సాహిత్య సరసకళా రాజ
పోషక ధుర్యులౌ భూమిపతులు
దేశ విదేశ ప్రతీత వాణిజ్య సం
ధాన వితరణులౌ ధనికవరులు
భుజశక్తి ప్రభుభక్తి భూరక్తి తమభుక్తి
కడుకొని కదలాడు కర్షకతతి
తే||గీ|| సుందరారామ గేహులు సుగుణ ఖనులు
సహజసంపద చెన్నొంద సౌఖ్య మెసగ
పిల్ల పాపల తోడుత నుల్ల మలర
ఆంధ్ర దేశంబులో నుందు రధిక యశులు.

తే||గీ|| అందు గుంటూరు మండల మమరియుండు
ప్రకృతి సౌందర్య సంపదల్ పల్లవింప,
వివిధ సస్యాల సముదయ విమల పథము
రెడ్డి రాజుల రమణీయ నృత్య సీమ. 109

సీ|| ఆంధ్ర దేశమునందు అందాల నెరజాణ
రతనాల విరిబోణి రాగతిలక
తిక్కనార్యుని చేతి ఉక్కుఘంటిక ముక్కు
కదను త్రొక్కిన నవ్య కవనసీమ
శ్రీనాథ కవిరాజ శేముషీ విభవమ్ము
తీర్థమాడిన వాణి దివ్య పథము
కృష్ణవేణీ పెన్న జృంభితోత్తుంగ త
రంగ శృంగార మరంద హేళి

తే॥గీ॥ తెలుగు కీర్తికి నలుదెసల్ వెలుగు నిచ్చి
జాతి సంస్కృతి వెదజల్లి ఖ్యాతి గూర్చి,
వార్థి వర్తక వ్యాపార వారధయ్యె;
మహిత గుంటూరు నెల్లూరు మండలమ్ము.

తే॥గీ॥ కలదు గుంటూరు ప్రాంతాన గ్రామ మొకటి
ప్రీతి వేమూ రటంచును పేరు వెలయ,
శాంతి కాముక ప్రస్థాన జనపదమ్ము,
వేము వంశీయ పూర్వుల వీడు నిదియె.* 111

## 6. వేము వంశావిర్భావ కథనము.

శా॥ వేమూరన్ నిగమాగమార్థరతులై వేదాంత తత్త్వజ్ఞులై
నీమంబొప్పగ శాంభవీ జప తపోనిత్యాగ్నిహోత్రాళులై
గ్రామంబందున పెద్దలై గురువులై ఖామందులై ధీరులై
వేమూరన్ గృహనామముం బడయుచున్ వేరీతులన్ వర్థిలన్.

శా॥ మెప్పుం గోరరు వేదశాస్త్ర ఘనులై మేధావులై పూర్ణులై
తప్పుంబట్టక వారు కర్షకులతో తారాడి సేద్యంబు నే
ర్పొప్పంగా జరిపించుచున్, సమతులై యుత్కృష్ట దానంబులన్
మెప్పుంబొంది దధీచి కర్ణులకు సామీప్యంబు సాధించినన్.

---

* అనుబంధము-1 చూడుడు

తే॥గీ॥ కలిమి, విద్యయు, ప్రఖ్యాతి కలిగి వారు
కలత లేమియు లేక సుఖంబు నంది,
పౌరవరులని పలువురు ప్రజలు కొలువ
పిల్లపాపల తోడుత వృద్ధి బొంద.

తే॥గీ॥ కల్ల కపటంబు లేని ఆ పల్లె లోన
పుట్టె కలికాల మాహాత్మ్య పుష్టి కలన
ముష్కరుల గుంపు చోరులు మోసగాళ్ళు
దోపిడీ తోడ బ్రతికెడి దొంగ మూక.

శా॥ క్రూరాత్ముల్ విషయేచ్ఛులై అధములై క్రోధస్వభావంబుతో
వారంతన్ నరహంతలై అధిక బీభత్సంబు కల్పింప, నా
మారాకారుల కీడడంచి తగు సన్మార్గంబు పట్టింప నె
వ్వారున్ లేరట, పౌర సంఘములు నవ్వాక్కయ్యె నిస్సారమై.

ఆ॥వె॥ కడుపు లోని చల్ల కదలక యుండగా
బ్రతుకు వెళ్ల బుచ్చు బడుగు జనులు,
దొంగ గుంపు వలన దోపిడీలు కలన
చిత్తశాంతి తప్పి చింత జెందె. 117

ద్వి॥ దినదిన క్రూరులై త్రిమ్మరు లపుడు,
కనికరమే లేక కర్షక జనుల,
దొమ్మీలు చేసిరి దుర్బుద్ధి హెచ్చి
నమ్మిన వారినే నట్టేట ముంచి

వాడు వీడని లేక వావైన లేక,
వాడవాడను ఎంచి వదలకుండగను
పాడుచేసిరి యిళ్లు పైశాచ వృత్తి
బీడుచేసిరి యూరు బీభత్స మొంద
మానభంగము లవమానముల్ పొంది
మానవతు లపుడు మాటాడ లేక
ఎవ్వరు రక్షింతు రెవ్వారు కాతు
రెవ్వరు సరి వీరి కెవ్వరు వీరు
లంచును గ్రామస్థు లందరు గూడి
చంచల హృదయులై మించిన భీతి
వేమారు దలబోసి వెరవేది లేక
వేమూరి వారిని వేవేగ చేరి
రక్షింపుడీ స్వామి రక్షింపుడయ్య
శిక్షించి క్రూరులన్ శీఘ్రమే నేడు
పాపాల భైరవ కోపాల నుండి
కాపాడుడీ మమ్ము కర్తవ్య మెరిగి;
అని యిట్లు ప్రజ లెల్ల అర్థించి నంత
విని వారి యిక్కట్లు కనికారమంది
ఊరి పెద్దల నంత నొకచోట చేర్చి
వేరువేరున వారి వెరవులాలించి
పిలిపించె నప్పుడు వేమూరి పెద్ద
బలిసి బరితెగిన బందిపోటులను
పంచాయితీ పెట్టి మంచిగా చెప్పి
సంజాయిషీ కోరి సరియైన దారి

నడిపింపగా చేసి నయమున వారి
జడిపించి జరిమాన జప్తు చేయింప
పిలిపింప రానట్టి పిండారి దండ్ల
పలువురూ చర్చించి పరికించి చూచి
వెలివేసి రప్పుడు వెడలి పొమ్మనిరి
చెలికాండ్రతో గూడ శీఘ్రంబు గాను
వదలి పోవలయు నీ పల్లెను వీడి
ఎదురు లేదింక ఈ ఏర్పాటు కన్న
పెద్దయ్య ఆజ్ఞను వెంటనే జరుప
పెద్ద లందరు పంప పేటలో నున్న
పాలికాపులు పోయి బంటులై నిలువ
తలవరులంతలో తలపాక చుట్టి
చేతి కఱ్ఱల నెత్తి, మూతి మీసాల
భీతి పుట్టెడు రీతి ప్రీతితో త్రిప్పి
పిండారి దండుల పికపిక చేసి
పొండంచు వారిని పొలిమేర దాట
వేమూరు వెడలించి వెళ్లగా చేసి
వేమారు వారించి వెడలి వచ్చినను,
కోపమ్ముతో వారు తాపమ్ము నంది
"బాపనాయన చెప్ప భయ మందినారె
చూపెద మిదె చేసి చోద్యంబు గనుడు
రేపు తిరగకనే మాపు చేసెదము
వేమూరి వారిని వేరు వేరుగను
యముని పట్టంబున కతిథులం జేసి
ఆ యింటి పేరును హతమార్చి మేము

ఈ యూరు నేలెద మెవ్వ రేమనిన
ఆ యాస్తి నంతనూ అనుభవించెదము
చేయుడు మీరెల్ల చేతైనయట్లు"
అంచు నా రాత్రి వారందరు గూడి
మించు మాత్సర్యంబు మెరవడి పడగ
అవమాన మానస వ్యవసాయు లగుచు
అవని కంపించంగ నధిక రోషమున. 118

## 7. వేము వంశ పూర్వీకులైన వేమూరి కుటుంబము హత్య చేయబడుట.

ఉ|| రక్కసు లట్లు ముష్కరులు రాత్రిని కత్తుల తోడ వచ్చి, కై
పెక్కిన దుర్మదాన శివమెత్తిన రీతిని ద్రుంచి రందరన్,
చక్కని నిద్రమైకమున సౌఖ్య సుషుప్తిని నున్న వారి, ఆ
పక్కల మీద నుండగనె, వంశము నంతము చేయు బుద్ధితో.

కం|| ఏ మోస మెరుంగని ఆ
వేమూరి కుటుంబ మంత వ్రేటు పడంగా
ఓ మూల నక్కి దాగిన
భామామణి బ్రతికిపోయె భగవల్లీలన్.

ఉ|| భర్తను అత్తమామలను బావల భార్యల వారిపిల్లలన్
ధూర్తులు చంప, ఆ నవ వధూటి, నితాంత విషాద రోష భీ
తార్తిని ఆత్మహత్యకు తయారయె శోకవివర్ణయై, పరీ
వర్తిత పూర్వ జన్మఫల పాప నిదాఘ నిదగ్ధ ఘాతయై.

కం||	పెళ్లై వత్సర మాయెను
కాళ్లకు పారాణి ఆరగా లేదింకన్
మెళ్లో మంగళ సూత్రము
భళ్లంచును తెగిన ఎట్లు బ్రతుకగ నేర్చున్.

వ||	ఆ సమయంబున ఈ వంచిత కుటుంబ నిత్యారాధ్య, పరమ పూజ్య, భగవతీ కృపావిశేషంబున,

మేదిని||	అసదృశలీల గాంచె నపుడా కృశాంగి, తా మా
నస పటలంబునందు శివనాయకీ దయార్ద్రా
రసదరహాస చంద్రికల రాగ మార్దవంబుల్,
రసమయ వాక్యముల్ వినెను రమ్యమౌ స్వరానన్.

కం||	బేలా! ఏలా యీ పని?
చాలా కలదే విశేష చరితము నీకున్;
నీలో పెరిగెడి బాలుడు
ఈ లోకమునందు వంశ విస్తారకుడౌ.

వంశస్థము|| విశిష్ట వంశస్థుల వేదమూర్తులన్
అశేష విజ్ఞానుల నాత్మవేత్తలన్
ప్రశాంత మనస్కుల పాపభీతులన్
సుశీల! నీ గర్భము సూతియై మనున్. 126

శా||	అమ్మా! నీవలనన్ వెలుంగు భువిపై నాదర్శమౌ వంశ వృ
క్షమ్మున్, సంపద భూరి విద్యలును నాసాదించు నీవారి, నా
సమ్మోదమ్మున ఈవికిన్ వలసయౌ సంస్కారముల్ గల్గు. నీ
ఉమ్మాదంబును వీడుమింక, మరి వేరొక్కారు పొమ్మియెడన్.

# 8. వేమూరి వనిత పెంటపాడుకు తరలిపోవుట.

చ॥ అనుటయు ఆత్మహర్షమున ఆ లలితాంగి ఉమాసతి కృపా
ధనవతియయ్యె, ఆక్షణమ ధైర్యము స్థైర్యము మూటగట్టి, తా
వెనుకటి ద్వారమందు శశివెల్గున మార్గము పట్టి భీతితో
చనిచనె నొంటిమై మనము సందిట పట్టి విషాద రోషియై.

అశ్వగతి॥
దీనత నొక్కతె రాత్రిని తేకువ దీటుకొనన్
మానిని వేగమె పర్వెను మండెడు క్రోధముతో
పూనిక నశ్వగతిం విధి పుచ్చిన మార్గమునన్
మానుగ శంకర భామిని మానస రక్షణతో.

తరువోజ॥
కాలినడక తోడ కష్టాలు పడుచు
కాళరాత్రిని బోవు కాననంబందు
పలుమారు వెనుకకు భయముతో చూచు
పగలంత దాగును పాపటబోవు
చలితోడ వణకును శయనించ దెపుడు
చపలయై శంకించు శర్వాణి నెంచు
తలచి పంకించును తన దిక్కులేమి
తహతహ లాడుచు తరుణి తా కదులు.

ఉ|| చేతను రూక లేక, విధి చేష్టల కెంతయు తాళలేక, సం
పాత విషాదపూర పరిభావ మనమ్మును త్రిప్పలేక, సం
జాత మనోనిదగ్ధ భయసంభ్రమ కంపన మాపలేక, అ
న్నాతి ఉమామహేశ్వరిని నమ్మి పదంపడి పోవుచుండగన్.

తే||గీ|| ఏడురోజులు పయనించి ఎంతొ డస్సి
ఉదయ సంధ్యను చేరెను ఉవిద యపుడు;
ఊరు పొలిమేర నొక్కటి ఉస్సు రనుచు
ఓపికెంతయు లేకుండ ఓర్మితోడ.

తే||గీ|| మహిత గోదావరీ తీర మండలాన
పెంటపాడని ఆ పల్లె పేర బరగు;
వేద సాహిత్య పాండితీ వేత్తలైన
విబుధ వరులకు ఆ యూరు వేదికగును.

తే||గీ|| తపనతో డస్సి వేసారి దప్పి గొనుచు,
తప్పటడుగులు వేయుచు తన్వి యపుడు,
పెంటపాడుకు దరినున్న పంటకాల్వ
చెంత స్పృహ తప్పి పడిపోయె చేష్ట లుడిగి.

తే||గీ|| విప్ర వనిత యొకతె చూచి విధివశాన
చలన రహితయైయున్న ఆ లలన చేరి
దబ్బు దబ్బున చన్నీళ్ల తళ్లు జల్లి
స్వేదవదనను కొంతలో సేద తీర్చె. 135

వ॥ ఆ విధంబున తెరిపిగొని లేచిన సమయంబున పద్మ బాంధవుండు పద్మముఖిని కరుణింప నెంచెనో యన,

ప్రభాతము॥

వెలిగె ప్రభాతము ప్రీతి నిండె పృథ్విన్
కలికి మనంబున కౌతుకంబు పొంగెన్
చెలి హృదయంబున స్వేచ్ఛ నాట్యమాడెన్
అలపును తీరెను హాయి తోచె నంతన్.

వ॥ అంత నావృద్ధ నారీమణి పరదేశ ముగ్ధ భామామణి నుద్దేశించి యిట్లనియె.

సుందరి॥

సుందరి! ఎక్కడ నుండి సోలుచు వచ్చి తీ
సందెను! నామము వంశ సంజ్ఞ లవేవి, నీ
బందుగు లెవ్వరు లేరె పల్లెను, భీతియున్
సందియమున్ మది వీడి సంగతి తెల్పుమా!

ఉత్సాహము॥

ఏల యింత భీతి బాల, ఏల యింత వంత, నీ
కేల యింత భ్రాంతి, ఏల యింత భయము, నీ ముఖం
బేల కాంతిహీనమయ్యె, ఏల నీవు శోషతో
నేలమీద వ్రాలినావు, నెలత చెప్పు నీ కథన్. 140

చ|| అని యడుగన్ విషాద వదనాంబుజయై తన గాథ నంతయున్
వినయముతో వచించి, తన పేరును ఊరును వంశనామమున్
అనువుగ మార్చి తెల్పె, నిజ మా నరహంత లెరుంగనైనచో
తను పరిమార్తు రంచు నతిదారుణభీతి మనోవిషణ్ణయై.

కం|| వేమూరి వంశనామము
వామాక్షి చివర తునుముచు, వాలాయముగా
వేము తమ యింటి పేరని
రాముడు కులదైవ మంచు రయమున దెల్పెన్.

వ|| అంత నా వృద్ధసాధ్వి ఆ ధూళిధూసరపరీవృత వేదనాతప్త ముక్తారుణాంభోజ వదన, సప్త వాసర నిరాహార నిర్నిద్రాజనిత నిర్వేద కృశ శిరీష కుసుమసమ కోమలశరీర విచార గాథ నాలించి జాలి పొంది కనికరము జనింప గ్రుక్కు మిక్కన నేరక కొంతసేపు కౌగిలించి పదంపడి యిట్లని సముదాయింప దొడంగె.

స్వాగతం||
స్వాగతం బిదియె చంచలనేత్రా
నీ గతంబతి వినీతము గాదే
త్యాగశీలతను ధాత్రివి నీవే
వేగమే మరువవే వ్యథ భామా. 144

కం॥ మా యూరనుండు మమ్మా
ఈ యూరను గలరు బ్రహ్మ నెరిగిన జ్ఞానుల్,
పాయని హరిభక్తులు, భ
ద్రాయితులౌ శంఖచక్ర దర్పితబాహుల్.

కం॥ ధీవరుడై ఎన్నికగని
ప్రావీణ్యండై సమస్త భాష్యము లందున్
శ్రీవారును రామానుజ
సేవా పరతంత్ర వరవిశిష్టాద్వైతుల్.

తే॥గీ॥ అతిథి సత్కార మార్గంబు నాదరించి
బ్రహ్మ విజ్ఞాన తేజంబు ప్రజ్వరిల్ల,
నిత్యవైకుంఠ వాసు సాన్నిధ్యసేవ
దాస దాసాను దాస వందారుడతడు.

ఆ॥వె॥ ఇంటి ప్రక్క గదుల నిత్తును రెండింటి
కడుపు పండినంత తడవు దనుక;
అంతవరకు నిన్ను సొంత కూతురు వోలె
చూచుకొందు ప్రీతి ప్రోచు కొందు.

చ॥ అనుచును స్వాగతానుగత హార్దిక మైత్రి విశేష వాక్యముల్
చనువుగ చెప్పి, ఆ వనిత సాధ్వీశిరోమణి వెంటబెట్టు కొం
చును చని, భర్తయానతికి చొప్పడి యింటను నుంచె, తన్వియున్
అనునయవర్తియై మెలిగె నా భువిదేవులకున్ విధేయయై.

ఉ॥ కొన్నిదినాలు పోవు తరి కోమలి గర్భము పూర్ణమయ్యె, ఎ
న్నెన్నొ తరాల పూర్వకృత మేర్పడ వైదిక మార్గ పుణ్య సం
పన్నత మూటగట్టుకొని బాలు డొకండు జనించె, రూపునన్
వెన్నెల ప్రోవుచేసి మురిపెమ్మున ధాత సృజించెనో యనన్.

తే॥గీ॥ వీని మూలాన వంశంబు వృద్ధి బొందె
వేమువారి కుటుంబంబు విస్తరిల్లె,
విమల సద్గుణ సంపన్న విబుధు లగుచు
వేదవేదాంగ వేదాంత వేత్తలైరి.

# 9. వేము వంశములో సుప్రసిద్ధ మునీంద్రుని జననము.

వ॥ అంత కొన్ని తరంబుల పిదప,

శా॥ ఆ వంశంబున నుద్భవించె నొక వీరాగ్రేసరాకార తే
జోవర్ధిష్ణుడు, శిష్టరక్షణ కృపాశూరుండు, వ్యాయామ వి
ద్యావిఖ్యాతుడు, యుద్ధనాట్య నిపుణోద్దాముండు, నైకాత్భుత
శ్రీవీరేశ్వర భద్రకాళి కరుణన్ శ్రీయోగ లబ్ధాత్ముడున్.

వ॥ ఆ పాపడు, పిన్ననాటనే తమ చిన్నారి పొన్నారి అన్నిటను
మిన్న, తమ పెన్నిధియని కన్నవారు కన్న కలలు పండింప,

సీ|| శివ శివా యన నేర్చె చిన్నారి పలుకుల
ఏడాది లోపల ఎఱుక తోడ
వేద పాఠంబులు విస్ఫుట స్వరమున
వల్లించె నైదేండ్ల వయసు నందు
రెండు భాషలె కాక కొండ భాషలలోన
పదియేండ్లకే నయ్యె పండితుండు
వ్యాయామ విన్యాస పాటవ వ్యూహాలు
కౌమార మందున కరచె నతడు

తే||గీ|| నాట్యశాస్త్రంబు అభినయ నాటకంబు
సరస సంగీత సాహిత్య సౌష్ఠవంబు
మంత్రశాస్త్రంబు భైరవ తంత్రములును
వెన్నతోడన పెట్టిన విద్య లయ్యె.

తే||గీ|| మంత్ర తంత్రము లన్నను మహిమలన్న
యోగ మన్నను నిరుపమత్యాగ మన్న
నాట్య మన్నను గరిడి విన్నాణ మన్న
అన్నిటను మిన్న ఆ వేము చిన్నికన్న.

వ|| దినదిన ప్రవర్ధమానుండై ఆ బాలుండు,

కం|| శోభిత నటనా కౌశల
వైభవుడై, నియత విధిని వ్యాయామముచే
ఆభీల దేహు డయ్యెను
బీభత్సరస ప్రధాన విలసన లబ్బెన్. 158

ఆ॥వె॥ భద్రకాళి కొలిచి పరవిద్య సాధించి
వీరభద్రు కృపను ధీరు డగుచు
వేదవిద్య వలన వికసింప వాక్శుద్ధి
మంత్రసిద్ధి బొంది మహిని మనియె.

వ॥ ఈ విధంబున ఆ వేమువంశ పయఃపారావార శశాంకుండు, అకుంఠిత దీక్షాదక్షత, వివిధ లౌకిక శాస్త్ర పురాణేతిహాస పారంగతుండును, సనాతన నిగమాగమ విద్యాసిద్ధుండును, పరవిద్యా పరంధాముండును, లలితకళా లాలితుండునయి, శిష్యబృందంబులు సేవింప, భార్యాపుత్రులతో సుఖంబుండి, పూర్వపుణ్య ఫల పరిపక్వంబున అంతర్ముఖుండై యిట్లని యోజింప దొడంగె.

ఉ॥ వ్యాకులమైన దీ బ్రదుకు వ్యాజము తోడను నిండు సర్వమున్
జొకున పుట్టుటల్ మరల చచ్చెడి పుట్టెడి చక్రమందు నో
సాకిరి యాచు శోకమున చర్విత చర్వణ మౌట చూడ, తా
నేకిన దూదినే తిరిగి యేకెడు యేకులవాని పోలమే.

చ॥ 'చదివితి నెల్ల వేదములు జన్మము లొప్పగ చేసి' తంచు, తా
నుదురుపడంగ సౌఖ్యమె సుయోధను పోలిక, ఎన్నిశాస్త్రముల్
చదివిన కర్మమూలమగు జన్మల నంతము చేయనేర్తుమే
అదనుకు రావు ఏ చదువులైన కృతాంతు నవశ్యసన్నిధిన్.

తే॥గీ॥ ఎన్ని విద్యలు నేర్చిన ఏమి ఫలము?
ఎంత ధన మున్న ప్రఖ్యాతి యెంత యున్న
జనన మరణ చక్రంబును జరుపగలమె
ముక్తిమార్గ మెరుగక విముక్తి గలదె?

ఉ॥ పొందిన బ్రహ్మయోగమును పొందవలెన్, మరివేఱు సాధనల్
పొందిన శాశ్వతంబగునె, పూర్వకృతంబగు పుణ్యమూలమై
పొందితి సర్వశాస్త్ర పరిపూర్ణత, పొందితి భోగభాగ్యముల్
ఎందులకయ్య ఐహికము లింక పరంబు తలంపగావలెన్.

వంశస్థము॥
విరాగినై పట్టిస వీరభద్రునిన్
పరాకుగాకుండగ భద్రకాళితో
స్మరించు భాగ్యంబులు సంతరించినన్
వరించదే మోక్ష మవశ్య మీ యిలన్.

వ॥ కావున సకలవిద్యాతీతంబయిన శాశ్వతబ్రహ్మోపాసన తన ధ్యేయంబని నిశ్చయించి, తన యిష్టదైవంబైన శివమహాదేవుండు అఖండ గౌతమీ మధ్యంబున పట్టిస క్షేత్రనామంబునంబరగు పర్వతోన్నత ప్రదేశవాసియై ఆర్యామహాదేవి భద్రకాళి రూపంబున సేవింప వీరభద్రాభిదానుండై కొలువున్న మూలంబున అచ్చట శాశ్వత వాస మేర్పరుచుకొని బ్రహ్మ యోగాభ్యాసంబు చేయ నెంచి.

కం|| పట్టిస పర్వత కుట్టిమ
ఘట్టితపదు వీరభద్రు కట్టడ కొలువన్,
పుట్టిన కోరిక మది నా
కట్టగ తన యూరు విడిచి కదలగ దలచెన్.

## 10. వేము ముని పెంటపాడు నుండి వలసపోవుట.

ఆ||వె|| ఆ తలంపురాగ ఆత్మీయులను జేరి
శుభముహూర్త మొకటి శుద్ధిపరచి
సందడించి చేసె సన్నాహముల నన్ని
శిష్యతతిని గూడి శీఘ్రగతిని.

వ|| ఆ విధమ్మున పట్టిసక్షేత్ర ప్రయాణమ్మునకు ఆయత్తమై,

కం|| బంగరు పూసిన కొమ్ముల
ఖంగున మువ్వలును మ్రోగ గాంభీర్యముతో
రంగుల ఎద్దుల పూంచిన
హంగుల బండిని ద్విజవరు డధిరోహించెన్.

తే||గీ|| ముందు కర్షక బృందంబు బందుగులును
వెనుక శిష్య సమూహంబు వేదమంత్ర
నుతుల జటఘన శబ్దాల నుడువు చుండ
అరిగె సుముహూర్త సమయాన నాహితాగ్ని. 171

ఆ॥వె॥ వదిలె పెంటపాడు వర్ధిష్ణు విప్రుండు
పల్లె ప్రజలు భక్తి ప్రణతు లిడుచు
విడిచి పెట్ట లేక వీడ్కోలు చెప్పుచు
కొంత దవ్వు దాక కూడి రాగ.

*శ్వేగవతి॥
అతివేగముగా నరదంబుల్
భూతల మందున భోరని పోవన్,
క్షత మయ్యెను భాస్కర దీప్తుల్
ద్యోతక మయ్యెను తూర్పున జ్యోత్స్నల్.

చంద్రిక॥
ధరణిసురుని భావి ధామమై
మెఱయు ననుచు తెల్ప మింటిపై
విరిసె - భువనమందు వేడుకల్ -
సరిగ దశమి శుక్ల చంద్రికల్.

వ॥ ఆ విధంబున త్వరితగతిని ప్రయాణించుచు, 175

సీ॥ కతిపయ దినములు గడవంగ చేరిరి
పల్లెనొకటి మల్కపల్లి యనగ
మరునాటి వఱువాత మహాదేవు గుడిలోన
నమక చమకముల నాగహారు

---

*ఇది పరస్థానార్ధ సమవృత్తము. బేసి పాదములకు ఒక ఛందస్సు, సరి పాదములకు వేరొక ఛందస్సు ఉండును.

అభిషేకమును చేయ అరుదెంచి ఊరంత
భూసుర వైదిక పోషణమ్ము
గంభీర సుస్వర వుంభావ తేజంబు
వేనోళ్ల పొగడిరి వినతు లగుచు

తే||గీ|| ద్విజుని యాగమనంబును తెలియవచ్చి
రాయు డనియెడు పురజన నాయకుండు,
పల్లెటూరుకు ప్రభువంత వచ్చిచూసి
హృదయ ముప్పొంగ బ్రాహ్మణు పదము పట్టి.

శా|| సంప్రోక్షించిన వహ్నికీలిక వలెన్ శంపాలతా సన్నిభున్
కంప్రస్వాంతత మ్రొక్కి వేడుకొనియెన్ కాంక్షించి గ్రామంబునన్
సంప్రీతిన్ వసియింపుడంచు, ఒక ఆశాస్యుండు చేకూరినన్
సంప్రాప్తించు నటంచు భక్తిపథముల్ సాంగత్యమూలంబునన్.

వ|| ఇంకను ఇట్లని ప్రార్థించె.

పద్మనాభము||

ఓ భూసురా నీకు మ్రొక్కంగ నాకెంత
యో శాంతి గల్గెన్ నమస్కారమయ్యా!
నీభూరి తేజంబు వర్థిష్ణురూపంబు
నీ శాంతిహాసంబు నే గాంచినాడన్
సౌభాగ్యవంతుండ నైతిం ద్విజశ్రేష్ఠ
సాష్టాంగ దండ ప్రణామంబులయ్యా
వైభోగ సంధాన! నీ ప్రజ్ఞ విద్వత్తు
వైశిష్ట్యమున్ వింటిమయ్యా మహాత్మా!

కం॥ నిను బోలు వేదవేత్తల
కనమైతిమి పూర్వ మెపుడు ఘనరవచతురా!
నిను మ్రొక్కి వేడుకొందుము
కనికారము చూపుమయ్య కరుణాసింధూ!

ఉ॥ నాస్తిక చేష్టలన్ మురిసి నైతిక మార్గము దప్పి, దేహమున్
వస్తము లాస్తి వస్తువులె వాస్తవమంచు సుషుప్తినున్న, మా
దుస్తర దుష్ట యౌవనుల దుఃస్తితి మాన్పగ నీకె చెల్లు, నో
ఆస్తిక ధర్మ విస్తర విహార విశిష్ట విచార వర్ధనా!

ఉ॥ నమ్మము మమ్మ నీ యెడ మనమ్మ వినమ్ర విశేషమయ్యె, నీ
కిమ్మెయి గూర్చువార మిట ఇష్టిగ కోరిన వన్ని సౌఖ్యముల్
మమ్మెడబాసి పోకుము, సమర్థ సనాతన ధర్మమార్గ మం
దిమ్మగ దిద్దు మమ్మ జను లింక ముముక్షువులై తరింపగన్.

ఉ॥ ఆలయ మున్న దీ విధిని అర్చన లేమియు లేవు; కొండ రా
చూలిని శూలినిన్ గొలుచు శుష్కవిచారము వ్యర్థమయ్యె, పం
తాలకు బాలు రీ యెడను దాగుడుమూతల నాడుచుందు రీ
పాలికిరారు స్త్రీలెపుడు, బాలశశాంక ధరేశ పాలితా!

కం॥ దేవుని సొత్తై యున్నది
కొవెల కో పెడను భూమి కూరిమి తోడన్
వావిరిగా కట్టింతును
నీ వసతి కొరకు గృహంబు నిర్మల చరితా! 184

వ|| అని ఈ విధంబున రాయప్రభుండు ఆ వైదిక శిఖామణి ననేక ప్రకారంబుల, స్తుతి వందన నమస్కార ప్రాధేయక ప్రీతి వచనంబుల సంతుష్టుం జేసి, పదంపడి ఖాదన స్వాదనంబుల, స్నాన పరికరంబుల, లేప నానులేప నాలంకారంబుల, నూతన చీని చీనాంబర పరిధానంబుల, బహువిధ రతనంబుల, ఆభరణంబుల, వాదనంబుల, శోధన సాధనంబుల, గోధన భూధన ద్రవ్యధన ధాన్యంబుల, సనాతన పంచాయతనంబుల, పురాతన తాళ గ్రంథంబుల, అధునాతన కుడ్యంబుల, ఆద్యతన గృహాలంకారంబుల, సంధాన విధాన సాధన ప్రధాన ప్రగతి సూచకంబులగు వివిధ పరిమళ సుమహార వితానంబుల ప్రదానంబు చేసి, పట్టిస ప్రయాణ పథకమ్మును విరమించి, మల్కాపల్లెను శాశ్వత నివాసముండి తమ జనుల నుద్ధరింపుమని విన్నవించిన, రాయుని మాటలాలించి, ఆ గ్రామంబుపై నపార కృపాభిమానంబులు మనంబున జనింప ఆ బ్రాహ్మ ణోత్తముండు తనలో నిట్లని వితర్కించె.

తే||గీ| వీరభద్రుండు భద్రయున్ విడిచి యున్న
పట్టిసంబున వాసంబు భవ్య మగును,
యోగవిద్యను సాధింప యోగ్యమనుచు
బయలుదేరితి గాదె నే భవుని దరికి.

186

ఉ|| ఐనను నా మనమ్మది విహార విహాయస మయ్యె, నేడిటే
మైనదొ కాని యీ వనము నందొక చిత్రవిచిత్రమైన ఆ
హ్వానము తోచె, దేవళము నందున ప్రీతి జనించె, పౌరులున్
మానిత యోగ్య లంచు నభిమానము పుట్టె, నిదేమి చోద్యమో?

ఉ|| పట్టిస దివ్య వాసమున భర్గుని సన్నిధి యోగసాధనల్
గట్టిగ చేసి శాశ్వత సుఖంబుల నొందుదు నంచు నాత్మలో
పుట్టిన కోర్కి మింజువలె పొక్కుచు వీడితి స్వస్థలమ్ము, ఇ
ప్పట్టున మల్కపల్లె నిటు పాపట బోవుట కేమిహేతువో!

ఉ|| పట్టిస సీమ యీ యెడకు పట్టున ఓ పది యోజనంబులున్
గట్టిగ లేదు, రాయవరు గౌరవ పూర్వక స్వాగతంబు లా
కట్టెను నన్ను, నా మనము కక్కిరి బిక్కిరి చెందుచుండె, ఈ
తట్టున నేమిచేయదగు తాండవ శేఖరుడే వచించెడున్.

ప్రాస సహిత ఆటవెలది||

అని తనమనమందు నాత డూహించుచు
కనులు రెండు మూసి, గరళకంఠు
వినతి చేసె నపుడు విధిని బోధించగా
తనకు తాను తేల్చ తరము గాక.

వ|| అట్లు ధ్యానావలంబిత నిమీలిత నయనుండైన బ్రాహ్మణునకు తను నమ్మిన సదాశివుండు మనమ్మున ఇట్లని వాక్రుచ్చి నట్లయ్యె.

చ|| చదివితి వెన్నోశాస్త్రములు, జన్నము సల్పితి, యోగసాధనల్
వదలక చేతు నీశ్వరుని వాసము పట్టిస మందు నంచు, నీ
వదటు ప్రతిజ్ఞ బూనితివి; ఆస్తిక కర్మ్మడ వీ వెరుంగవే
సదమదమైతి వెందులకు! శంకరు డెక్కడ లేడొ తెల్పుమా!

వ|| అదియునుంగాక,

ఉ|| మానవ జన్మ కున్న దొక మంజిమ, బ్రహ్మ నెరుంగుటే సము
త్థానము ధ్యేయమై వెలయ, ధార్మిక వేత్తలు కొంత స్వార్థమున్
మాని, సనాతనాస్తిక సమాజ సముద్ధరణంబు చేయుచున్
జ్ఞానిగ ఈ భువిన్ విభుని జ్ఞాపికగా చవి చూడగా వలెన్.

ఆ||వె|| మనిషి యనెడి చీమ మహదేవుడను తేనె
తినుచునుండ గలడు తృప్తి తోడ,
భవుని నైక్యమైన భక్తుని కెపుడైన
తీపి పులుపు చేదు తెలియ గలవె. 195

వ|| కావున నా కృపావిశేషంబున నీకు సంక్రమించిన వేదవేదాంగంబులు, మంత్ర తంత్రంబులు, సనాతన ధర్మాభ్యుదయ శాస్త్రంబులు, కావ్య పురాణముఖ గ్రంథంబులు, నాట్య నాటకాలంకార విశేషంబులు, మానవాళి అభ్యున్నతికై వినియోగించుచు, ఈ వనంబున ఒక ఆదర్శాశ్రమం బేర్పరచి, పాత్రులైన విద్యార్థుల మూలంబున భావితరంబులకు వ్యాపింప జేయుచు ఇచటనే నా సన్నిధానంబున

బ్రహ్మయోగాభ్యాసంబు చేసి తరింపగలవు. నీకు శుభంబగు. ఇంతియగాక, నీ జన్మకు గల ప్రధాన లక్ష్య మొకటి సిద్ధించగలదు. వేచి చూడమని ఆనతిచ్చినట్లైన ఆ బ్రాహ్మణుండు మాలిన్య నిర్మూలిత స్వచ్ఛ ధవళ వస్త్రంబు పగిది సందేహ నిర్వృత నిర్మల మానసుండై.

## 11. వేముముని మలకపల్లెలో స్థిరపడుట.

తే॥గీ॥ మలకపల్లి రాయవిభుని మహజరులను
వినతు లవలోకనము చేసి విబుధు డపుడు,
ఊరి వనమందు వసియింప నొప్పుకొనియె
చిత్త మందున భవునాజ్ఞ చిగురు తొడుగ.

వ॥ అంతట బ్రాహ్మణుని ఆదేశానుసారముగ,

ఉ॥ ఆశ్రమరాజి రాయు డపు డశ్రమలీల రచించి యిచ్చె, నా
నాశ్రుతి శాస్త్ర వైదిక సనాతన ధర్మపరిశ్రమా వివే
కాశ్రిత విప్రశేఖరున కా నయచిత్రవిచిత్ర శేముషీ
విశ్రమ కేంద్రమందు సురవిభ్రమ విశ్రుతుడై మెలంగుచున్.

వ॥ కొన్ని సంవత్సరములలో ఆశ్రమంబు నా యతిశ్రేష్టుండు తీర్చి దిద్దిన,

సీ|| వ్యాయామ విన్యాస వర్ధిష్ణు కాయులౌ
యువకుల తండంబు లొక్క చోట,
వేద పాఠంబులు వేమారు వల్లించు
ఉత్సాహ వటు సంఘ మొక్క చోట,
ధ్యాన యోగాసన తన్మయత్వము నొందు
ఉత్కృష్ట యతిబృంద మొక్క చోట,
సాహిత్య పౌరాణ సంగీత వాద్య నా
ట్యోన్నత పరివార మొక్క చోట,
తే||గీ|| జ్యోతి షోపనిషత్ మహాద్యుతి ఖగోళ
తర్క వేదాంత మీమాంస ధర్మశాస్త్ర
మంత్ర తంత్రాధ్యయన పృథుయంత్ర రచన
వివరణాసక్త సాధక విదులగూడి,

తే||గీ|| నిత్య జపతప క్రతుహోమ నిలయ మగుచు
శిష్య శిక్షక శ్రోత్రియ శ్రీకరంబు
వ్యాస వాల్మీకి వాసిష్ట వాసమట్లు
సతత సన్మంగళ క్షేత్ర మతని గృహము.

తే||గీ|| విద్య పరవిద్య ఐహికవృత్తి కలన
వాణి శర్వాణి సిరిబోణి వాసమున్న
సత్య కైలాస వైకుంఠ సన్నిభంబు
నిత్య మంగళ సన్నుత నిలయ మదియె.

మ|| శత సంఖ్యాదిక శిష్యబృంద పరివేష్టైశ్వర్య సంప్రాప్తుడై
శత యజ్ఞేంద్ర సమాన వైభవుడునై, సర్వేంద్రియాజిష్ణుడై
మతి లోకోత్తర మాననీయ మహిళా మాంగల్య నర్ధాంగిగా
ప్రతిభా శౌర్య విలాస శిష్య తతితో ప్రఖ్యాతుడై వర్ధిలెన్.

ఉ|| చక్కని పుత్రికల్ పరమ సాధ్వియు భార్య కుమారవర్గమున్
మక్కువమ్రొక్కు పౌరజనమండలముల్ పరివారబృందముల్
తక్కక కొల్చు శిష్యతతి దక్షమఖాంతకు నిత్య దీక్షయున్
వాక్కున మంత్ర శక్తిగల వైదిక ముఖ్యుని నెన్న శక్యమే.

వ|| ఆ ఆశ్రమంబున,

ఉ|| శోధకుడై, నిజాత్మ పరిశోధకుడై, ఘనవేదశాస్త్ర వి
ద్యాధికుడై, మహాకథకుడై, అతిలోక నిగూఢ శాంభవీ
సాధకుడై, విశిష్టజన సంయమి శిష్య పరంపరా సమా
రాధితుడై, వివర్త నటరాజ విరాజిత దర్శనోద్ధుడై.

చ|| తనమనమందు వీరశివతాండవ రూపము కన్నుమూసినన్
ఘన శివదీప్తి దర్శనము కన్నులు పూర్తిగ విచ్చుచో త్రిలో
చన వదనాంబుజంబు నగజాతనుగూడి జగంబు నిండుగన్
కనబడు స్వామి మానసము కాంతులనీన నిరంతరంబుగన్. 208

వ|| ఈ విధంబున ఆ వేము వంశజుండు, భార్యాపుత్రాదులతో
వసించుచున్ననూ కర్మ సన్యాసియై రాయనాయక నిర్మిత

ముని జనాశ్రమంబున వివిధ విద్యాన్వేషక శిష్య బృందంబులతో నిరంతర దర్శనాంతరంగ భక్తప్రవాహ తరంగంబులతో సగుణోపాసనగా నియమిత సమయంబుల నిత్య పూజాభిషేక ధూపదీప నైవేద్య నీహార దర్శనాది వివిధోపచారంబుల ఉమా సహిత మహాదేవుని కొలుచుచు, నిర్గుణోపాసనగా తక్కుంగల కాలంబున ఆత్మలింగంబును కుంభక పూరక భస్త్రాద్యాది ప్రాణాయామ విశేష పురస్సరంబుగా, యమ నియమ వృత్తి, ప్రత్యాహార ధ్యాన ధారణ మనన సమాధిస్థితులగు అష్టాంగ యోగంబుల సేవించుచూ, 'సోహం బ్రహ్మాస్మి', 'ఏకమేవ అద్వితీయం బ్రహ్మ' అను సూక్తులకు ప్రతిరూపంబై ఆనందస్వరూపుండై బ్రహ్మానందంబు ననుభవించుచు కాలంబు పుచ్చుచుండ.

# 12. రెడ్డిరాజ్య సామంతుని కథనము.

శా।। ఆ కాలంబున* రెడ్డిరాజ్య రమ సర్వాధిక్యమై వెల్గ, ఆ
ఏకచ్ఛత్రపథంబు నేలెడు నృపాలేశుండు ధీయుక్తుడై
కీకారణ్య పరీత ప్రాంతమును రక్షింపంగ నైకాద్భుతం
బౌ కోటన్ రచియించి ఉంచె నొక సేనాధ్యక్షు పాలింపగా.

ఆ।।వె।। కాకతీయవంశ కాపురుషు డొకడు
యుక్తితోడ రాజ్యభుక్తి కుడుగ
సార్వభౌము డెరిగి సామంతుగా చేసి
మన్యకోట కతని మనిపె నపుడు.

---

* అనుభంధము-2 చూడుడు

వ॥ ఈ విధంబున సరిహద్దు భద్రతకై కట్టిన కోటను రక్షింప నియోగింపబడిన కాకతీయ యోధుండు, సర్వస్వతంత్రుండై నరపాలుని భంగి రాజ్యంబు నేలుచుండె.

కం॥ దురహంకారుడు క్రూరుడు
నిరంతర విషయవిలాస నేపథ్యుండై
నిరవగ్రహ నిర్ఘృణ్ణత
నిరంకుశ విధమున కోట నేర్పున నేలెన్.

కం॥ ఘోరాటవి మధ్యంబున
పారాకై కట్టినట్టి ప్రాసాదములో
వేరెవ్వరు రారాదని
చారుల పెట్టించె బాటసారుల పైనన్.

కం॥ ఆతత దోర్బల ధీరుడు
కాతర చేయండు రిపుల కలలో నైనన్
ఆ తరి ప్రజ భయ మందగ
పోతరమున పోతురౌతు పోలిక నేలెన్.

ఉ॥ దుర్గము చేతనుండ, తమ దోసిలి యొగ్గెడి కాంతలుండ, దు
ర్మార్గుల మట్టుపెట్టెడి పరాక్రమ విక్రమ సైన్యముండ, తా
స్వర్గసుఖమ్ము లెన్నియొ నవారితవృత్తిని పొందుచుండియున్
దుర్గమశక్తి భూతబలి దూష్యవిధమ్ము వరించె క్రూరుడై.

ఉ|| లౌకిక రాజ్యసంపద విలాస సుఖమ్ముల తృప్తి లేక, లో
కైక మహావిశేషణుడ నేనని గర్వ మదాంధుడౌచు, భూ
లోకము నెల్ల యేలెడి ప్రలోభ ప్రవృత్తిని క్షుద్రశక్తులన్
పోకిరియై జపించె నెనుబోతుల కుక్కుట రక్తధారలన్.

కం|| భేతాళిక కాపాలిక
పాతక బలిదాన పాశుపతులను రుద్రా
ణీ తతులన్ పిలిపించుక
రోతపడక రౌద్రయజ్ఞ రూక్షితపరుడై.

వ|| వీరశైవమతానువర్తుండై భీషణమార్గంబున చరించుచు, ఆ
కార్యక్రమంబుల నిర్వహింప కాపాలికాచార్యుని నాహ్వానింప,

సీ|| చింపిరిజుట్టుపై శిఖలను చుట్టించి
జీర్ణకౌపీనంబు జీరియాడ
ఒడలెల్ల వీబూది నొత్తించి త్రి
పుండ్రరేఖల నెర్రబొట్టుదిద్ది
బరువైన రుద్రాక్ష సరిగతో లింగంబు
గళసీమ వింతగా గంతులేయ
మనుజకపాలంబు మధువుతో నింపించి
తేపతేపకు త్రాగి త్రేన్చుచుండి
తే||గీ|| మాంసఖండంబు నములుచు మగువ నొకతె
కౌగిలింతల తేలించి కదలివచ్చె
పృథ్వినడయాడ వెడలిన ప్రేత మనగ
సోమసిద్ధాంతి ఆశ్రిత శ్రోణి దవిలి. 220

తే॥గీ॥ కంటె కుండలమ్ములు రుచికమ్ము శిఖలు
వెల్ల భస్మంబు యజ్ఞోపవీతములను
ఆరు ముద్రల దాల్చి శైవాగమవిధి
వీరశైవులు గురునితో వెడలిరపుడు.

తే॥గీ॥ ప్రౌఢకాపాలినీ పరిష్వంగులగుచు
మద్యమాంసాల బక్షించి మదము హెచ్చి
విలయకాల సంక్షోభ మావిర్భవింప
నటనమాడెను శాక్తేయ పటల మపుడు.

కం॥ గొర్రెల మేకల మందల
బర్రెల నెనుబోతు తతుల బంధుర రీతిన్
బుర్రల కోయగ పారెడి
ఎర్రని రక్తంబుతోడ ఎగిచిరి అగ్నిన్.

తే॥గీ॥ శాకినీ ఢాకినీ రౌద్రశక్తి తతిని
భీకరాకార దేహులు భీతి కొలుప
తంత్ర మంత్రయుతమ్ముగ తర్పణాల
అర్ధరాత్రుల తనిపిరి అసుర విధిని. 224

వ॥ ఈ విధంబున వివిధ జంతు సమూహంబుల అమావాస్యలందు అర్ధరాత్రంబుల బలు లిచ్చుచు శాక్తేయ తంత్రపద్ధతిని కాపాలినీ కాపాలికులు మద్యపాన మత్తులై బాహాట వికార కందర్పదర్ప దర్పితులై సామూహిక నాట్యంబులతో భేతాళ మంత్రంబులతో భైరవాది క్షుద్రశక్తుల నారాధించుచు, ఒక్క సంవత్సరంబు నిర్విరామంబుగా శాక్తేయ హోమంబులు రౌద్ర

తామస బీభత్ససమారాధనలు చండీయాగంబులు నిర్వహించి నను, సేనాధ్యక్షున కే విధమైన మహిమలు, శక్తు లబ్బక వ్యాకుల చిత్తుండై యుండ, ఒక్కనాడు శాక్తేయ గణాధ్వర నిర్వాహకుండైన భేతాళ తాంత్రికుండు ప్రభుని సమీపించి ఏకాంతంబున నిట్లనియె.

ఉ|| అన్నిటికన్న మిన్న యొక అధ్వర మున్నది నాయకోత్తమా!
ఎన్నొ దినాలనుండి తమకీ విషయంబును తెల్ప గోరితిన్
నిన్నటిరాత్రి స్వప్నమున నెమ్మి కతోడను భైరవుండు నా
సన్నిధి నిల్చి కోరె నొక చక్కని బాలుని రక్తమాంసముల్.

కం|| మేధా యజ్ఞంబులు వివి
ధేధితములు మరి అశ్వమేధ మెరుగుదు వీవున్,
ఆధిక్యంబన్నిట నర
మేధమె, దీన గలుగును అమేయ శుభంబుల్.

# 13. కాపాలికాచార్యుడు నరబలి ఇమ్మని సామంతునితో చెప్పుట.

చ|| అరిగిన కాలమందు వసుధామరులున్, జనపాలవర్గముల్
నరబలి తోడ గూడిన సనాతన భైరవ యజ్ఞపుష్టిచే
తరుగని భాగ్య సంపదల ధారుణి పొందుచు, బొందితోడనే
అరిగిరి సర్వ సౌఖ్యముల నందగ నిర్జరలోకవాటికిన్. 228

మ।। మరు రూపుండును, శౌర్యవంతుడును, ధీమంతుండు, సద్వంశజా
వరతేజోబల యౌవనుండు, ప్రతిభా వైదుష్య సిద్ధుండు, కా
తర రక్షుండగు బ్రహ్మచారి నరమేధ ప్రక్రియన్ దీక్షతో
పరితోషంబున దాన మిచ్చిన గదా ప్రాప్తించు ప్రాకామ్యముల్.

ద్రుత విలంబితము।।
వినుము నాయక వీనుల విందుగన్
మనకు భైరవు మైవడు లేర్పడెన్
ఒనర మేధము కో నరు నెన్నుమా
పనుపు యోధుల బాలుని పట్టగన్.

ప్రాసయతి ప్రాసయుక్త తే।।గీ।।
అట్టి బాలుండు ప్రాప్తించు నట్టులైన
పట్టి వానిని బంధించి కట్టి తెమ్మ
రట్టు చేయక బలి యిత్తు గుట్టుగాను
తట్టి లేపుచు భైరవు పట్టు బట్టి.

తే।।గీ।।
సంతసించిన భైరవ సంఘ మపుడు
నిలిచి నీ ముందల దీవించి నెమ్మితోడ,
నీవు కోరిన సిద్ధులు నిశ్చయముగ
మెచ్చి యిత్తురు నా మాట మిథ్య గాదు.

232

తే॥గీ॥మాలిక॥

దూరశబ్దాల వినికిడి, దూరదృష్టి
లేని వస్తువు సృష్టించు లీల యొకటి
వ్యోమయానంబు తరగని కామశక్తి
నిత్య యౌవన మారోగ్య నిశిత సుఖము
మచ్చు కొక్కటి చెప్పితి మెచ్చు కొనగ
ఇంత ఎందులకయ్య నీకేమి వలయు
అన్ని సమకూడు సంకల్పమైన క్షణము
అంతు లేనట్టి శక్తి నీ సొంత మగును.

కం॥ అనుమానంబును వీడుము
పనుపుము నేడే భటులను బాలుని కొరకై;
మును వచ్చు నమావాస్యను
మునిమాపున జరుగు యజన పూర్ణాహుతికై.

వ॥ కావున నీవు తక్షణంబు భేతాళ భైరవ కాపాలికాది ప్రశస్త శక్తుల ప్రీతికై రూప యౌవన సంపన్నుండును, సద్వంశుండును, పరాక్రమవంతుండును, ధర్మవర్తనుండును నగు ఒక బాలుని తెప్పించి, నరమేధ సహిత చండీయజ్ఞంబు నిర్వహించి వాంఛిత ఫలంబులు పొందుమని గణాధ్యక్షుండు వాక్రుచ్చిన, సేనాధ్యక్షుండు సంతసించి, ఆ కాపాలికాచార్యునకు బహు విధంబులౌ ధనధాన్య భూషణాలంకారంబుల బహూకరించి,

కం॥ చేతును నరమేధంబును
భేతాళుడు భైరవుండు భేషని యనుచున్
ఆతత సిద్ధుల నీయగ
కౌతుక ముప్పొంగ నాకు కాంక్షలు తీరన్.

ఉ. భద్రగిరీశు భవ్యపదపద్మ గవేషుడు రామదాసు హృ
న్ముద్రల తెల్గువెల్గు పదమోహరమందు పసందు విందులన్
తద్రస మాధురీ ఝురుల తన్మయతన్ విహరించి మించు నా
భద్రవతిం గనంగ మది ప్రాప్తము గావె అనేకలాస్యముల్.

ఉ|| ఎన్నగ తెల్గు సాహితికి నేర్పడ వాగనుశాసనుండు సం
పన్న మనోభిరామముగ భారత సంహిత నాంధ్రభాషలో
ఎన్నిక గల్గు రీతి వెలయించిన నన్నయ భట్టు వాక్కులో
నన్నువు గౌతమీ జలము లందున గాంచిరి మిత్రులా యెడన్.

వ|| ఆ విధంబున నదీ మతల్లి గోదావరీ సౌందర్య విలాసంబులు
తిలకించుచు, యౌవన విలాస హేలత తనువులు మఱచి,
అపరాహ్ణ సమయంబు దనుక నందీశ్వర ద్వీపంబున,

కం|| అందందు తిరిగి యాడుచు
డెందము లందున పొగరున టెక్కులు రేగన్
చిందులు త్రొక్కుచు మూర్ఖులు
నందీశ్వరు కొలువు మఱచి నవ్వుచు వారల్.

ఉ|| ఆననసీమలందు హృదయాంతర కౌతుక ముప్పతిల్లగన్
ఆ నగరాజమున్ విడిచి యౌవన విక్రమ తేజవృత్తిమై
కోనల గుట్టలం గడచి కోడిగ మాడగ చేరి రంత పం
చానన ఖడ్గ భల్ల గజ శల్య విరాజిత కాననంబునన్. 262

వ|| ఆ విధంబున మన్యంబు చొచ్చి ప్రకృతి సౌందర్యంబు తిల
కించుచు, అటు నిటు తిరిగి కాననంబు చొచ్చుకొని పోయి,

తే॥గీ॥ తిరిగి కొంతలో నటు నిటు తిరిగి తిరిగి
దట్టమైనట్టి అడవిని దారి గనక
చుట్టు నున్నట్టి పొదలలో చుట్లు తిరిగి
అలసి వేసారి కడుసొలి నటమటించి.

కం॥ అడుగులు తడబడ నడనిడ
చెడుగుడి ముడివడి కడువడి చిడుముడి పడుచున్
వెడవెడ విడబడి నిలబడి
కడిగొన పదపడి సుడివడి కడుపులు ముడువన్.

ప్రాసయుక్త తే॥గీ॥
బక శుక శిఖి కోకిల కాక బహువిధాండ
జ కలకల రవ మాధురి స్వనములు విని
వికచిత ముఖులై ఆ వంక వెడలి చూడ
గ కనబడె నొక వనమున కలువ కొలను.

వ॥ ఆ వనాంతర సరఃప్రాంతంబున,

విజయమంగళము॥
ఆమని సొగసుల వరలిన ఆవని నయ సోయగములు
కమల సుమ వితాన మధుర గంధ పవన మిళితమయ్యె,
విజయమంగళ గళమూని వింత కులుకు లొలుకు చుండ
కూజితముల శ్రావ్యగాన గోష్ఠి హాయి గూర్చె నపుడు.

కం॥ శిఖరాగ్ర దృశ్య దర్శన
సుఖ సంతోష కలిత ముఖ సుందర సఖులై
సఖు లప్పుడు లీలా బా
ల్యఖేలల వయోజనిత బల విశృంఖలులై.

కం॥ గోదావరి మధ్యంబున
పాదప సముదాయ యుక్త పర్వతమునకున్
మోదంబలరగ వా రపు
డీదిరి యుత్సాహకాంతి యింపెసలారన్.

వ॥ అట్లు గోదావరీ మధ్యస్థ ద్వీపంబు చేరి,

కం॥ పరుగున ఎక్కిరి కిన్నెర
సురగరుడోరగ మురహర సురగురు మౌనీ
శ్వర ఖేచరులకు తెరువగు నా
గిరివరమును నందికేశ గిరిసుతపురమున్.

కం॥ పర్వత శిఖరము క్రిందను
ఉర్వీస్థలి చూడగ నమితోత్సాహముతో
పర్వులు పెట్టిన మానస
మోర్వక పాటల నటనల నుత్తేజితులై.

మేదిని॥ శిఖరమునుండి గాంచిరి విశిష్ట వైభవ శ్రీ
సఖమగు భూరిదృశ్యమును చక్షురుత్సవంబున్
అఖిల మునీంద్ర పూజిత మహత్వ గౌతమిన్, ఆ
సఖసముదాయ మప్పుడు విశేషరక్తితోడన్. 252

ఉ॥ స్వైరవిహారధీరయగు శారద నీర తరంగ రంగ గం
భీరము గౌతమీ నదము ప్రేంఖణ నడ్డెడి పాపికొండలన్
భోరున చీల్చి నిమ్నతల భూముల దూకెడువేళ చూపు శృం
గార విలాసముల్ కనగ కన్నుల పండువ యయ్యె వారికిన్.

శా॥ కన్నుల్ చాలవు చూడ ముచ్చటలునౌ కల్యాణి గోదావరీ
పన్నీరంబులు, త్ర్యంబకేశ్వర పదోత్పన్నంబులౌ నిత్య సం
పన్నంబుల్, బహుళాంధ్ర ధీరవనితా ప్రాగల్భ్య సంగాతమౌ
విన్నాణంబులు, నాట్య భంగిమలు, సంవేగ ప్రతిధ్వానముల్.

ఉ॥ పట్టిస వీరభద్రు శుభపాద మహత్వ పవిత్ర యౌచు, ఏ
పట్టున నిల్వ నొల్లక అహాంపతి శీఘ్రమె చేరు నిచ్ఛతో
గట్టుల కోనలందుమికి గాఢ తరంగ పృషన్నిభంగ, అ
ప్పట్టున నేడు పాయలయి పావన సప్తఋషీశ్వరాన్వయై.

శా॥ అక్షయ్యంబుగ సప్త నిర్ఝరుల అన్యోన్యానుసంధానమౌ
సుక్షేత్రంబుల శ్రీఉమా సహిత తేజోమూర్తియై శర్వుడున్
సాక్షాత్కారము నిచ్చు నాశ్రిత జనాశామోదమై, అందునన్
దక్షారామము క్షోణిపై వెలసె సత్యంబైన కైలాసమై.

శా॥ రంగత్తుంగ తరంగ రంగములునై రంజిల్లు వైభోగముల్
పొంగంబారెడు బుద్బుదంబులు వళీపుంజంపు సందోహముల్
సాంగోపాంగము గాగ పూర్ణ శబరీ సాంగత్య మాంగళ్యముల్
గంగామౌళి వసించు క్షేత్రపథ శృంగాలింగనా భంగిమల్.

కం॥ చేసెద చండీ యాగము
భాసురముగ వీర రౌద్ర భైరవ వృత్తిన్
వేసెద పసిబాలుని బలి
వాసిగ త్రిదిపాధివాస వరమును గొందున్.

వ॥ అని మనంబున తలంచి,

కం॥ బలికై తెండని పనిచెను
బలదర్పుల ముష్కరతర భట భీకరులన్,
బలిమిని చక్కని బాలుని
బలవంతుని యోగవంతు ప్రాభవవంతున్. 239

వ॥ ఆ రాజాజ్ఞ శిరసావహించి,

ఉ॥ రాజనియోగ యోధులు కరాచురి కార్ముక బాణధారులై
భ్రాజిత వాజితండముల బంధుర రీతిని గొంచు పోయి రో
రాజితరూప యౌవన పరాక్రమశాలిని తెచ్చు కోరికన్
వ్యాజము తోడ మన్య విపినాంత మహాజనవాస వాటికిన్.

వ॥ ఆ విధంబున వారు గోదావరీ నదీప్రాతంబున వెలసిన పోలవరగ్రామ
పరిసరంబులకు శీఘ్రమే పయనింప దొడంగిరి. ఇది యిట్లుండ,

## 14. రాయ పుత్రుని విహార యాత్ర.

ఉ॥ ఆయెడ మల్కపల్లె నవయౌవనరాజ్య విలాస హేలుడై
రాయనిగారి పుత్రుడు పరాజిత శత్రుడు ధర్మరక్షణ
ధ్యేయుడు మిత్రులం గలసి ధీవరు డేగె విలాస యాత్రకున్
తోయ సమీప దుర్గమ సుదూర శిలోన్నత వన్యవాటికిన్.

సీ|| మేలైన హయముల మెరవడి పూంచిన
బగ్గీల నెక్కిరి బాలు రపుడు,
పొంగారు మాటల పోటరి పాటల
హాస్యంపు చెళుకుల హాస రుచుల,
దూరంబు నెరుగక తీరంబు చేరిరి
తూర్పు దిక్కున లేత ద్యుమణి పొడువ,
గోదావరీ నది గుట్టల విడిసిరి
జలకంబు లాడిరి సఖుల గూడి,
ఆ||వె|| ప్రకృతి కాంత శోభ పరికించి మెచ్చుచు
తాళ్ళపూడి దాటి త్వరిత గతిని
గుట్ట దారి నంత గూటాల దరిచేరి
బండ్ల వీడి కాలి పథము పట్టి.

తే||గీ|| అరుణ కిరణాల వెలుగున మెఱయుచున్న
దివ్య దేదీప్య మానమౌ ద్వీపరాజి
పట్టిసక్షేత్ర శిఖరంబు భక్తితోడ
మ్రొక్కి ముందుకు సాగిరి మురిపె మెసగ.

తే||గీ|| పోలవరమున రామయ్య కొలువు చేసి
సందు సందున ఊరి పసందు చూసి,
కొంత దూరమ్మున కడెమ్మ కొండ గాంచి
నందికేశుడు వెలిసిన నగము గనిరి. 246

నవమయూరము॥

విప్పినవి పింఛములు విందులను చేయన్
కప్పినవి భూతలము కన్నులకు హాయై
త్రిప్పినవి కంఠములు తీరుపుల తోడన్
ఒప్పినవి ఆ వనమయూరములు ప్రీతిన్.

కుసుమ విచిత్రము॥

వనమున పూవుల్ వలపులు చూపన్
ఘనముగ చెట్లన్ కలయగ పూసెన్
మనమున ప్రీతై మమతలు నిండెన్
కనగను హాయై కవితలు తోచెన్.

కుసుమవిచిత్రము॥

నవ నవలాడెన్ నవ వనమంతన్
అవని ప్రశాంతిన్ అవనత మయ్యెన్
కవనము చెప్పెన్ కలువల కన్నెల్
యువకుల విందై యుత్సవ మయ్యెన్.

వ॥ అంత ప్రకృతి కాంత కేకాంతంబు కల్పింప నెంచెనో యన
ఆదిత్యుం డస్తమింప నుద్యుక్తుండయ్యె. 272

రథగమన మనోహరము*॥

కమల లలన మోము కాంతిహీన మయ్యెన్
విమల సమీర రవమ్ము వీణ వోలె మ్రోగెన్
ద్రుమ వికసిత పుష్ప మధూళి గాలి దూలెన్
భ్రమసి భ్రమర భద్ర పంక్తి ఝుంకరించెన్.

*ఇది 1,3,4 పాదముల కొక ఛందస్సును, 2 వ పాదమునకు వేరు ఛందంబును గల పరస్థానార్ధ విషమోపజాతికి చెందిన వృత్తము

భ్రమర విలసితము||

సంజన్ కాంచంగ  స్మరుని శరముల్
జంజాటంబుల్ విసరెను హృదులన్
మంజిష్ఠంబౌ సుమసముదయముల్
రంజిల్లం జేసె రసిక యువతన్.

కనకలత|| అలరు విలుతుని కుసుమ శర హరువుల అరుసమునన్
కెలువున చిలుకలు జతలయి కిలకిలమని కులికెన్,
కలువలు తలకెను నటునిటు కలపడి విరహమునన్,
కలభపు కొొదమలు కరిణుల కదియగ కలుచబడెన్.

వ|| ఆ సమయంబున రాయకుమార బృందంబు,

మధుమతి|| మనము సందడిగా
తనువు ఝల్లనగా
కనులు పండువుగా
వనము కన్పడగాన్.



కం|| సుమఫల కిసలయ శోభిత
మమల సుగంధ పవన మలయ విలాసంబౌ
కమలేందీవర మండిత
రమణీయ తటాకి గాంచి రంజిల్లి మదిన్.

హంస రుతము||

అందైబైన వనిగాంచన్
డెందంబెంతో వికసించన్
అందందెవ్వరును లేమిన్
విందుల్ సేయగను ప్రీతిన్.

ఆ॥వె॥ కత్తి వేటువేయ కలుగక రక్తంబు
పాలిపోయి ముఖము సోలిపోయి
పెదవులు పొడివడుచు విడిబడి తడబడ
పట్టుకొనిరి రాయు పదయుగంబు.

కం॥ పురవర కలవర రవమును
అరుదెంచిన మిత్రబృంద మవనత శిరముల్
పరికించి చూచి రాయుడు
పరిపరి విధముల మనంబు వ్యధతో నిండన్.

కం॥ రాయుడు వచ్చిన జనమున
ప్రియసుతు మిత్రులను చూసి వారిముఖంబుల్
దయనీయ మగుట కనుగొని
నయనంబుల వెదికి ఆత్మనందను కొరకై

వ॥ తన ప్రియపుత్రుని గానక, అనిర్వచిత సంక్షోభంబు మనంబు
నావహింప, వారితో నిట్లనియె. 303

## 16. రాయుడు తన పుత్రునికై విచారించుట.

ఉ॥ చెప్పగబోరు సంగతిని, చిర్రులు పుట్టెను మీ ప్రవర్తనల్
ఎప్పుడు లేనియట్లు పలు కేమియు లేదు, ముఖాంబుజంబులన్
కప్పె విషాదరేఖ లవి కన్న నికృష్ట దురంత మేదియో
చెప్పక చెప్పుచున్నయది, చేతలు దీనిని రూఢిచేయగన్

వ॥ అన విని,

మత్తకోకిల॥

ఏమనంగను పొలుపోవక ఎక్కుచున్ కడుభీతితో
మోము నెత్తక వారు మెల్లగ మూల్గి రాయెడ ఖిన్నులై,
ఈ మహా విధి వైపరీత్యము నీ విపత్తును రాయుడా!
నీ మనమ్మున ధైర్య మూనుచు నిల్వరించుచు నోపుమా.

శా॥ పొంగంబారెడు దుఃఖవీచికలతో పూర్వాపర భ్రాంతితో
కంగారొంచు విషాద భీతి భవ సీత్కారాగ్ని హుంకారులై
అంగాలింగిత ధారుణీ కలితులై, యావేశులై, చెప్పి రే
భంగిన్ మన్య నృపేంద్రు సేన బలికై బంధించెనో పుత్రునిన్.

వసంత తిలకము॥

భూపాలు సేన కడు పూనిక తోడ పుత్రున్
పాపార్థులై బలికి పట్టుట విన్న వెంటన్,
తాపార్తుడై యపుడు తత్తరపాటు తోడన్,
ఏపాటు నాకనుచు ఏడ్చుచు నేల గూలెన్.

ఆ॥వె॥ వెఱ్ఱివానిబోలె వెక్కి వెక్కేడ్చుచు
భార్య గూడి దాను బావు రనుచు
బలికి నా సుతుండె వలసెనా యంచును
కర్మ మంచు నెంచి కరము మోడ్చి. 309

కం॥ కుల దైవంబుల నెల్లర
తలనేలకు మోపి మ్రొక్కి తనువును వణకన్
బలికై కొనిపోయిన తన
కులదీపకు రక్షచేయ కుతిలత కోరెన్.

తే॥గీ॥

రాజ సైన్యంబు చూపిన రాజముద్ర,
కూడి రక్షక భటులతో గుసగుసలును,
బలిమితో తమ మిత్రుని బందిగొనుట,
చూసి బలికని యూహించి చోద్య పడుచు.

సుముఖి॥

భ్రమయగు, కాక పరాచకమా?
గమికొని వీరు గవేషణులై
ప్రమథనకై నరమేధమునన్
సమధికు పట్ట సమంజసమా!

వ॥ అని పరిపరి విధంబుల చింతించుచు, 292

కం॥ రాయని పుత్రుని సైన్యని
కాయము బంధించి వాని కారియపెట్టన్
రాయిడిగని భయమున, వా
రాయన విడిపింపగోరి యడ్డు పడంగన్.

మహా స్రగ్ధర॥

కృతపాపానీకమూర్తుల్ కృపణ ఖచిత సంకేత బీభత్సవక్త్రుల్
అతిభీతాకార దేహుల్ అతుల విలయ ఛాయా కృతాంతాత్మమూర్తుల్,
ప్రతిరోధాసక్తి మిత్రుల్ పరుగున వెనుకన్ రాగ పొండంచు దుర్మా
ర్గత కత్తుల్ దూసి తోయంగ సఖుని దరిజేరన్ ప్రతీకార వాంఛన్,

మ|| వెనువెంటన్ చనుదెంచు బృందమును వే వీక్షించి యొక్కుమ్మడిన్
తనువుల్ క్షోభను చెంద కత్తిపిడులన్ తాడించి మోదించి రా
పెనుభూతంబుల బోలు సైనికులు, ఆ బీభత్స సంవర్తమున్
మనగం జాలక వెన్ను చూపిరి సఖుల్ మారొద్ద నిర్వీర్యులై.

కం|| అకృతాస్త్రులు, బాలురు, ఆ
నికృతపు యోధుల కెదురుగ నిలువ నశక్తిన్,
స్వకృత హత కర్ములగుచు
వికృతముగ వికావికలయి విడివడిరంతన్. 296

వ|| ఆ విధంబున ఆ భండన భీములు తమ స్నేహబంధువును బంధింప, ఆతనిపై గల ప్రేమాభిమాన గౌరవ వాత్సల్యంబుల వాని పొందు వీడనేరక కుందుచు, ముందున కేగి వారి నదుపుచేయు పాటవంబునకు నేరక, ష్టారి నాపు చేయు ప్రయత్నంబు నెరవేరక, తాము ఆ ముష్కరులచే భంజింపబడి, తలకొక మార్గంబై పారి తిరిగి కొంత కాలంబునకు కూడుకొని,

ఉ|| ఏ విధి నీ దురంతకృత మేర్పడ మాన్పగ వచ్చునంచు, ఏ
త్రోవయు తెన్ను తోచక, ప్రతున్నత నేగిరి మల్కపల్లెకున్
తావుల ప్రాణముల్ చెదర తాడిత దుర్నయులై, వివాద సం
భావిత రిక్త కర్మచయ భావుకులై, అసహాయ భీరులై.

ఆ||వె||
ఊరు చేరి వారు, వారి వారిని చీరి
పేరు పేరు నరవ పరువు మరచి
ఊరి పౌరవరులు ఉరికిరి పరుగున
పిరికివారి తీరు దొరగృహంబు.

కం|| వలసిన పండ్లను కుడిచియు
తలమునగన్ స్నానమాడి తమకము తీరన్
అలవోక విశ్రమించిరి
తలపు మఱచి తరునికుంజ తలముల లోనన్. 280

వ|| అంత,

ఉ|| ఆటగ నిట్లుచేతురె ఫలాయుత వృక్షవినాశ మంచు నా
తోటను కాచు సైనికులు దోర్బల మొప్పగ పోటుముట్టులన్
పాటవులై ఎకాయెకిని పట్టిరి ముట్టడి బెట్టి, మిత్రులా
రాటము చెంద, పోరుటకు రాయని పుత్రుడు కత్తిదూయగన్.

వ|| కొంతకాలం బా కుమారుండు మారణాయుధ హస్తులైన కావలి భటులతో పోరాడి తన ప్రతాప ప్రదర్శనచే వారి నాశ్చర్య పరిచినను తుదకు పట్టుబడిపోయె. 283

ఉ|| బాలుడు విక్రమోన్నతుడు బాహు బలాఢ్యుడు నైనగాని, ఆ
భీల కృపాణ నైపుణిని పెంపుగ చూపిన గాని, ఒంటిమై కృతాం
తాలయ దండనాయక నియంతల బోలిన రెడ్డిరాజ్య భూ
పాల నియోగ యోధ పరివారము ముందట గెల్వనేర్చునే.

## 15. రాయ పుత్రుడు బందీయగుట.

వ|| అంతలోన ఆప్రాంతంబున గ్రుమ్మరుచున్న మన్యకోట సేనాధ్యక్షుండు పంపిన యోధబృందంబు బలికై బాలుని వెదుకుచు అచటి కరుదెంచి,

సీ|| పండ్లను తెంచిన బాలుర గమనించి
క్షుధార్తితో వారు కుక్షి నిండ
తినుటయు, జలకంబు తెరువులు తిలకించి
తరుకుంజముల చెంత తనువు లొంప
కావలి సైన్యంబు కట్టడి పెట్టగా
ఒంటిమై వారిని నోర్వ నేర్చి
నట్టి బాలుని పోటు, నతని విలాసంబు
పొదల మాటున నుండి పొంచి చూచి
తే||గీ|| బలికి తెమ్మని పంపిన ప్రభువు నాజ్ఞ
తీరు నంచును కర్కశ ధీర భటులు
బందియై యున్న బాలుని పక్క చేరి
తేరి పరికించి యోజించి తీర్పు మీర. 286

అక్కర|| ఈతడె దొర చెప్పినట్టు లందాల యిందువదనుడు
అతిబలవంతుడు నరిభయంకరు డౌదార్యపరుడు
చతురుడు పదియారు వర్షముల వాడు సద్వంశభవుడు
పతి సంతసించు నీ బాలుని మనము పట్టితి మేని

చ|| అని తలపోసి రాజభటు లార్భటి కావలి వారి తోడ, ఏ
పనికని మన్యభూమి నరపాలుడు తమ్మిట పంపెనో యెరుం
గ నుడివి, రాజముద్ర గల ఖత్తును జూపుచు రాయ బాలునిన్
కనికర మేమి లేక బలికై వెస పట్టిరి హుంకరించుచున్.

వ|| అంత రాయ పుత్రుని స్నేహ బృందంబు,

వ॥ ఇట్లనేక ప్రకారంబులు పుత్రవియోగంబునకు మనంబున క్రుంగుచు, ప్రకాశంబుగా నిట్లనియె. 311

ద్వ్యక్షర ప్రాసయుక్త చ॥
సురతుడు రూపవంతుడు యశోగుణగణ్యుడు వేదవేద్య భూ
సుర వరభక్తి తత్పరుడు, శూరుడు, మత్కుల వర్ధనుండు, భా
సుర శివపాద పద్మయుగ శోభిత శీర్షుడు, ఆశ్రితాళికిన్
సురగవి సన్నిభుండు, పరిశుద్ధ మనస్కుడు పుత్రుడేమగున్.

ఉ॥ ఆతని వీడి నేనెపుడు అర్ధనిమేషమునైన హాయిమై
భూతతతి సాక్షిగా బ్రతుక బోదునె, వ్యర్థము జీవితమ్మ నే
నీ తరి ఎందు బోయెదను, ఎవ్వరి చీరుదు కావు మంచు ఈ
యాతన తీర్చుచున్ బలి నియంత్రణ చేసి కుమారు బ్రోవగన్.

వ॥ అని పదంపడి, నిరాశాజనిత రోష కుటిలత్వంబులు మనంబును పొరిగొన, మంజిష్ఠామండిత కేసర ద్వయ శోభిత ధవళ సూనంబు పగిది, రక్తారుణ నయన యుగళ ప్రకాశిత వివర్ణ వదనుండై గంభీరంబుగా నిట్లనియె

సీ॥ సైన్యంబు సమకూర్చి సమరంబు చేయుదు
రెడ్డి సైన్యాధ్యక్షు రిమ్మ దింతు,
కాకతీయ ప్రభ కూకటి వ్రేళ్ళతో
పెకలించి వేతును పెంపు మీర,
జనులందరను జేర్చి చక్రవర్తికి మ్రొక్కి
బలి కార్యక్రమమును భంగపరతు,
కోటరక్షకు కూడి కోటిరూకల నిచ్చి
కొడుకును విడిపింతు నొడుపు తోడ,

తే॥గీ॥ దొడ్డిదారిని బోవుదు దోహలించి
ఎవరు కనకుండ బాలుని ఎత్తుకొత్తు
ననెడి అవివేక వాక్యంబు లాలకించి
అచట ప్రోగైన పురవృద్ధు లనిరి యిట్లు.

శా॥ వీరత్వంబున కాదు కర్జ్య మిపుడీ పీరప్రలాపంబులన్
తీరంబోవదు ఎంచి చూడగను ఏ తీరున్ బలాధిక్యులౌ
వారిం బోరగరాదు, దుర్గమును ఏ వావిన్ ప్రవేశించి ఆ
కారాగారము చేరలేము మరి ఓ గమ్యంబు కన్పట్టెడిన్

ఉ॥ మానిత పూజ్యుడున్ మహితమంత్ర సమర్ధుడు తత్త్వవేత్త స
మ్మానిత వేదవేద్యు డురుమంగళ రూపవిశేషణుండు ఆ
జానుకరావలంబుడు విసర్జిత రక్షణ పక్షపాతియౌ
మౌనివరేణ్యు వేముకుల మండను నీ గురు వర్యు వేడుమా.

ఉ॥ ఆతడె యొప్పెనా జలధి నైనను దాటగవచ్చు, దేవతల్
ప్రీతిగ ఇత్తురయ్య సురశృంగిణి, మెచ్చి ఉమామహేశులున్
ఆతత పుణ్యలోకముల నంచిత వాసము కూర్తు రింక నీ
వీ తతి క్రుంగబోకుము, మునీశ్వరు పాదము పట్టుకొమ్మికన్.

## 17. రాయుడు వేము మునిని తన పుత్రుని రక్షింపుమని ప్రార్థించుట.

కం॥ అమ్మాటలు విని రాయుడు
సమ్మోదము తోడ గుముని సన్నిధి కేగెన్,
అమ్మా యనుచును నాతం
కొమ్మప్పుడు భద్రకాళి కొలువగ వెడలెన్. 318

వ|| ఆ విధంబున రాయుడు తన సన్నిహితులతోడను, రాయ కుమార మిత్రవర్గంబు తోడను మునిజనాశ్రమంబు చేరి అందు గురుస్థానంబున,

తే||గీ||
ప్రౌఢి పద్మాసనస్థుడై గాఢముద్ర
కన్ను లరమోడ్చి నిష్టతో కాలకంరు
ఆత్మ సందర్శన సుఖంబు ననుభవించు
స్వామిదేవుని గాంచి విశ్వాసమొప్ప. 320

ఆ||వె||
యోగ దీక్షనుండి ఓజతోడ భువికి
వచ్చునంత దనుక వద్దనుండి
స్వామి ఘనత తలచి స్వాంతంబునందున
ప్రక్క చేరి మ్రొక్కి పదము పట్టి.

చ|| చిరునగవుల్ ముఖంబున నశేష కృపారస హర్షభావముల్
వరలెడి కన్నులున్ మహిత వైదికయోగ నియోగ తేజమున్
సురవర సన్నిభంబయిన శోభిత సుందర దేహసంపదల్
ఉరమున మంత్రకల్ప కృతు లూర్జిత భూరి విభూతిరేఖలున్.

కం|| రాయుడు పదముల బడి
భయ విహ్వాల మానసుడై ప్రార్దన సేయన్
భయపడవల దంచును, ప్రతి
భ యతీంద్రుడు వాని హృదయ భారము మాన్పెన్

వ|| అంత నా రాయవరుండు, ఆశ్రమ ప్రవేశానంతర పరిసర వాతావరణ ప్రభావంబున కొంత శాంతచిత్తుండయి, తదుపరి బ్రాహ్మణోత్తముని అభయప్రదానంబున నిర్మూలితోద్విగ్నుం డైనను, కుమార వియోగంబున తడబడుచు,

గజ విలసితము||

స్వామిని చేరి మ్రొక్కి సవినయముగ పలికెన్
ధామనిధిప్రకాశ ! తనయుని బలికని, మా
ప్రేమ కుమారు పట్టె పెలుచన దళపతి! స్వా
మీ! మును వింటి వాని హితులు తెలుప, నిపుడే. 325

చంద్రకళ||

పుత్రు డొక్కడె మాకు, ప్రఫుల్లాంభోజ ముఖుండు, శుభుండు, ఏ
మాత్రమున్ నను వీడక కొల్చున్, మా కులదీపకు డాతడే,
మిత్రు లందరి చేకొనిపోయెన్ మించు విహార మనస్కుడై
యాత్రకున్, ప్రభు సైన్యనికాయం బాతని పట్టె హుటాహుటిన్

వ|| దేవా! మన మన్యమున నున్న కోట నేలు సేనాధ్యక్షుండు సర్వస్వతంత్రుండై, చక్రవర్తిని సరకు గొనక, ఈ ప్రాంతంబున తన అధికారంబు అప్రతిహతంబుగా చలాయించుచున్న విషయము మన కందరకు విదితమే కదా! తామస ప్రవర్తుండైన ఆ దుర్మార్గుడు అతి స్వార్థుండై, అమానుషంబును, కేవల నింద్యంబును, అనార్యంబును, నీతిబాహ్యంబునునైన జీవహింసలతో, జంతుహత్యలతో క్షుద్రశక్తుల నారాధించు చున్నట్లు వినికిడి. ఈ మధ్య ఆ దురాత్ముండు నరమేధము నారంభించి, బలి యిచ్చుట కొకబాలుని వెదుకు చున్నట్లు

కర్ణాకర్ణిగ తెలియ వచ్చు చున్నది. అది అట్లుండ, మన కుమారుడు మిత్రులతో గూడి మన్యకాననంబున నున్న రాజోద్యాన వనంబును నేరక ప్రవేశింప, ఆ బృందంబున నున్న కొందరు క్షుధార్తులై అచ్చటి వృక్షంబుల నున్న ఫలంబుల నారగించి రన్న చిన్న తప్పిదంబునకు, వనరక్షకులు కుమార సహిత బృందంబును బంధించుట సబబైనను, ఆ సమయంబున రాజసైన్యంబులు ప్రవేశించి, తోట కావలి వారిని త్రోసిపుచ్చి, యువక బృందంబును విడిపించి, ఒక్క కుమారునే స్వాధీనము చేసుకొని బంధించి తమవెంట మన్యకోట మార్గంబున తరలించుట చూడ ననుమానాస్పదముగ నున్నది. కుమారుడు నవయౌవనుడు. పదియారు వర్షములవాడు. సర్వాంగసౌష్ఠవుడు. సద్వంశ జాతుడు. పరాక్రముడు. శాక్తేయ ప్రోక్తంబైన నరమేధార్ధము మానవ బలి పశువునకు వలసిన అర్హత లన్నియు కలవాడు. అందువలన కుమారుని సైన్యంబు తప్పక నరబలికై గొని పోయిరని వాని మిత్రులును, మా పురప్రజలును అనుమానించుచున్నారు. మా కర్మ మెట్లున్నదో!

ఉ|| ఏమి విషాద కర్మ! సుతు డేటికి పోయె విహారయాత్ర! అం
దేమి సుఖంబటంచు నత డేగెనొ కంటక కాననమ్ము! అం
దేమగు దుష్కృతమ్మొ బలి కీతని సైన్యము బంది చేసె! ముం
దేమగునో కుమారునకు నేతరి ముష్కర దుష్ట దైత్యుచే!

శా|| నిమ్నున్ నమ్మితి నేని, నేనెపుడు దుర్నీతుండ కాకున్నచో,
పున్నెంబుల్ ధర ధర్మమంచు సుమనఃపూరంబుగా చేసినన్,
మన్నింపందగు నన్ను నా సుతుని వే మాన్పించి యీహత్య, ఆ
పన్నున్ గావుము వేమువంశ తరణీ! బాధార్తి చింతామణీ!

సీ॥ మంత్రంబు వేయుదో, తంత్రంబు చేయుదో,
ప్రభువు నాజ్ఞాపించి ప్రశ్నసేతొ,
వేదంబు వల్లింతొ, విధులు నిర్వర్తింతొ,
వేదాంత మార్గంబు విశదపరతొ,
ధవుని ప్రార్థింతొ, మాధవుని మొరలిడిదొ,
వాణి వేడెదొ, శార్వాణి కొలుతొ,
దానంబు చేయుదో, దండంబు వాడెదో,
భేదంబు పాటింతొ, బెగ్గలెంతొ,
తే॥గీ॥ లక్ష్మి నర్థించి చేతువో లక్ష్యసిద్ధి,
చక్రవర్తికి చెప్పి నవక్రగతిని
పుత్రు విడిపించి యీ తండ్రి బొంది నిలుపు
ఏది యుచితంబొ నద్దాని నెన్నుకొనుచు.

వ॥ అని విన్నవించి యూరకుండిన తదుపరి రాయ కుమార
సఖులలో నొక్కరుండు బ్రాహ్మణునితో నీ విధి వివరించె.

తే॥గీ॥ సఖుడు, తమ బృంద మెట్లు వేసారి తిరిగి
రో, వనము నందు వారెట్లు రుద్ధులైరో,
ప్రభువు సైన్యంబు సఖునెట్లు పట్టుకొనిరో,
పూని ఆతండు వారితో పోరెనెట్లొ

తే॥గీ॥ వారి మాటలు చేష్టలు వక్రదృష్టి
బాలు బలి కని సైన్యంబు పట్టినట్లు,
తాము తెలుసుకొనిన తీరు దాఖలాలు
తగిన వివరణల తెలిపి తత్తరముగ.

ఉ|| కావలి వారు సైనికులు గాఢ వివాదపు భాషణంబులన్,
భూవరు రాజ్యభాగ పరిపోషణ చేయగ కట్టినట్టి యా
స్థావర మేలు యోధవరు సంతక మూనిన చీట్లు చూపి, వా
రావిధి మిత్రు బట్టు, బలి కొనని రూఢిగ తోచె భూసురా.

కం|| మిత్రుని విడువుం డంచును
నాత్రముగా మేము జీర, ఆ సైన్యం బే
మాత్రము సరకు గొనక నతి
చిత్రముగా కొట్టిరయ్య చిత్తుగ మమ్మున్. 335

కమలనగీతి||
ఆ విధమున చిత్రహింస లవనినాథు భటులు,
కావలున్న తోటవారు కలసి మమ్ము పెట్ట
చావు తప్పి కన్ను లొట్టు సంతరించినట్లు
వావి వరస లేక నురికి వస్తిమయ్య యిటకు.

వ|| అని తెలిపిన తదుపరి, రాయునితో నేతెంచిన పౌరవరులు గూడ అనేక విధంబుల బ్రాహ్మణోత్తముని బాలుని రక్షింప వేడుకొనిన.

అశ్వపిలసితము||
కరము మొగిడ్చి వారలు విషాదగాథ ననుకంపతో తెలుపగా
ధరణీ సురేంద్రు చక్షులు దయార్ద్ర తన్మయత వంత భావములతో
మెరిసె. వినూత్న కాంతులు జనించి మించె వదనమ్ము, ఆశ్రమములో
పరిసర మంత శాంతము వహించె, భక్తి పరిపూర్ణ మయ్యె నపుడున్.

ఉత్సాహము॥
కాంచిరి సభికులు మునివరు కన్నుల కనికరముతో
మించు వింత శాంతి మిసిమి మీటు కాంతి సంపదల్
ఎంచి చూడ యోగ దృష్టి నింతలోన బాలకున్
కాంచె మౌని యంచు వారు కౌతుకంబు నొందగన్.

వ॥ ఆ సమయంబున,

ఉ॥ ఇంచుక సేపు భూమిసురు డీశ్వరపాద నివేదితాత్మ రా
గాంచిత భావవేగ పులకాంకిత దేహ నిమీలితాక్షుడై
మించిన దివ్య యోగమున మిత్రుడు రాయుని పుత్రు పూర్వ జ
న్మాంచిత పాపకర్మముల నంతము చేయగ సత్వరంబుగన్.

## 18. వేము ముని మన్య ప్రయాణము.

కం॥ పిలిపించి శిష్యుల పలికె
నలమట పడ నెందుల కిక, ఆ బలి నాపన్
అల కానన దుర్గమునకు
వలయును కదలగ విచిత్ర వాహ్యము తోడన్.

కం॥ ఆయువు కలదాతనికిన్
ఆయిత పడినాడ పోవ నా శివునాజ్ఞన్
పోయెద నిపుడే తగిన యు
పాయముతో రాయసుతు నపాయము బాపన్.

వ॥ అని వాక్రుచ్చుచు, ఆ క్షణమే బయలుదేరి వెడలుచున్న ఆర్తత్రాణ పరాయణుని వెంటనంటి,

శా।। గ్రామంబంతయు చేరి విప్రవరునిన్ గాంభీర్య మూర్ధన్యునిన్
సేమంబంచును మ్రొక్కగా కదిలె నా శ్రీకంఠ సేవాంకిత
స్థోముండంతట మంత్ర తంత్ర విధి మాత్రుండై, కుఠారంబుతో
రాముండొంటిగ కార్తవీర్యు ననిబోరం బోవునట్లొప్పుచున్.

ప్రయాణి।।
కమండలూర్ధ్వ దండమున్
ప్రమోద మందహాసమున్
సమంత్ర కాంతి దేహమున్
అమంద యాన వేగుడౌ
చు మౌని ఊరు వీడగా
నమో నమో యతీశ్వరా
నమో నమో మునీశ్వరా
నమో నమో దయాపరా
నమో కృపాపరాయటం
చు ముక్త కంఠ యుక్తులై
క్రమంబునన్ పుర ప్రజల్
నమస్కరించి రయ్యెడన్.

చ।। అనుపమ దివ్యశక్తి మహిమాన్వితుడైన యతీంద్రుడంతటన్
మనసును మించు వేగమున మబ్బు పయిన్ పయనించెనో యనన్
పనిబడి పోయి చేరె జనపాలుని సైనిక భద్ర వాటికన్
ఘనభుజ రాఘవేంద్ర పరికల్పిత శస్త్రవిశేషమో యనన్.

ఉ॥ ద్వారము చేరి భూసురుడు వావిగ దుర్గము చేరబోవ దు
ర్వార పరాక్రమ ప్రముఖ రాజభటుల్ చనికాంచి రంత గం
భీర శరీర భారు నురువీర సమీర కుమార సుందరా
కారు విభూతిధారు నవకాంతి సముజ్వల తారహారునిన్.

ఆ॥వె॥
వాని చేరి వారు వారింప దరిబోయి
తేరి చూచి వాని తీరు చూచి
వదన కాంతికళల హృదయంబు పులకింప
మనము తల్లడిల్లి ౖమాను పడగ. 349

సీ॥ దండంబు ధరియించి దర్పించె నీతండు
దండధరుం డేమొ దారిలేదొ!
ఒడలెల్ల వీబూది వెలయించె నీతండు
మదనుని మసిచేయు మదహరుండొ!
ఆజానుబాహుండు అతిభారకాయుండు
విశ్వరూపుండా త్రివిక్రముండొ!
బ్రహ్మజ్ఞతేజుండు బ్రాహ్మణ రూపుండు
బ్రహ్మాండకర్తయౌ బ్రహ్మకాడొ!
తే॥గీ॥ ఉన్నపాటున నీయెడ నుద్భవించె
భక్త వత్సలుండౌ దత్తవర్ధనుండొ!
మనల కరుణింప వచ్చిన మౌని వరుడొ!
ఇతని చూడంగ మ్రొక్కగా నిష్ట మయ్యె.

*విశ్వదేవి॥

ఉద్యఃస్ఫూర్తిన్ వెల్గున్ నరోద్ధుండు, వీడో
విద్యా విఖ్యాతుండో గవేషుండు కాడో,
సద్యఃకర్మండౌనో విచారింప, ఈడీ
చోద్యంబెంతో వింతౌను, చోక్షంబు చూడన్. 351

చ॥ అని మనమందు నెంచి వసుధామరు భక్తి నమస్కరించి యా
నవముల భ్రాంతి తోప మునినాథుని వేడిరి ఆజ్ఞసేయ, ఆ
మునివరు డంత మీ ప్రభుని ముందుకు తోడ్కొని యేగుడాతడున్
కనివిననట్టి ఓ ప్రముఖ కార్యము చేయుటెరింగి వచ్చితిన్.

వ॥ అని ఆనతిచ్చిన, ఆ మాటలు భటుల కానందంబు చేకూర్చ, వారు

కం॥ ఓ క్షణ మోపుండంచును
దీక్షితు కూర్చుండ బెట్టి దీవెన గొనుచున్,
తక్షణ మేగిరి సేనా
ధ్యక్షుని కొలువుకు మనంబు తత్తర పడగన్. 354

వ॥ వెడలి వివిధోద్యోగ భట భృత్యాది పరిచారికా సమావృతుండై సభా మండపాంతర సింహాసనారూఢుండైన దళవాయిం గాంచి ద్వారపాలకు లిట్లనిరి.

ఉ॥ నేడొక వింతయయ్యె ధరణీవర! ఏయెడ చూడనట్టి ఓ
ప్రోఢ మనీషి దుర్గ ముఖ పూర్వ వనంబున చేరి నిల్చె, మే
మోడక వాని చూడ నధికోజ్జ్వల తేజము కన్ను గప్పె, కా
పాడు మటంచు మేమతని పాదములంటితి మాజ్ఞ సేయగా.

*పద్మస్వామిలా గర్భిత విశ్వదేవి వివరణ-2 చూడుడు.

ఉ॥ మానవు డౌనొ కాదొ, స్థిరమండిత రూపుడు బ్రహ్మతేజుడున్,
ఆ నలువా, శివుండ, త్రిదివాధిపుడా, హరియా, బృహస్పతా,
మానవు డయ్యెనా మహిత మౌని వరుండగు, విశ్వవేదునిన్
మానస మందు నిల్పె నని మామది తోచుచునుండె భూవరా.

కం॥ అతడును గంభీర ధ్వని
యుతముగ మీ ప్రభుని జూడ నుత్సుకతన్నన్
అతిశయమును దిగనాడుచు
అతిరయమున వచ్చినార మనుమతి నడుగన్. 358

కం॥ వేంచేసి ముఖ్యకార్యము
కాంచగ పని యయ్యె నంచు కబురంపె ప్రభూ !
చంచత్తనురూపధరుడు
పంచాగ్ని సమప్రభ వర పంచాననుడున్.

తే॥గీ॥ భటుల మాటలు విన్న ఆ ప్రభువరుండు
మనము సందేహ భావాన మథన పడగ
వచ్చినాతడు ఒక దొడ్డ వాడటంచు
ఊహ చేయుచు తలపు లుద్రూత లూగ

వ॥ మనంబున ఇట్లని వితర్కించె

శా॥ చోద్యంబయ్యెడు కోటలో నితరులన్ చూపోప మేనాటికిన్
ఆద్యంతంబును లేని యీ విపిన ఘోరారణ్య దేశంబునన్
ముద్యోగంబున గాని, గూఢచరులన్ మాయించ కెవ్వారలున్
ఊహో[illegible]ంచరు కాలిడన్, ఎటుల ఈ ఉద్దండు డేతెంచెనో?

ఉ॥ మానవుడైన ఏకతమ మన్యము జొచ్చునె, చొచ్చునేని ఈ
కానన భూమి భీకర మృగంబుల చిక్కడె, చిక్కకున్న ఈ
కోనకు వచ్చి ధైర్యమున కోట ముఖమ్మున నన్ను కోరునే,
మానస మందు నాకతని మమ్మెర చూడగ వేడుకయ్యెడిన్.

వ॥ అదియునుంగాక, 364

కం॥ ఘనమగు రహస్య మఖమును
పనిబడి యొనరించు చుంటి ప్రతినిశ యందున్
మునికొని పూర్ణాహుతి బలి
మునిమాపున నర్ధరాత్రి మూర్తంబు గదే.

కం॥ ఈ విషయం బాగంతుకు
డే విధి నెరిగెను, మహామహితుడు భవిష్యత్
భావుకు డీతం డేపని
కై విచ్చేసెనొ, తెలియగ నాసక్తయ్యెన్.

కం॥ అని తలపోసి భటులతో
ననియె నపుడు, ఘనభుజవరు నాతని వేగన్
కొనితెండని, వారలు ప్రీ
తిని చేకొని వచ్చి రతిథి తీరున విప్రున్.

వ॥ అట్లేతెంచిన గంభీర సుందరాకారుని,

శా॥ అక్షయ్యంబుగ కాంచె బ్రాహ్మణుని వాడాశ్చర్య సంక్షోభుడై
అక్షోణీసురు వీక్షణాక్షణ కటాక్షాప్యాయ దాక్షిణ్యతన్
అక్షీణంబగు క్షాంతి గల్గె మనమందా క్షత్రియ స్వామికిన్,
సాక్షాత్కారము నయ్యె నా క్షణమునన్ సంతృప్తి చక్షుద్వయిన్

తే॥గీ॥ అంత సంతోష సంభ్రమ స్వాంతుడగుచు
గద్దె దిగివచ్చి పైనున్న కండువాను
స్వామిదేవుని పాదాల వద్ద పరచి
ప్రక్క దరిచేరి పదములు పట్టి మ్రొక్కి.

వ॥ ఇట్లని వాక్రుచ్చె.

ఉ॥ ఎవ్వరు మీరు స్వామి, ఇట కేవిధి నెక్కడ నుంగి రాక, ముం
దెవ్వరు ధైర్యమూని వన మీతరి దూరి చరింపబోరు, మీ
రెవ్వరో గాని మా పయి నహీన కృపాసుధ వెల్వరించుచున్
దవ్వుల నుండి వచ్చితిరి ధన్యుల మైతిమి మీ కతంబునన్.

త్ర్యక్షర ప్రాస కం॥
ఏ కతమున నరుదెంచితి
రేకతమ, మహా విశేష మియ్యది చూడన్
మాకు తమ రాక శుభమను
నాకూతము మనమునందు నాకలనయ్యెన్.

కం॥ అని పరిపరి విధముల ప్రా
ర్థనలన్ తను వేడినట్టి దళవాయిని ఆ
మునివరుడు చేరి యిట్లను
ఘనరవ సౌహార్ద భావ కమనీయుండై. 374

ఉ॥ స్వస్తి ! విశాల రాజ్య వరవైభవ రెడ్డినృపాల భూరమా
విస్తరణ ప్రయోక్త ! పరివేష్టిత భూభుజ రక్షణక్రియా
హస్త ! ప్రగల్భ భూవర సహస్ర కిరీట విశిష్ట రత్న పా
త స్తవనీయ ! పాశుపత తంత్ర కుతూహల ! స్వస్తి ఏకగున్

మాలిని॥ అనుపమ గుణశీలా ఆర్త రక్షా పవిత్రా
వినుత సమర శాలీ వీరశైవాత్మరంగా
ఘనతర హృదయాత్మా క్షాత్ర ధర్మజ్ఞ మూర్తీ
అనుపమ మఖ సాధ్యా అంబికామూర్తి భక్తా.

వ॥ అని దీవించి మరియు నిట్లనియె.

శా॥ ఏ నెవ్వండనొ గోత్ర నామము లవేవేవో మహారణ్యమున్
నేనొక్కండెటు దాటితో యనుచు ప్రశ్నింపంగ అప్రస్తుతం
బౌ, నేనోద్విజుడన్ దివౌకసుల ప్రీత్యర్థంబుగా యజ్ఞమున్
సేనానీవర నీవుచేయ విని నా చేయూత నీవచ్చితిన్.

కం॥ మంత్రంబులు, స్వంతంబుగ
యంత్రంబులు, యజ్ఞపురుషు నామంత్రణముల్
తంత్రంబులు చేయంగ ని
మంత్రితుడ, నను నియమించు మఖమును నడపన్.

కం॥ అత్యాదర ప్రీతి మెయిన్
కాత్యాయిని పంపె నన్ను కారుణ్యముతో
నిత్యా నిత్య విచారణ
వ్యత్యాసము తోడ సల్పు వత్సా క్రతువున్.

380

# 19. సామంతుడు వేము మునిని చండీ యాగమునకు యజ్వకునిగా నియమించుట.

శా|| ఈ మాటల్ విని కాకతీయ వరుడెంతేనిన్ ముదంబందుచున్
ఆ మౌనీశ్వరు నర్ఘ్యపాద్యములతో నర్చించి, తానిట్లనెన్
సామాన్యంబె భవత్కృపావిభవ మీ సామంతుపై చూపుటల్
ఏమీ భాగ్యము నేడు నే వెదుక బోయే తీగ లభ్యంబయెన్.

శా|| ఓ మాసంబున నుండి నేను పరవిద్యోత్కృష్ట శాక్తేయమౌ
శ్రీమాహేశ్వరి యాగ మొండు నిశలన్ చిత్తంబునన్ నిష్ఠతో
కామోద్రేక నిషిద్ధ బద్ధ మతినై కాపాలికా పద్ధతిన్
సామంత్రంబుగ దక్షిణాభిముఖి సంస్థాపించి సేవించితిన్.

ఉ|| ఆహవనంబు నేడు, నిశయందు ముహూర్తము, హవ్యవాహు నా
వాహన చేసి హోమమున వాసిగ వేల్వ నరణ్య మందు మా
రాహుతు లెంచి తెచ్చి రొక రమ్య విశిష్ట గుణావతంసునిన్
బాహు సమగ్ర విక్రముని బాలుని ధీరుని ప్రీతి పాత్రునిన్.

కం|| బీభత్స వీర రౌద్ర
ప్రాభావిత వాద్య నాట్య పారీణవరుల్
ఆ భైరవి మెప్పింతురు
వైభవముగ బలి సమయ వివర్తన తోడన్.

వ|| స్వామీ! తమ రాక మా కెంతయో ముదంబు చేకూర్చు చున్నది. నే నీ రాత్రి జరుపబోవు చండీయాగ నరమేధా కార్యక్రమ పూర్ణాహుతికై తగిన వేదవిదుండును, ఆర్య సంప్రదాయ కర్మిష్ఠుండునగు ఋత్విజుండు లేక తల్లడిల్లు సమయంబున మీ రరుదెంచి మమ్మ నుగ్రహించినారు.

శా|| విద్వత్ శ్రేష్ఠుడు మంత్ర తంత్ర విధి సంవేద్యుండు శ్రీతేజుడున్
సద్వంశుండు మహా విభూతిపరుడౌ సద్బ్రాహ్మణుండీ యెడన్
మద్వృత్తాంత మెరింగి నా క్రతువు బ్రహ్మత్వంబు చేపట్టగా
శ్రీ ద్వైపాయన మౌని వీక్షిత పరీక్షిత్ పుత్రు యజ్ఞంబయెన్.

కం|| అత్యాశ్చర్యం బా భగ
వత్యంత్రాంగం బనూహ్య వాత్సల్యమునన్
అత్యాదర కృప తోడన్
కాత్యాయిని పంపె మిమ్ము క్రతువును నడపన్.

ఉ|| చేకొనుడీ మఖంబు, శివుచెంచెత ఆనను, ఋత్విజత్వమున్
పైకొని, మంత్రతంత్రముల భైరవ భూతబలంబు హవ్యముల్
గైకొని మ్రింగి మాకు చిరకాలము సేవకులై చరింప, అ
స్తోక మహత్వ సిద్ధులను దుర్గయు చెచ్చెర నిచ్చి మెచ్చగన్

కం|| బలికై తెచ్చిన బాలుని
అలికిడి గాకుండ దునిమి ఆతని శిరమున్
మొల పైన గ్రుచ్చి హోమా
నలమున వేల్చుడు కపాల నాట్య ప్రభలన్ 389

వ| అంత మునివరుండు,

ఉ॥ ఆ విధి దుర్గపాలుని భయానక సూచన లాలకించి, యే
దో విధమౌ జుగుప్స మది నూదగ, ఈ నరరూప రాక్షస
ప్రావృషజమ్ము పాపముల పంకము నుండి విముక్తి బొందగా
త్రోవను జూపు నిశ్చయము రూపము దిద్దగ మానసమ్మునన్.

చ॥ ఇది సమయంబు గాదు, తన యీప్సిత సిద్ధి ఘటించునంత ఓ
అదనును చూసి భూవరున కాత్మవివేకము గల్గు పద్ధతిన్
సదమల కర్మయోగమును శాశ్వత మోక్షము నొందు మార్గమున్
పదిలముగా వచింతు నని ప్రస్తుత మోపికపట్టి యిట్లనున్.

కం॥ జన్నము నే జరిపించెద
నెన్నగ చింతేల నయ్య నే విధినైనన్
ఎన్నడు ఏ యెడ చూడని
తెన్నున, నీ వాంఛ లెల్ల తీరగ తృటిలో. 393

వ॥ అది అట్లుండ,

ఉ॥ ఆహ్నిక మాచరింపవలె అర్ఘ్యము లర్పణ చేసి, చండ మ
ధ్యాహ్న మహేశ్వరున్ కొలువ యాప్యము లేకిక సత్వరంబుగా
జాహ్నవిలో మునింగి గృహ చైత్యము నందు విశిష్ట నిష్ఠతో
వహ్నిని కొల్చెదన్, తగు నుపాసన లేర్పడ చేయుమా యికన్.

వ॥ అన్నంత, మఖ సంపూర్ణ కుతూహల మనస్కుండైన మహీపాల సామంతుండు సభ చాలించి, తగువారిని బ్రాహ్మణోత్తమునకు అతిథి సత్కారంబులు అనుష్ఠానాది సౌకర్యంబులు కల్పింప నియోగించి, కార్యాచరణ రణ మారణ బలిదాన కార్యక్రమోల్లాస నిజాంతఃకరణులు, ప్రభుభక్తి పరాయణులు,

స్వామి చరణారవింద వందనాచరణములునైన బహుముఖ ప్రజ్ఞాశీల వీరవరులను రావించి, అరుణాస్తమయ సమయంబు సమీపింపక మున్న నాటి రాత్రి జరుగ బోవు క్రతుహోమబలి కార్యావసర సంభారంబులు సమాయత్త పరుప నాజ్ఞాపించిన,

శా॥ ఇద్ధ ప్రజ్ఞులు, బాహువీర్యులు, నృపాలేశేచ్ఛ నిర్యంత్రణా
సిద్ధుల్ శాత్రవరాజ రాజ్యరమణీ శృంగార పాదాంకితుల్
యుద్ధ ప్రీతులు, శ్రద్ధతో వివిధ యజ్ఞోపాంగ సామాగ్రి సం
సిద్ధింజేసిరి, అంతలో రవి ప్రతీచీ దిక్కునన్ గ్రుంకగా.

మ॥ బలి కృత్యంబును చూడనోడి కరుణా భావాంతరంగంబుతో
తొలగెన్ భూమిని కర్మసాక్షి ఎరుపై తోపొచు వైవర్ణ్యుడై,
కలువల్ రేడు కృశించి క్రుంగి కుఱచై కన్మూసి కనప్పట్టడున్
ఇల వ్యాపించెను దట్టమై యిరులు నింతింతై దిశల్ నిండుచున్.

వ॥ ఆ సమయంబున,

తే॥గీ॥ రాజసౌధంపు దక్షిణ ప్రాంగణాన
రచన చేసిన బంగరు రమ్య వేది
రంగవల్లులు దిద్దిరి రమణి మణులు
తోరణంబులు కట్టి రుద్భూత తతులు.

తే॥గీ॥ మధ్య భాగంబున యజన మండపంబు
చుట్టు నాహ్వానితాసన సుమ సదంబు
కాంతి పుంజాల వెలయించు కాగడాలు
అంతరంగాన ప్రభుని సింహాసనంబు.

సీ॥ ఒకచోట సామంతు లొకచోట నుద్యోగు
లొకచోట పౌరుల ఓలగములు
ఒకచోట భృత్యులు నొకచోట భట్రాజు
లొకచోట నుద్దండ యోధ తతులు
ఒకచోట గణికులు నొకచోట నర్తకు
లొకచోట వాద్య నాట్యోత్సవమ్ము
ఒకచోట తంత్ర మంత్రోద్యోగ తండంబు
లొకచోట ఆభోగ యోగి చయము
తే॥గీ॥ మేక లెనుములు కుక్కుట మేళనమ్ము
బలికి సిద్ధంబుగా నొక ప్రక్క నిలువ,
భూత భేతాళ భైరవ భూతి కొరకు
చేయు శాక్తేయ యజ్ఞంబు సిద్ధమయ్యె. 402

ఆ॥వె॥ అర్ధరాత్రి సమయ మాసన్నమైనంత
చేత మంత్రజలము సేకరించి
దీక్ష బూని రక్ష తీపార ధరియించి
కాకతీయ వరుడు కదలి వచ్చె.

తే॥గీ॥ ప్రభువు వచ్చిన వెంటనే ప్రాంగణమ్ము
శ్రద్ధ తోడను నిశ్శబ్ద బద్ధ మయ్యె,
సభను కలయంగ జూచి ఆసనము దాల్చి
యజన ప్రారంభ మొనరింప నవని వరుడు.

శా॥ విప్రశ్రేష్ఠునితో ననెన్ క్రతువు నిర్విఘ్నంబుగా మంత్ర తం
త్రప్రోక్తంబుగ శాస్త్ర పద్ధతిని నిర్వర్తించి నా కోరికల్
నీ ప్రాభావిత భూతవర్గ తతిచే నేర్పొప్ప తీర్పింపుమో
సుప్రాశస్త్య ధరామరా ! బుధవరా ! శోభాకరా ! భాస్కరా !

వ॥ అని ప్రార్థించి, మరియును ఇట్లనియె.

శా॥ మున్నెంనన్నండును ఎవ్వరున్ విననిదీ మోటైన యాగంబు, నా
పున్నెంబొప్ప కపర్దికాంత కృపచే బోయన్ ననున్ బ్రోవగా
మిన్నున్ మన్నున కానబోవని మహా మేధావియౌ మంత్ర సం
పన్నుండొచ్చెను కార్య భారము వహింపన్ నా యదృష్టంబునన్.

కం॥ నీ చాతురిచే ఈ క్రతు
వా చంద్రార్కముగ నిల్చు నారాధ్యంబై
నా చరితము విని 'మనసా
వాచా' మెచ్చి పొగడంగ భావి తరంబుల్. 408

వ॥ అని విన్నవించి, యజ్ఞ ప్రారంభంబు చేయ నాన తిచ్చిన,
ఋత్విజత్వంబు స్వీకరించిన వేము వంశుండు,

## 20. వేము ముని యజ్ఞము జరిపించుట.

ఉ॥ ఆవిధి నాజ్ఞ పొంది వసుధామరు డంతట యజ్ఞవాటికిన్
వావిగ నేగి రాజునకు వాంఛిత సిద్ధి ఘటింప, జ్ఞాన వి
ద్యా వినయమ్ములున్ గలుగ, యజ్ఞ ఫలోదయ పుణ్యలోక సు
శ్రీ విభవమ్ముతో మనగ ప్రేరణ చేసెను యజ్ఞ పూరుషున్.

వ॥ మరియును,

శా॥ యాగోపక్రమణంబు చేసి, బహుధా ఆస్థాన పూజం మహా
భాగుండంతట తీర్చి, దీక్ష నరణిన్ భవ్యుండు పుట్టించె నా
యాగాగ్నిన్, ప్రణయింప వచ్చిన సమూహ్యాగ్నిన్ ప్రతిష్ఠించుచున్
సాగంజేసెను హోమకుండమున సంస్కారించి పూజించుచున్.

ఉ|| భావుకుడై మహామహుడు భవ్య మనస్కృత దీక్షబూని, ఆ
పావకు దల్చి, వేదగత పాఠములన్ వినుతించి, ఆజ్య ధా
రావళి అగ్ని మోదమున ఆయితమై మినుముట్టి హెచ్చగన్
ఆవృత వహ్ని కీలల హుటాహుటి సల్పెను హోమకార్యమున్.

కం|| ముందుగ మూషికవాహను
డెందంబందున నిలుపుచు డిండిమ నాదం
బందం బొప్పగ భూభృత్
నందిని నాధుని కొలిచెను నటవర మూర్తిన్.

కం|| ముక్కోటి దేవ గణముల
నొక్కొక్కరి పేరు పేర నుగ్గుడు తోడన్
వాక్కుల నంతర్ దృక్కుల
ఋక్కుల నాహ్వాన మిచ్చె ఋత్విజుడంతన్.

ద్వ్యక్షర ప్రాసయుక్త తే||గీ||
సక్రమ క్రతు ప్రక్రియ సంక్రమణుని
విక్రమ స్వర వాక్స్వన వీచిక విని
శక్రముఖ్య దిక్పాలు రవక్రగతి ప
రిక్రమించిరి హవ్యముల్ ప్రీతి గొనగ.

కం|| ఉఱుములు, మెఱుపులు విరివై
అరతను మారుత రుతతతి అతిసౌమ్యంబై
తరుశాఖలు తల లూపగ
పరిసర దేశంబు నిండె పరితుష్టంబై. 417

మ॥ మృదు మంత్రంబుల శాకహవ్యముల బ్రాహ్మీమూర్తి యాగంబు తా
ముదమారం జరిపించి నిర్జరులు నామోదింప ఆమ్నాయమున్
తుదముట్టన్ పఠియించి, యిక నా దుర్గన్ ప్రతిష్ఠింతు నే
నిదె తెప్పింపుడు వేగ బాలు నిపుడే ఈశాని ప్రీత్యర్థమై.

వ॥ అని ప్రకటించిన సమయంబున,

ఉ॥ మండిత పండితోత్తముని మంత్ర తపః ఫల లబ్ధ తీక్ష్ణ మా
ర్తాండ మయూఖ దీపికల తామస భావము మృగ్యమై సభా
మండప మొప్పె, రాజు ముఖమండల మంతట కొంత శాంతితో
నిండె భవాని పూజ ముని నెమ్మిక చేయగ నుద్యమించుచో. 420

కం॥ తుష్టిం జెందెను త్రిదివా
ధిష్ఠాన ప్రతియు, నతిఘృత దీక్షా తృప్తిన్
పుష్టి ననలు డుప్పొంగెన్
ఇష్టిం ప్రీతుండయి ధరణీశుండుబ్బెన్.

## 21. కారాగార బద్ధుండైన రాయ పుత్రుని ఆవేదన.

వ॥ ఇంక నా యెడ కరండ బద్ధ కురంగంబు కైవడి భీతిల్లి, కారాగార బద్ధుండై రక్షక పరివార పరివృతుండైన రాయని పుత్రుండు, తన విధికి చింతించుచు, తల్లిదండ్రుల దైన్యంబు నూహించి, దుర్గమంబగు దుర్గంబును నిర్గమించు మార్గంబు గానక, తనకు నేడు మృత్యువు తథ్యంబని తలంచి, యీ యాపత్సమయంబున తన్ను రక్షింప నెవ్వ రోపుదురని తనలో నిట్లని వితర్కించె.

ఉ|| మన్నెము నందు సైనికులు మార్కొని పట్టుట మిత్రు లందరున్
నిన్ననె చెప్పి యుందురని నేననుకొందును, కాకతీయు డీ
తెన్నున నన్ను నేడు బలి దిగ్గన నిచ్చు నటంచు విన్నచో
మిన్నక యుందురే సఖులు, మృత్యువు నడ్డరె తల్లిదండ్రులున్.

ఉ|| ఈ విషయంబు వారలకు నేగతి నేర్పడ తెల్లమౌను, వా
రేవిధి చొత్తు రీ యడవి నెట్టుల దాటుదు రెట్లు వత్తురో
ఈ వనదుర్గ భేదన జిహీర్షలు వారి కసాధ్యమౌట, నే
త్రోవయు తోచకే విఫల దోహలమున్ విడినాడి యుందురో.
424

కం|| పారా కాసెడి వారల
నే రీతిని వంగదీసి నేనీ దుర్గ
ద్వారము దాటుదు, క్రూరులు
వీరిం చేరంగనైన వీలౌనొక్కొ!

ఉ|| చేతను లేవు నాకు చెర ఛిన్నము చేసెడి ఆయుధమ్ములున్
ఆతత శౌర్య సైనిక నియంతులు దుర్గము నప్రమత్తులై
కాతురు, వారి దాటి పురుగైనను బైటకు పోవబోదు, యే
మౌ, తగుదంచు బోవ అభిమన్యుడు చొచ్చిన వ్యూహపద్మమౌ.

ఆ||వె|| వీరికన్ను గప్పి వెలువడు మార్గంబు
కానరాదు నాకు కలచి చూడ,
లంచ మివ్వ లేదు లక్కాకు గవ్వైన
మంచి మాట విడువమన్న వినరు.

ఉ|| ఏ నొకడే సుతుండ మరియెవ్వరు లేరిల తల్లిదండ్రికిన్
నే నెడబాసినన్ బ్రతుక నేర్తురె ప్రాణము లారకుండ, ఎ
వ్వానిని బ్రోవగా వెతను ప్రార్థన చేసిరొ ! చేయకున్నచో
మానిత మూర్తు లే విధిని మాన్పగ చూసిరొ హత్య నీతరిన్.

శా|| ఏ దారింగన లేక, చేయుటకునై యే కార్యమున్ లేక, ఏ
పాదంబుల్ గని మ్రొక్కిరో యెవని సంభావించిరో బ్రోవ, ఆ
పాదంబుల్ మది నమ్మి నిశ్చయ నిరాపాయంబుగా ఈ బలో
న్మాద ధ్వాంతము నుండి బైట పడగా మార్గంబు ప్రార్థించెదన్.

429

శా|| ఏ విశ్వాత్మకు డడ్డు ఘోరకలి యింకేధూర్త సంహర్త నన్
బ్రోవంగా దయచేయు, ఈ బలిని యే పుణ్యాత్ము డాపంగ నే
ర్చున్ పీఠోత్తము డెవ్వడైన విని ప్రక్షోభించి రక్షించునో
ఆ విశ్వంభరు మ్రొక్కెదన్ త్రికరణ వ్యాపార ధర్మంబునన్.

మ|| గజరాజొక్కడు మ్రొక్కెడే విషమ నక్రగ్రాహ సంక్లిష్టుడై
త్రిజనోమ్మహను శౌరి, ఆత డనురక్తిం వచ్చి రక్షింపడే !
త్రిజగాధారుని వీరభద్రు మదనోద్వృత్తి ప్రహారున్ హరున్
అజినాహార్యుని రక్షసేయగ త్రిశుద్ధాత్ముండనై వేడెదన్.

*వ|| ఆ విధంబున తలంచుచు, తనకు వేరు మార్గంబు లేదని నిశ్చయించి ఆతడు తన మనమందున దహించు తాపంబు కతంబున వెలుదెంచెడి దుఃఖంబునంత కఠిన ప్రయత్నమున నాపంగా సమకట్టి, మహాదేవునిపై దృష్టి మరలించి యిట్లని ప్రార్థించె.

---

*కందగర్భిత వచనము. వివరణ-3 చూడుడు.

స్రగ్విణి మాలిక॥

బంది నన్ వేగ కాపాడి రక్షింపగా
ఎందుకో యీశ్వరా ఇందు రావేలరా
మందుడన్ విందుడా ! మాలిమిన్ బ్రోవరా !
వందనమ్ముల్ నుతుల్ ప్రార్ధనల్ చేతురా
బిందు మధ్యస్థ నిర్విష్ట నేత్రాననా !
సుందరాకార ! ఓ సూరి వంద్యా ! నమో
చంద్రికా శేఖరా ! చండికా నాయకా !
నంది వాహ్యా ! హరా ! నాగహారా ! శివా ! 433

వ॥ అని జగత్సంరక్షకుండైన విశ్వేశ్వరుని వినుతించుచు,

మ॥ చెరలో చిక్కి నిబద్ధ భీతుడయి నిశ్చేష్టుండు నిర్భాగ్యుడై
పర సైన్యంబుల మధ్య స్రుక్కి, తను కాపాడంగ దిక్కెవ్వరీ
తరుణంబందని వెక్కి యేడ్చి వరదాతన్ వీరభద్రేశ్వరున్
శరణంబంచును మ్రొక్కె దుర్భర నిరాశావేశ చేతస్కుడై.

వ॥ కొంత కాలంబు శివధ్యానమగ్నుండై అహీన విలాస విలసత్వంబున మనంబు లగ్నంబు చేయనేరక, అజ్ఞత్వంబున శివప్రజ్ఞా విశేషం బెరుంగక శంకితాత్ముండై.

ఉ॥ రారను ఎవ్వరున్, తనకు రక్షణ నిచ్చి విముక్తి చేయగా
బోరను, మన్య దుర్గపతి పోకడ నడ్డెడి ధైర్యవంతులున్
లేరను, ఇంక ఈ నరబలిన్ తగు రీతిని నాపు వారలున్
గారను, వీరభద్రు డుపకారము చేయడు నాకు నేడనున్.

వ॥ అంత రాజచోదితులైన బలికార్య నిర్వాహకు లేగుదెంచి,

కం|| ఘోరాకార వికారత
కారాగారంబు చేరి కనుగొనిరంతన్
నైరాస్య వివర్ణ ముఖున్
ప్రారబ్ధ విధి హతకర్ము, ప్రతిహతి వర్జ్యున్. 439

కం|| చెరసాల నున్న వానిని
నరకలు అరదండ లూడ్చి నరచోదితమౌ
అరదంబున నెక్కించుక
నరగలు మ్రోగంగ విచ్చు నారాజులతో.

కం|| తామస హృదయులు ఒడలం
తా మసిని మిసమిస బూసి, తామర ముకుళీ
దామ సమావృతునిగ ను
ద్దామ సిస్సృప్సా విహారు దారకు చేయన్.

కం|| పరిపరి విధముల పాటల
పరిగొని పణవాది వాద్య పరిఘోషముతో
పరితోష పరివృత పరిణతి
పరిధిస్థులు యజన పరిధి పరుగెత్తిరటన్.

వ|| ఆ విధంబున యజన మండపంబు జేరి,

ఉ|| బాలుని బండి దింపి మఖభాగ విశిష్ట విశాల వేదిపై
తూలగ ద్రోసి, ఆ యెడను తోరణశాల ప్రసూన మాలికా
లోలితమౌ చషాల తగు లోహపు లంకియ లేసి కట్టి రా
భీల విచారఘాలు, అతి పీడితదేహు విముక్త కేశునిన్. 444

ఉ|| ఆగతి సైనికాళి పరిహాస తిరస్కృతి దండ దూషితుం
డై గతి లేక లోకలుగు నాగ్రహ భీతి విషాద రోష ల
జ్జాగత రాగ భారమున నారెకు చూచి వివర్ణ వర్ణుడై
ఆగక పొంగు దుఃఖమున నార్చుచు భోరున నేడ్చె భీతుడై.

వ|| ఆ విధంబున, రాజభట చోదితుండై ఏతెంచిన బాలుని ఆగమనంబున యజ్ఞ వాటికా జనంబుల కలకల రవంబులు జనింప, ఋత్విజుండైన వేము వంశ సరోవరేందీవర హృదయ మందిరారామ విహార సుందరుండు, ఆవంక చూసి, భటసమావృతుండై బలిపీఠంబు నలంకరించిన బాలుని దరిజేరి,

*మణిగణనికరము||
తన మనమున ముని తలచెను, కనగన్
కనికరమగు నధిక చకితు నితనిన్
కొనకొని మన యునుకువ నిక వినగన్
వినబడక నతడు వినతెలుప వలెన్.

వ|| అని తలంచుచు బాలుని సమీపించి, 448

ఉ|| కన్నుల కారు నీరు ఘనఘర్మ జలంబుల చేరిపార, వి
చ్ఛిన్న మనస్కుడై విగతజీవుని పోలిక వ్రాలియున్న ఆ
పన్నుని చేరి బ్రాహ్మణు డుపాయము తోడను మేలుకొల్పుచున్
తిన్నని దృక్కులన్ నిలిపి దీనునితో కనుసన్న నిట్లనున్.

---

*కందగర్భిత మణిగణ నికరము. వివరణ-4 చూడుడు

ఉ|| నే నెవరో యెరుంగుదువు, నివ్వెర చెందకు, నాన్న పంప నే
పూని రహస్య వర్తినయి ప్రొద్దుట వచ్చితి, నన్ను నేరకే
మానిత ధైర్యవృత్తి ననుమానము తోచని రీతి నుండు మీ
మానవ నాథు ముందు, ఇక మాను విచారము నీకు మేలగున్.

వ|| ఆ మాటలు చెవుల కింపు చేకూర్చ రాయుని కుమారుండు తమ యిష్టదైవంబైన క్షపాకర చూడుండును, పట్టిసాది ప్రహరణాయుధ ధారుండును, దక్షయజ్ఞ క్షయుండును, దాక్షాయణీ నాథుండును, దుష్ట శిక్షణుండును, క్షణ స్తోత్రమాత్ర సంతుష్ట దక్షిణ హస్త ప్రసాద క్షతగాత్ర రక్షకుండును, విశ్వంభరుండును, విశ్వ నాథుండును, విశ్వరూపుండును, శాశ్వతుండును, ఆద్యంత రహితుండును, నాదిదేవుండును నైన మహాదేవుండు, తన యెడ నపారకృపావిశేషంబున యూరనుండిన బ్రాహ్మణోత్తముని తన్ను రక్షింప పుత్తెంచెనని మనంబున ముదంబంది, ధరణీసుర శాసనానుగతుండై తన భావంబులు వెలికి వెల్లడింపక నుండ మహా ప్రయత్నంబున మౌనంబు దాల్చి, నయనంబులు మూసి, హృదయంబున భూసురుని పునః పునః ప్రణామంబు లాచ రించుచు, ఆ సన్నివేశంబు మనోనేత్రంబున మననంబు చేసు కొనుచు, ముని నాథుని వాక్కులు చెవుల రింగు రింగుమని సంతుష్టాంతరంగ తరంగంబులు నింపిన.

కం|| డెందంబందున మందు డ
మందానందాను భూతి మందస్మితుడై
వందనము చేసె ద్విజునకు
నందీస్యందను మృకండు నందను బోలెన్. 452

వ|| ఆ సంఘటన విలోకించి సామంతుండు ఆశ్చర్య సందేహ
సంశయంబులు మదిలో నుదయింప, ఇట్లని వితర్కించె.

చ|| అతులిత మృత్యు భీతి నసహాయ విపన్న కృశాంగ ఖిన్నతన్
అతిశయ రోష దుఃఖ విషయావృతి నుద్ధత నేడ్చుచుండి, ఈ
పతితుడు బ్రాహ్మణోత్తముని భవ్య ముఖంబును చూసినంతనే
వెతలను బాసి యే విధిని వెన్నెల లీనుచు విక్రమించెనో.

కం|| ఏదో నూతన తేజము
ఏదో యుత్సాహ కాంతి ఏరాళముగా
గాదిలియై వెలుగొందెను
మోదంబయె వీనిజూడ ముచ్చట కలిగెన్.

వ|| ఆ సమయంబున వీరభద్ర ప్రసాదిత భూత భవిష్యత్ గుణ
గ్రహణుండైన ధరణీసురుండు.

శా|| ఆ సామంతుని హావభావముల నాహర్తించి, సందేహమున్
ఆసేధించగ వానితో ననియె సేనాధ్యక్ష ! ఈ బాలకుం
డో సామాన్యుడు, కృత్తివాస పద పద్మోన్మత్త చిత్తుండు, నే
డా సోమేశ్వరు డెంత వేడినను రాడయ్యేన్ కృపాహీనుడై.

కం|| అమ్మహదేవుని మనమున
నమ్మి యనుదినమ్ము నతులు నర్మిలి చేయన్
ప్రమ్మిన కలతల బాపగ
నెమ్మిక నరుదెంచి కావనేరమి నేడ్చెన్.

వ|| అంతియ గాక, 459

తే॥గీ॥

తల్లిదండ్రులు తనులేక తల్లడిల్లి
తనువు బాయుదు రంచును తపన పడుచు
పల్లె నున్నట్టి సన్మిత్ర పటలమంత
తనకు దుఃఖింతు రంచును తలచు కొనుచు

మ॥ తన ప్రాణంబులు పోవు తథ్య మనుచున్ తర్కించి బాలుండు, వే
దన భారంబు సహింపలేక, నిక నే దైవంబు రక్షింప డం
చును ఖిన్నుండయి యేడ్చె, రాజభట సంక్షోభంబుచే నేడ్చె, త
ల్లిని తండ్రిన్ స్మరియించి యేడ్చె, తనపల్లెన్ దల్చి యేడ్చెన్ జుమీ.

ఉ॥ అంతట మృత్యు గహ్వరము నందున కాలిడి, ఆత్మయందు వే
దాంతము నిండ మిధ్యయగు ధాత్రిని జీవనయాత్ర బుద్బుదో
దంతము, నిత్యమాత్మ, అది ధ్వంసము లేక పరిభ్రమించు, నా
వంతయు గుందనేల భగవంతుని చేరగనంచు తల్చుచున్.

కం॥ శ్యామిక భావికి గురియై
నైమిత్తుకు డగుచు నవ్వె, నవ్వడె మును వి
శ్వామిత్రుని దత్తుండు, పెం
దామర మెడకు తగలన్ శునఃశ్శేఫుండున్. 463

# 22. సామంతుని పరివారము దుర్గ ప్రీత్యర్థము నాట్యము చేయుట.

చ|| అది అటులుండె, నాదమయి యాగము చేతము రమ్మి భూవరా
అదనును దాటి పోగల దన్న నరేశ్వరు డానతిచ్చె నా
మదహర మూర్తియౌ మహిష మర్దని సంతసమంద కామిత
ప్రదమగు నృత్యముల్ సమర రంగ విలాసిత భంగురంబుగా.

కం|| జరిపించుడు నటకోవిద
పరివార మిపుడని ప్రభువు పరిఘోషింపన్
మురిసిరి పరివేష్ఠిత తతి
పురజన పరిపాలవరులు పులకింతలతో.

వ|| ఆ సమయంబున నాట్యాభ్యంతరంగంబున,

ఉ|| నల్లని గుడ్డలున్, తలకు నైపుణి ఎర్రని కోక జుట్టి, ఓ
తెల్లని వస్త్రమున్ కటికి తీరున త్రిప్పి బిగించి మించుచున్
ఫుల్లసరోజ మాలల ప్రఫుల్లత కంఠములం ధరించి, ఘల్
ఘల్లను గజ్జెలన్ పదయుగంబున దాల్చి విచిత్ర వేషులై.

మ|| భటులున్ భృత్యులు వీరశైవ తతులున్ భట్రాజులున్ భిల్లులున్
చటులోద్దండ విలాసనర్తన కళా సంపన్న పారీణతన్
కటి శీర్షా పద హస్త నేత్ర భృకుటీ గంభీర చిన్ముద్రులై
నటనంబాడిరి వీర రౌద్ర రసముల్ నట్టాడ భీమంబుగాన్.

మ|| ఢమరుల్ డింఢిమ ఝర్ఝరీ పణవముల్ ఢక్కల్ మృదంగంబులున్
అమరన్ దుందుభి తమ్మెటల్ పటహ గర్జారావముల్ సేయగా
తమస స్వాంతులు నాట్యమాడి రట భేతాళాన్వయ స్ఫూర్తితో
సమవర్తి ప్రతిరూప తత్పరతతో చాముండి సేవార్థమై.

శా॥ ఆ నాట్యంబును గాంచి సంతస మనోవ్యాపార రంగాత్ముడై
సేనాధ్యక్షుడు భేషు భేషు, వహవా, సేబాసు, మేలంచు తా
నానందమ్మున విప్రు జూచి, మునిసింహాగ్రేసరా ! కాంచితే,
ఈ నాట్యంబున సర్వభూతములు హీహీ యంచు క్రీడింపవే.

కం॥ మా భట కూటమి నటనము
ప్రాభావిత హావభావ రసమధురంబై
బీభత్స భయానక గతి
స్వాభావిక వీరరౌద్ర భరితము గాదే.

తే॥గీ॥ సహజ భేతాళ భైరవ స్పందనంబు
సిసలు సమర విన్యాస లాస్యేచ్ఛికంబు
స్వేచ్ఛ వీరశైవ విలాస వర్ణితమ్ము
ఇట్టి నాట్యంబు గంటిరే యెన్నడైన.

వ॥ అనవిని, వేదవిధ్యుక్త సనాతన సంగీత బద్ధ శోత్రియమార్గ భరతమౌని సంప్రదాయ నాట్యపారంగతుండైన వైదిక శిఖామణి, అనార్యంబును, అతిశయ ప్రదర్శనంబును, అశాస్త్రీయంబును, నాట్యకళా కళంకితంబునగు వెర్రి గెంతులను తిలకించి, ఆ అపహాస్య భ్రకుంస లాసికా అంగహార విక్షేప వ్యంజక ప్రదర్శన దర్శించిన సేనాధ్యక్షుని మెప్పుకోలుకు మనంబు గర్హింప, ఆ సన్నివేశంబు హాస్యాస్పదంబై చెలంగ, నిగూఢ వదనుండై తనలో ఇట్లని తలంచె. 473

కం॥ ఇది యొక నాట్యంబగునే
మది సంభ్రమ భయ వికటిత మధులోలితమై
మద పూరిత ముఖ ముకుళిత
పద పీడిత కర విదళిత పరిహాసంబై.

కం॥ పరుగులు నురుకులు నొరుగులు
పొరిపొరి తిరతిర తిరుగులు బొరిబొరి నురుగుల్
అరుపులు దరువులు చరుపులు
పరుషపు నెరసరి పెరవిణి వరవల విరపుల్.

కం॥ పికపికలు, తెకతెకలు, విక
వికలున్ తకతక లుకలుక విసవిస పలుకుల్
ఇకయికలు బకపికల చక
చకలున్, చికపిక పకపక చికమిక చికితల్.

ఉ॥ గెంతులు, కుప్పిగెంతులు, వికీర్ణ వినిర్గత కేకరింతలున్
వంతులు పోయి యాడుటలు, వానరముల్ సుర దేలి మంటలో
గెంతిన భంగిమల్, గృహము కీలలు సోక గృహస్థు పర్వులున్
ఇంతులు నూటబావి కడ యిమ్మడి చిందుల బోలు నాట్యముల్

చ॥ అని మదిలో తలంచి, యిక నార్య సలక్షణ నృత్త పద్ధతుల్
అనిమొన కత్తిసాముల మహత్త్వము వ్యక్తము చేయు నర్తనల్
జనపద వీరశైవ నటజాతులు, జాగృతి నాట్య కీర్తనల్
మునుకొని భారతీయ నట ముద్రల కొన్నిటి చూపనెంచుచున్.

# 23. వేము ముని నాట్యము చేయుట.

కం॥ ముని మౌనము దాల్చుచు తన
మనమందలి భావ మేది మనుజేశునకున్
కనబడనీయక, నయమున
చనియె నతిరయమున నాట్యసదనము చేరన్.

ఉ। నర్తనశాల జేరి తల నమ్రత వంచి నమస్కరించి, సం
వర్తన నర్తనా విభవ వర్తను నార్తి వివర్తవృత్తి సం
కీర్తనలం స్తుతించి నట గీతిక వాద్య సమూహ వర్గమున్
గుర్తులెరుంగుచున్ మసలగోరుచు సూచన లిచ్చి నిల్పుచున్.

మ॥ చిటి గజ్జెల్ చరణంబులన్ సొగసుగా చిందాడ, అంగోస్త్రమున్
కటిభాగంబున లంకె వేసి కబరిన్ కైదండ బంధించుచున్
పటుగంభీర విలాస రాగమున నేపథ్యాంతరంగంబునన్
నటనంబాడె సనాత నార్యజన నానా మార్గవైలక్ష్యమై.

ఉ॥ కాంతుల నీను కంటి నయగారపు వంపుల సొంపు సంపదల్
వింతగు హస్త ముద్రలును, విస్తృతపాద నిపాత సంగతుల్
సంతత తన్మయత్వ సుఖశాంతి హృదంతర మందు చింద, వి
భ్రాంతుల చేసె భూసురుడు పార్థివ సేవక వర్గలోకమున్.

సీ॥ సరస లావణ్య హస్తచరణ ముఖనేత్ర
భంగిమాన్వితమైన భరత నటన,
కాకతీయ ప్రభా ఘన ఘనోల్లాసిత
గంభీర పేరిణీ కదన నటన,
విజయనగర రాజ్య విజ్ఞాన వాగ్గేయ
డోలికా శైలి మండూక నటన,
దీక్షిత ప్రోక్తంబు దివ్యగానాద్భుత
పురుషకారము కూచిపూడి నటన,
తే॥గీ॥ ఆంధ్ర జనపద యక్ష గానామృతమ్ము,
మచ్చుకొక్కటి చొప్పున మలచి చూపి,
రౌద్ర బీభత్స భయద వీర కరుణ రస
గర్భితమ్ముగ నర్తించి కరము మెరసి.

తే॥గీ॥ ఢామ ఢమ ఢక్క ఢమ ఢక్క డప్పు లదర
విలయకాలాంత పర్జన్య విస్ఫులింగ
విస్సృత శబ్ద గర్జిత పరివేష్టితమ్ము
నాడు చూపించె నటరాజు నట్టువమ్ము.

శా॥ తంత్రీవాద్యము, చర్మవాద్య చయముల్, తప్పెట్లు తాళాలతో
జంత్రీమేళముగా చతుర్విధములౌ శబ్దంబులున్ మ్రోయగా
మంత్రుల్ భృత్యులు సైనికుల్ సభికులున్ మత్తిల్ల, నాడెన్ మహా
మంత్రోద్భూత విశిష్ఠ నాట్య గరిమన్ మాహాత్మ్య విన్యాసియై.

శా|| వీణా ప్రక్వణ నాదముల్ పటహ గంభీరోద్ధతి స్వానముల్
వేణు ధ్వాన విశిష్ట మేళనముతో విన్యాస లాస్యంబులన్
పాణుల్ పాదములున్ సమన్వితముగా బ్రాహ్మీ కృపావేశుడై
రాణందేల్చెను బ్రాహ్మణుండు బహుధా రాజేశు నుత్సాహియై.

మ|| ముదమారంగ మనోజ్ఞమౌ ముకుళముల్ ముంజేత ముద్రించుచున్
మృదు కంఠస్వన వల్లకీ నినదముల్ మీగండ్ల మీటించుచున్
పదపద్మద్వయితో మృదంగ రవముల్ పర్జన్య గర్జంబులై
హృదయ స్పందన చేసె, చూపరులు పృథ్వీశుండు వహ్వాయనన్.

మ|| విలయ స్ఫూర్తిని విప్రుడున్ డమరు కోద్భేద ధ్వనుల్ చేసినన్
ప్రళయోద్వేగ భయాన కావహమునన్ పంకించె దేహంబులున్,
అలఘుం డాంగిక వాచికల్ సొగసుగా నాలంబనల్ చూపినన్
కలిగెన్ మానసమందు శాంతి సుఖముల్ కళ్యాణ సూచ్యంబులై.

తే||గీ||
ఆ ప్రదర్శన గాంచి సేనాధిపుండు
తన్మయానంద చైతన్య తన్వు డగుచు,
శాంతి సంతోష సంతృప్తి సంతరింప
కొన్ని క్షణముల తదుపరి కోలుకొనుచు.

వ|| పదంపడి లేచి సింహాసనంబు డిగ్గి రెడ్డి రాజ్య సామంతుండు నాట్య సామ్రాజ్య శ్రీమంతునిం జేరి ప్రణమిల్లి, యిట్లని విన్నవించె.

## 24. సామంతుండు ముని నాట్యంబు నభినందించుట.

ఉ|| వందనమో మహా విభవ వర్ధన! భారత నాట్య సంస్కృతి
స్యందన మందు పార్థివుని సంశయముల్ విడిపోవ, నాడు గో
విందుడు గీత పార్థునకు విస్ఫుట దర్శన మిచ్చినట్లు, నా
యందున ప్రేమ బూని పరమాప్తుని రీతిని చూపినాడవే.

ఉ|| మండిత పాండితీ విభవ మాన్య మహా మహిమోన్నతుండు భూ
మండలమందు నుండడు, సమర్థుడు, యాజ్ఞికమౌళియంచు, ఈ
మండప మందునున్న ప్రజ మంత్రి భటాదులు నేను తల్వ, మా
మండలి భ్రాంతి చెంద నట మంజువు చూపితి వో ఋషీశ్వరా!

ఉ|| జన్మము ధన్య మయ్యె నిను సంగడి చూచిన, మాట విన్న నీ
సన్మది వ్యక్తమయ్యె, మఖచాతురిగన్న మదీయ భాగ్యమే
సన్ముని రూపమై నిలిచి సంచిత కర్మల బాపె నంచు నే
నున్మనుడైతి, నీ నటన మూహను మించె మునీశ్వరోత్తమా !

మధురగతి||

వాద్యము నాట్యము వాచ్యము సమలయ
హృద్యము భ్రూనయనేక్షణ మభినయ
వేద్యము వ్యంజన వేష్టిత సహజము
చోద్యము నీ నట శోభను కనగను.

కం।। గురుడవు, బహువిధ నర్తక
వరుడవు, పృథు మంత్ర తంత్ర వాఙ్మయ విద్యా
ధరుడవు, పురహర కరుణా
పరుడవు, ఘన వేదశాస్త్ర పరతంత్రుడవున్.

కం।। మిత్రుడ వనుపమ పూజా
పాత్రుడవు రసమిళిత గళ పౌరుష గీతా
గాత్రుడ వద్భుత సాత్విక
నేత్రుడ వసమాన నాట్యనిధి నియముడవున్.

కం।। సరసుడ వపార మేధా
పరిగణుడవు, బహు పురాణ పారాయణ ల
బ్ధ రసాస్వాదన సుశ్రీ
పరుడవు, శంకర మహాకృపా పూర్ణుడవున్.

కం।। హితుడ వసామాన్య పురో
హితుడ వహంకారగుణ రహితుడవు, మద సం
హృతుడవు, నిగమాగమ సం
హితుడవు, మహనీయ తత్త్వ హృదయాత్ముడవున్.

ఉ।। నీ వసమాన విప్రుడవు నీవొక నిర్మల కర్మయోగి, పుం
భావ సరస్వతీ ప్రతిమ భాతి సనాతన ధర్మవృత్తి పా
పావహులన్ పవిత్ర పరమాత్ముల చేయగ వచ్చితయ్యా, నే
నే విధి నీ మహా ఋణము నేర్పడ తీర్తును విన్నవింపుమా.

శా|| ఈ యానందము ఈ మహావిభవ మీ హేలా ప్రపంచంబులున్
ఈ యుత్సాహము లీ ప్రదర్శనము లీ యేపారు సౌభాగ్యముల్
ఈ యుత్తేజము నెక్కడైన కనలే దెన్నండు, ధన్యుండ నో
యీ యోగీశ్వర ! కోరుమా గురు ఋణంబీడేర్తు సూచించినన్.

మ|| ధనమో ధాన్యమొ ధామమో ధనదు రత్న స్థాపితా దామమో
వనమో వన్యములో వనాంతర సరః ప్రాంతంబులో వాడలో
కనకంబో కమనీయ కంఠికములో గంధేభ యూథంబులో
వెనుకన్ జూడక వేడు మో బుధవరా ! వేవేగ నిత్తున్ దగన్.

శా|| అన్యుల్ చేరరు ఈ మహావిపిన ఘోరారణ్య మన్యంబు, నే
ధన్యుండైతి నటంచు తల్చితిని నీ దైవజ్ఞతం జూచి నా
పున్యంబంచును, నీ సమగ్ర మహిమన్ పూర్ణత్వముం గాంచ నా
కన్యంబై కనుపట్టె, వేడుకగ ప్రజ్ఞాదిత్యు లేతెంతురే.

వ|| కనుక, నీవొక మహాప్రయోజనంబు కోరి, అనాహూతుండవై నను, ఈ అధ్వర సమయంబునకు ఈయెడ కరుదెంచితివని నా కనుపించు చున్నది.

చ|| తొలియుగ మందు ధాత పరితుష్టికి వామనరూపుడై ధరా
తలమున శౌరి పుట్టి మఖ దానము పట్టె విశిష్ట దాతయౌ
బలినృపు కీటడంచె వెడపాడి త్రివిక్రమ వృత్తి, కాని యీ
కలియుగ మందు దాతల నకారణ మారణ చెల్లదే తరిన్.

వ|| అయినను, నా ఆతిథ్యంబు స్వీకరించి, నా అభ్యర్థనల
ననుసరించి యజ్ఞసారథ్యంబు వహించిన పిమ్మట నన్నధః
పాతాళంబునకు త్రొక్కవని నీ ముఖ కమల కటాక్ష వీక్షణల
వీక్షించిన క్షణంబు నే నెరింగితిని. అదియునుం గాక,

కం|| నీవంటి మహామహితుల
నే వంకం గాంచవచ్చు నెన్నం డైనన్
నావీట వచ్చినాడవు
నీ వే మడిగిన మహాత్మ నెమ్మది నిత్తున్.

చ|| ఎరుగుదు వేమొ నాకొక మహేప్సిత మున్నది జీవితాన, ఏ
తెరగున భూరిశక్తులను దీటుగ పొందగ వచ్చునంచు నే
నెరపున వీరశైవ మత నిష్ఠ నిరంతర వర్తినైతి, నీ
కెరిగెద తెల్పవే, మహి నహీన మహత్వము పొందు సాధనల్.

ద్రుతవిలంబితము||
ఎరుగదెల్పుము ఏ విధినైన, నీ
కెరుక లేనిచొ ఎవ్వరెరుంగ రే
ఎరుకలైనను ఏర్పడ ఈ భువిన్,
ఇరుల దివ్వియ వీవె ఇలాసురా ! 508

# 25. వేము ముని సామంతునకు సృష్టి క్రమమును అద్వైత సిద్ధాంతంబును విశదీకరించుట.

వ॥ అని విన్నవించిన దళవాయి వచనంబులు మునీశ్వరునకు ముదంబు చేకూర్చ, తన నాట్య ప్రదర్శన తిలకించిన కాకతీయుండుత్సాహియై కామితార్థంబుల నిత్తు కోరుకొమ్మను విన్నపంబు లాకర్ణించి, తను వేంచేసిన కార్యంబు సఫలంబగు సమయంబు సమీపించెనని యూహించి, అయినను రాయ కుమారుని బలిపీఠంబు నుండి విడిపించి ప్రాణదానంబు చేయుమని త్వరితగతిని కోరిన ఎడల, తన కోర్కి నా రాజు నరమేధ విఘ్న హేతువుగా భావించి సమ్మతింపక పోవచ్చునను శంకనూ, ఇంతియ గాక కాకతీయునిపై తనకో విధమైన జాలియు, కరుణయు జనించుటంజేసి, ఆతని నికృష్ట సాధనల నంత మొందించి ఆర్య సనాతనాద్వైత మార్గంబు నవలంబింప చేయ సమకట్టి, క్లిష్ట వేదాంత విషయంబనిష్టంబు చేయ నొల్లక పామరానుగుణ వివరణల నిచ్చి తప్పుల నెరింగి ఋజుమార్గ ప్రవర్తన చేపట్టింప చేయతలంచి, మున్ముందు ఆతని శౌర్య పరాక్రమంబుల నెన్ని చూప ఇట్లనియె.

ఉ॥ రాజకులైకభూషణ విరాజిత రాజ సహస్ర మర్దనా
పూజిత నిర్జితేంద్రసమ పుణ్యవిశేషిత కీర్తి సాధనా
శ్రీజిత ధీర వీర ఘనసేన సమీకృత దుర్గపాలనా
భ్రాజిత సుందరాంగి రతిభార వినోదిత పంచసాయకా ! 510

మాలిని।। శతమఖ సమదీప్తా, శంభుకాంతా వినమ్రా !
అతులిత బలధామా, ఆర్యనాట్య ప్రమోదా !
వితరణ గుణశీలా, విశ్వ విక్రాంత దక్షా !
చతురకదన భీమా, సార్వభౌమాంతరంగా !

కవిరాజ విరాజితము।।
వరవిభ వాస్పద వాసవ సన్నిభ వైరి విదారణ వహ్ని నిభా!
కరి రథ ఘోటక కర్కశసైనిక ఖండితశాత్రవ కాంతి నిభా!
పురహర సన్నుత భూభృత నందన పూజనవందన పుణ్యపరా!
మరుసతి సన్నిభ మంజుల భామిని మారవికార రమారమణా!

*సీ।। ధారుణీ వర! శత్రు దాంభిక దార్ఢ్య దా
రుణ దండనా! ధరరోషధీర!
మారఘట్టిత మధ్యమా రతి మాన సా
రళ సాధనా! అతిరమ్యరూప!
వీరభైరవ తంత్ర భీకర భిక్షు కా
రణ మారణా! ఘనరాజ వినుత!
హార కాంచన మౌక్తికా భరణాంచితా
రవ హర్షణా! అనురాగహృదయ!
తే।।గీ।। పురహరసతి నధికముగ పొనరి కొలిచి
వరములు కొనిన నరవర! ప్రతిభయహర!
కరుణమయ హృదయ! చతుర కదన విభవ!
పరగ కలుగు శుభములు నృప! తిరముగ. 513

*మత్తకోకిల, ద్విపద, కంద, ఆటవెలది గర్భిత, సర్వ రేఫ ప్రాస, లఘువర్ణ ఎత్తు గీతికా సీసము. వివరణ-3 చూడుడు.

ఉ॥ చేసితి వెన్నొ పున్నెములు చెల్లిన జన్మము లందు నీవు, ఆ
వాసన మూలమై యిపు డవారిత విక్రమ శౌర్య ధైర్యముల్
భాసుర భాగ్య సంపదలు పార్థివయోగ విభూతి దక్కె, నే
డాసితమైన సర్వ పురుషార్థము లందున తేలియాడుచున్.

ఉ॥ వీరుడవై విరోధులను వేలకు వేలు జయించి ధీరతన్,
మారుడవై శిరీష సుమమార్దవ బాలల గూడి, రౌద్ర గం
భీరుడవై మృడాని నతిభీషణ వృత్తి భజించి మించి, సం
సారుడవై చెలంగి భవసౌఖ్యము లందుచు తృప్తి లేమిచే.

ఉ॥ మ్రొక్కితి వీ వహర్నిశము మోక్ష విధాయి నుమామహేశ్వరిన్
చక్కని యాత్మశుద్ధి, అవిచార యుతమ్మగు జీవనమ్ము, సొం
పెక్కగ విశ్వశాంతి, జగదేక కుటుంబ విభూతి కోర కీ
రక్కసి క్షుద్రశక్తు లనురక్తత కోరితి వెందు కోసమై.

516

*సీ॥ వినతులున్, పూజలు, వేదమంత్ర పఠనల్,
నామంబు సంకీర్తనల్, తపంబు
విహితమై యుండంగ వేనవేలుగను వి
శ్వేశున్ కనంగన్ మహిన్ ! నరేంద్ర!
విగతమై పోయి వివేచనల్ పరమ మూ
ర్ఖంబైన మార్గంబుగా, నిరతము
సురతమున్ దేలుచు క్షుద్ర మైన బలులన్
రంజిల్లగా నేల ! రాజచంద్ర!

---

*మత్తేభ, కంద గర్భిత సీసము. వివరణ-6 చూడుడు.

తే||గీ|| దొరకొనునె భూరిశక్తులు, దురితము లోన
గూడుగాని దుష్కృతములకున్, నిరవధి
క సుఖము కలదే నరులకు ! గరళగళుని
కరుణ కలుగకుండన్, వాని గరిమ గనక.

శా|| రంభా భామిని బోలు సుందరులతో రంగారు శృంగారముల్
అంభోయాన విభూతి వైభవముతో నైశ్వర్యముల్ గల్గియున్
దంభత్వంబున దుష్ట శక్తులకునై దైతేయ మార్గంబు లా
రంభింపన్ సమకూడవే పరమ ఘోరంబైన పాపంబులున్.

ఉ|| ఎందులకయ్య నీకు మన మేకటచెందె, భవాని రూపమున్
దెందము నందు నిల్పి, యధిదేవత తత్త్వ విచార సచ్చిదా
నందమునంది, యీ సకల నశ్వర లోకము బ్రహ్మ కల్పిత
స్పందనగా ఎరింగి, భువి సార్థక జన్ముడవై మెలంగుమా!

మ|| ఇకనైనన్ మానుము నీచమైన బలి, నీవీ సృష్టి వీక్షింపు మీ
సకలంబున్ విధి కల్పితంబగుట, ఈ చంద్రుండు సూర్యుండు తా
రకలున్ సర్వ చరాచరంబులును నిర్ఘాతంబులున్ జాతముల్
వికలంబై చను కాలగర్భమున ఆవేశంబు నీకేటికిన్.

కం|| ఇది నాదని, అది లేదని,
అది వలయు ననుచు, విషవలయ స్థితిలోనన్
మది దూర్చుచు తల్లడిలక,
హృదయాంతర వాసు వెదుకు మిష్టిన్ దీక్షన్. 521

భూనుతము||

ఎందుకో భువిని కొందరి కే శ్రమలేకే
అందు నన్ని సుఖసంపద లచ్చరువందన్
అందుకో గలరు వారు మహోదృత కీర్తిన్
ఇందుకే బ్రతుకు వింతగు నెంతయు ప్రీతై.

వ| నరపాలా! ఈ జన్మలో గలుగు భోగభాగ్యంబులు, కష్ట
నష్టంబులు కర్మ ఫలంబులు.

ఉ|| సర్వ జనాళి మోదము విచక్షణ యేమియు లేక కోరు నా
శర్వుని యర్ధభాగ సతి సర్వ శుభంకరి, జీవరాశినిన్
సర్వసమాన దృష్టి గని సౌమ్యత సృష్టిని పెంచు డించు, తా
పూర్వపు కర్మలన్ జనులు పొందుచు నుందురు భోగ భాగ్యముల్.

శా|| యాగంబుల్ బలిదానముల్ వ్రతములున్ యంత్రంబులున్ మంత్రముల్,
ఆ గీర్వాణుల గొల్చుటల్, వివిధ మాయాజాల తంత్రంబులన్
ఆగంబోవవు సంచితౌఘములు, విశ్వాత్మున్, జగద్రక్షకున్
రాగాతీతుని యోగివై వెదకుమా ! రాగంబు మాయంబగున్.

శా|| ఈ లోకంబుల సర్వజీవులు ననేకేకైక దైవత్వముల్
ఆలోకింపగ సృష్టికర్త మనలో నాద్యంత సంయోగియౌ
ఆలోలాత్ముని చెంద వెన్నడును కర్మాకర్మ విధ్యుక్తముల్
నీలో నున్న పరాత్పరున్ తెలియుటే నీ జన్మ కర్తవ్యమౌ.

మ॥ భగవంతు డన ఎవ్వ రౌను! అది యో ప్రాణా, శిలా మూర్తియా,
మగవాడా, వనితా లలామ యగునా, మార్తాండుడా, చంద్రుడా,
గగనాకారుడ, తారలా, ధరణియా, క్ష్మాభృత్తులా, గోవులా,
యుగమా, కాలము, "నేతి నేతి" యగునా, ఉన్మాదు లూరోృకలా!

సీ॥ విగ్రహంబును కొల్చి వినుతించు నొక్కడు,
చిత్ర పటముకు మ్రొక్కు శిష్టు డొకడు,
శూన్యంబు చూచుచు శోధించు నొక్కడు,
చిహ్నంబు నెన్ని రంజిల్లు నొకడు,
యజ్ఞముల్ సేయుచు నర్థించు నొక్కడు,
మంత్రంబు జపియించు మది నొకండు,
సూర్యుని ప్రార్థించి శోభించు నొక్కడు,
గురుని శుశ్రూషల కొలుచు నొకడు,
తే॥గీ॥ఒకడు ఉపవాస దీక్షల నుగ్గుపడును,
ఒకడు శమదమ యోగియై యూరు విడుచు,
ఎంద రే విధి ప్రార్థించి యెన్నుచున్న
స్వహృదయానందవర్తి యీశ్వరుడు సుమ్ము.

తే॥గీ॥ ఇపుడు చెప్పిన దేదైన ఇష్టమొప్ప
ఆచరింపంగ మానవు లార్తి తోడ,
దేవదేవుని దర్శింప త్రోవజూపు
తుదకు నంతర్ముఖత్వంబె తోడుమనకు.

వ॥ నరపాలా! సృష్టి క్రమంబును, మోక్షమార్గంబును సూక్ష్మంబుగా
వాక్రుచ్చెద, వినుము. 530

శా॥ సాకల్యంబున నుద్భవించె తనలో స్వాయంభువై శక్తి తాన్
ఏకంబౌ నిజశక్తి తేజమయి తానే ద్రవ్యమై జీవమై,
ఏకత్వంబు వికల్పమై వివిధమై ఏకైక కేంద్రంబులై
జోకైయొప్పె, విభిన్న భిత్తముల సంయోగంబె మోక్షంబనన్.

వ॥ ఈ విషయములే కించిత్తు విశదీకరించెద. నీ పుణ్య పరిపక్వంబును బట్టి తదర్థంబును తెలిసి కొనగలవు. సావధానుడవై ఆలకింపుము. ఆదిమధ్యాంత రహితయు, భూత భవిష్యత్ వర్తమాన కాలపరిమాణ బద్ధంబును, నియమితంబును కాని బ్రహ్మంబు, సృష్టి చేయ సంకల్పించి, తనలో తాను స్వయంభువై శక్తిగా నుద్భవించె.

శా॥ ఆదిన్ దా ప్రభవించె సృష్టి మును ముందా శక్తి ఓంకారమై,
ప్రాదుర్భావము చెందినట్టి ప్రణవారావంబు తేజంబునై
నాదంబుం సమకూడి ద్రవ్యతతి పౌనఃపున్యమై పుట్టె, సం
వేదంబై జనియించె వెల్లువలుగా వేవేలు బ్రహ్మాండముల్.

శా॥ బ్రహ్మాండంబుల నుండి తారల కదంబంబుల్ గ్రహక్షేత్రముల్
బ్రహ్మాస్ఫోటన పుట్టె, తేజమును తత్ ద్రవ్యంబు సంయోగమై
బ్రహ్మాస్ఫూర్తి రసాయన ప్రతిభ నుత్పన్నంబులం జెంది రా
బ్రహ్మస్వాంతులు జీవరాశు లోకచో ప్రత్యేక రూపంబులన్.

తే॥గీ॥ ద్రవ్యమే శక్తి, శక్తియే ద్రవ్యమగును,
కాంతి విద్యుత్తు నాదంబు కాదె శక్తి,
అవియె జీవికి జీవంబు నవియె తనువు
స్థితులు మారిన మారును సృష్టిలోన. 535

తే॥గీ॥ చూడ యీ సృష్టి శక్తి యాస్ఫోటనంబు
శక్తి సంక్లిష్ట సంయోగ సంజనితము
సకల చేతనాచేతన జగము నిత్య
నిర్విరామ చైతన్యంబు నిరవధికము. 536

వ॥ ఈ అనంత విశ్వవలయ మందు లెక్కకు మించిన బ్రహ్మాండ క్షేత్రంబులు గలవు. ఈ క్షేత్రంబుల శత సహస్రానీక బ్రహ్మాండంబులు, వీటిలో అగణిత శత సహస్ర నక్షత్ర మండలంబులు, నక్షత్రములను పరిభ్రమించు గ్రహక్షేత్రంబులు, ఉపగ్రహంబులు గలవు. ఈ గ్రహోపగ్రహంబులు స్వశక్తిపైనను, నక్షత్ర శక్తిపైనను ఆధారపడి పరిణామము నొందుచుండును.

ప్రతి క్షణమూ, కొన్ని బ్రహ్మాండంబులు శూన్యమందు శక్తిస్థితి పరిణామ ప్రక్రియ వలన ద్రవ్యరూపంబున నుద్భవించుచున్నవి. ఉద్భవించినవి శక్తిని ఆకళించుకొని వృద్ధి బొందు చున్నవి. కాల క్రమంబున కొన్ని శక్తిని కోల్పోయి క్షీణించుచున్నవి. కొన్ని తారా మండలంబు లందు శక్తి పూర్తిగా క్షయింప, వినాశంబు నొందు చున్నవి. ఇచట వినాశమనగా ద్రవ్యనాశనము. ఈ ద్రవ్యంబు శక్తి రూపంబున పరిణామంబు చెందును. తగినప్పుడు శక్తి తిరిగి ద్రవ్య మగును. ఇదియే సృష్టి.

సృష్టి అంతయు కాలానుగుణమైననూ, ఎపుడు మొదలైనదను ప్రశ్నకు సమాధానము లేదు అదే విధమున సృష్టి ఎపుడు అంతమగు నన్ననూ చెప్పనలవికాదు. కనుక సృష్టి కాలాతీతము.

నక్షత్ర మండలంబుల గల గ్రహోపగ్రహంబుల కొన్నింటిపైన, శక్త్యాధార రసాయన ప్రక్రియ వలన జీవరాశు లుద్భవించినవి. ఇవి యిప్పటికే శత సహస్రానీక రీతులుగా పరిణామము చెందు చున్నవి. ఇంకనూ నూతనముగా ఉద్భవించగలవు. పరిణామము చెందగలవు. మనకు తెలిసిన జీవరాశులైన, సూక్ష్మ, క్రిమి, కీటక, వాయస, జలాంతర, భూచర, వృక్ష, తిర్యగ్, స్థావర, జంగమాది వివిధ జీవరాశులలో మానవ దశయే శ్రేష్ఠమైనది, ఉత్కృష్ట మైన దని చెప్పవచ్చును

తే।।గీ।। చేతనాచేతన సకల సృష్టి యందు
జీవరాశుల జన్మంబు శ్రేష్ఠ మగును
అందు మానవ జన్మమే అధిక మయ్యె
జ్ఞాన మేధలు గల్గి విజ్ఞాన మగుట.

వ।। తెలివి తేటలు గల మానవుడు ఈ విశ్వ సృష్టి స్థితులను తెలిసికొన సదా ప్రయత్నించుచునే యుండెను. భరత దేశంబున మన పూర్వికులు తపశ్శీలురై, ఋషులై మేధా శక్తి వలన దైవ శక్తి నెరుంగ, ప్రతిపాదింప ప్రయత్నింప, ఈనాడు నిరూపణాధార ప్రయోగ తర్కంబుల నుపయోగించి శాస్త్రజ్ఞులు అదే ప్రయత్నమును చేయుచు మానవాభ్యుదయంబునకు చేయూత నిచ్చుచున్నారు. అయినను వినుము. 539

తే॥గీ॥ విశ్వ మందున్న ఏ యంశ భిత్తమైన
కర్మ యనియెడు విధులకు కట్టుబడును,
విశ్వ భౌతిక విధులను విశద పరుప
శాస్త్ర విజ్ఞాన లక్ష్యంబు సంతతంబు.

తే॥గీ॥ ఎంతొ విజ్ఞాన శాస్త్రంబు వృద్ధి పొందె
అయిన సృష్టి రహస్యము లనవగతము
అర్థమైన సూత్ర పరిధులన్ని దాటి
సృష్టి వైవిధ్య భావంబు చెందుచుండు. 541

వ॥ ఆ విధంబున విజ్ఞానాభ్యుదయంబున శాస్త్ర పరిధి పెరుగుచున్ననూ, సృష్టి రహస్యంబు నెరుగ కుదర లేదు. ఎవరు, ఎందుకు, ఎప్పుడు ఈ సృష్టి చేసిరి, ఏ మార్గమున ఈ సృష్టి ఉద్యమించు చున్నది, పురోగమించు చున్నది. జీవరాశులలో శ్రేష్ఠమైన మానవ జన్మ లక్ష్యమేమి! అందుకు సమాధానముగా భారతీయ వేదాంతంబున, భగవంతుడు నిర్గుణుడు, నిరాకారుడు, ఆదిమధ్యాంత రహితుడు. భూత, భవిష్యత్, వర్తమాన కాలాతీతుడు. సృష్టిలోనున్న సకల అంశములు భగవద్రూపములే, అనగా ప్రతి అంశ శకల మందున భగవంతుడు గలడని ప్రతిపాదింపబడెను. ఇది ప్రహ్లాదుడు నిరూపించెను గదా! కనుక భగవంతుడు మన అందరిలో నున్నాడు. అందువలననే జీవహింస పనికిరాదు. భగవంతుని రూపము, భగవంతుని రూపముతో తగవు పడునా! మనలో నున్న భగవంతుని యెరుంగుటయే మన జన్మ లక్ష్యము, మోక్షము.

విశ్వమందు గల ప్రతి అంశమూ చైతన్య మయమని తెలియు చున్నది కదా! ప్రతి అంశమునకు, అది జీవియైననూ. నిర్జీవియైననూ, చేతన మైననూ, అచేతన మైననూ, పుట్టుక, వృద్ధి, వినాశమను చక్రమునకు లోనైనవే. బ్రహ్మమే సత్యము, నిత్యము. ఈ విశ్వంబు మిథ్య, అనగా కాలానుగుణముగా క్షయించునది.

క్షయించు క్షణిక జగంబున క్షణిక సౌఖ్యంబులు, భోగ భాగ్యం బులు గాక, శాశ్వత బ్రహ్మపథమును పొందుటయే, జ్ఞానుల లక్ష్యము. ఆ అనంత చిదానంద తేజోరాశిలో, సముద్ర జల మందున నీటిచుక్కవలె, పానకంబున కరగిన చక్కెర వలె, తన వ్యక్తిత్వంబును భగవంతుని నిర్గుణత్వంబున కలుపుటయే మానవ ధ్యేయము.

అయినను, ఎంత ప్రయత్నించినను ఒక జన్మమందు, నిజమునకు వందలాది జన్మల కైనను భగవంతునితో నైక్యమగుట జరగని పని. ఎక్కడో నూటికి, కోటికి కొంతమంది మహామహుల కది సాధ్యము కావచ్చును. కాని, మానవుడు ప్రతి జన్మయందునను, ఈ మార్గంబున ప్రయత్నించి ప్రయాణించవలెను. వచ్చు జన్మంబుల తన పూర్వజన్మానుగతంబున వచ్చు కర్మపరిపక్వంబున, అతడు భగవంతు నెరుంగు ప్రయత్నములో ఇంక కొంత ముందుకు పోగలిగి తుదకు తన లక్ష్యమును సాధించ గలడు. ఆ విధంబున ప్రాణు లన్నియు మోక్షమును పొందినపుడే కల్పాంతము కాగలదు.

కనుక జ్ఞాని కాని మానవుడు ప్రపంచంబులో తనకు ధర్మ మార్గంబున సంక్రమించిన సౌఖ్యంబు లనుభవించుచు, సర్వ మానవ సౌభ్రాత్రము నలవరచుకొని, సనాతన ధర్మ మానవ సమాజాభ్యుదయంబు కొరకు ప్రయత్నించుచు, పుణ్యమును మూటగట్టుకొని, మరు జన్మంబునకు ప్రయాణించవలెను.

సీ॥ అంతరంగం బందు నావేశమై యున్న
ఆత్మమూర్తిని గొల్చు నార్తి లేక,
జీవాత్మ గతమైన చిన్మయ బ్రహ్మంబు
చిద్విలాస కళల చేర లేక,
సర్వస్థల వ్యాప్త సతత నిత్యంబైన
సచ్చిదానందంబు జాడ గనక,
తనవారు పెఱవారు తనది నా దనియెడు
స్వార్థ భావంబును చంపు కొనక,
తే॥గీ॥ సర్వ మానవ సౌభ్రాత్ర సమత లేక,
నేనె బ్రహ్మంబనెడు సత్య నిరతి లేక,
జగము నిజమను భావన చపలుడగుచు,
బ్రదుకు మానవ జన్మంబు పశువు బోలు.

శా॥ ఈ విశ్వంబది దివ్యశక్తి కృతమౌ ఈ శక్తియే కాంతి, తే
జో విన్యాసము శబ్దమున్ ఋషివరుల్ శోధింతు రోంకార సం
రావంబంచును, బ్రహ్మమంచు నిదియే ప్రార్థింతురా యోగు లీ
భావోద్భూత విశిష్ట దైవమును సంభావించి యోజించుమా !
544

మ।। మన మౌనీంద్రులు యోగదృష్టి గరిమన్ మాహాత్ము్యలై కంటి రా
ఘన తేజంబును సృష్టి కారకుని నిర్గంధున్ నిరాకారునిన్
మనలో నున్న విశిష్ట సూక్ష్మ పరమాత్మన్ బ్రహ్మగా, ఈ భువిన్
జనులున్ జీవులు చేతనా జడము లీ చైతన్య రూపంబులే !

పృథ్వి।।
అనేక మహనీయు లీ పృథివి త్యాగరాజాత్ములై
మనీషులయి ధ్యాన నిశ్చలత మౌన నిష్ఠాత్మతన్
వనంబుల తపంబులన్ సలిపి వత్సరా లెన్నియో,
మనంబుల నెరింగి రీ నిజము, మన్య భూపాలకా ! 546

ఉ।। ఈ జగమందు సర్వమును ఈశ్వరు నంశము భావమే గదా !
ఈ జగడంబదేల నిక ఈ మనుజాళికి, హింస వీడు మో
రాజకులావతంస! బలి రక్తము చిందగ నీకు మోయి - అ
వ్యాజ జన ప్రియత్వ మది న్యాయము ధ్యేయము మానవాళికిన్.

వ।। కాకతీయ మహా సామ్రాజ్య పరిపాలనా వంశ పారంపర్యాగత శౌర్య ధైర్య ప్రతాప ప్రచండ మార్తాండ తీక్షణ వీక్షణాంభోజనేత్రా! రెడ్డి రాజ్య సార్వభౌమాభ్యుదయార్థ సమరావలంబనా జిజ్ఞాసాంతరంగా! జగజ్జననీ తదైక ధ్యాన నిమగ్నతా విశేష విభవ సముపార్జితాగమ పుణ్యఫలభవ భూరి భోగ భాగ్య సంపాదనా! వితండ కాపాలికాచార్య ప్రబోధిత నరబలి సమాయుక్త చండీయాగ వ్యాపారోల్లసిత మానసా!

నీ భటులు బలికై నిర్ణయించితెచ్చిన వీనిని ఒకపరి పరికించుము. ఈతడు బాలుండు, జీవిత మాధుర్యంబు చవి చూడనైన లేదు. ఈశ్వర కల్పితమైన సృష్టి వైచిత్ర్యంబు నానందింప లేదు. ఈ కుమారుడు మారవికారాకార సుందరాకార సుకుమారుండు. ఈతని ముఖ శరీరాకృతులను గన్న ఈ బొమ్మను తీర్చిదిద్దిన ఆ బమ్మ చాతుర్యంబు కొనియాడవచ్చు. ఈతని భవిష్యద్వంశంబు ప్రకాశ వంతంబుగా గానంబడియెడు.

తల్లిదండ్రుల పంచను మహదైశ్వర్యంబున ప్రేమాదరంబుల పెరుగు చున్న ఈ దీనుండును, ఆతని మిత్రులును దైవవిధింజేసి ఒక్కనాడు విహారయాత్ర కని బయలుదేరి మార్గమధ్యంబున నంది పర్వతారోహణంబు జేసి, ప్రకృతి సౌందర్యంబు తిలకించుచు, యౌవన వయో నిష్పన్నతోత్సాహంబున చెంతనున్న ఆలయంబున నందీశ్వర దర్శనంబు చేయ నుత్సహింపక,

కం॥ అందందు తిరిగి యాడుచు
డెందంబందున వయస్సు డీకొలుపంగా
చిందులు త్రొక్కుచు మూఢులు
నందీశ్వరు మ్రొక్క మరచి నగుచును వారల్.

వ॥ శిఖరంబు దిగి గోదావరి నిర్గమించి ఈశ్వర దర్శనోల్లంఘనంబు చేసిన ఆ యువకులను గాంచి, ఆ యువకుల నాయకుండైన రాయ కుమారునిపై

ఉ॥ కోపము తోడ నంది తన కొమ్మును నేలకు మీటి యౌవనా
టోప నిదిగ్ధ గర్వికి, పటు ప్రతిపన్న శివాపరాధికిన్
శాపము నీదలంచియు, విశాల మనమ్మున శాంతి బూని ఆ
పాపము తీర ఓ దినము బద్ధుడు కమ్మని యాన తిచ్చినన్.

వ॥ ఆ విధంబున నంది యాగ్రహమున కొక్కింత గురియయ్యె. అయి నను సదాచార సంపన్న సంతత హరచరణారవింద స్వాంతుండు గావున, పూర్వజన్మ పుణ్యఫల ప్రాప్తంబున, ఈ వైపరీత్యం బతని కించిత్తు విషాద యోగంబున పరిహరించు. ఆ విధంబున కాననంబు చొచ్చిన యీ వీరుడు నీ సైనిక వ్రాతంబుచే బంధింప బడి, కారాగారమున గ్రుగ్గి, యొడ లెరుంగక ఖిన్నుండై భీతిల్లి వల చిక్కిన విహంగంబు లీల విగతార్ధ ప్రాణుండై, మిత్రులచే పరిహరింపబడి, సైనికులచే ప్రహారింపబడి, ఈ సభాసదులచే పరిహసింప బడుచు, ఆ జగత్ శక్తి ప్రీత్యర్థమై బలికి నిర్దేశింపబడి మహా వ్యాకుల చిత్తుండై, బలిపీఠంబును గాంచి సింహావలోకన కురంగంబు కైవడి గడగడవడంకుచు, తన విధికి దురపిల్లుచుండె. నీ కాతని ఆననంబు తిలకింప జాలి కలుగ లేదా! కృప రాలేదా !

సృష్టి స్థితి లయకారిణి యగు జగన్మాత యీ బడుగు ప్రాణంబునే కోరెనా! వాని శిరచ్ఛేదంబున ఆమె సంతుష్టాంతరంగ యగునా ! అయి, నీ కనూహ్య లోకాద్భుత అలౌకిక శక్తుల నిచ్చునా ! ఇచ్చిననూ, ఈ జీవి తల్లిదండ్రులు, బందుగులు, మిత్రులు, పల్లె జనులు దుఃఖించు చుండ, నీ ప్రజలు ఈ నీచ కృత్యంబును గర్హించి నిన్ను నిందించు చుండ నీవు సంతోషంబున ఆ శక్తులను స్వీకరించి అనుభవించగలవా !

స్వీకరించిననూ నీకు కలుగు సుఖంబులు శాశ్వతములే! నిత్యంబులే! సత్యంబులే! ఈ దుష్కృతంబున నీవు పాపము మూటకట్టు కొనవే! భావిజన్మంబుల ఈ కర్మంబు లనుభవింపక తప్పదు కదా!

మహాసేనాధ్యక్షా! మన్య ప్రజా ప్రాణ రక్షకా! ఒకపరి ఆలోచింపుము, ఒకపరి వీని నవలోకింపుము.

ఉ|| బాలుని నీతిశాలిని కృపాలుని ఆశ్రిత లోక పాలనా
లోలుని వీరవంశ పురులోమ మహత్వ వివేక వర్తనా
శీలుని ఫాలనేత్రు పదజృంభిత పద్మ నితాంత మాధురీ
హేలుని నిర్దయాజనిత హేయ నిబద్ధ చషాలు చూడుమా !

చ|| అతగుని చూడు మొక్కతరి అర్భకు డాత డమాయకుండు, నీ
కితడెప్డైన శత్రువయి యెగ్గు దలంచెనె ! కీడు చేసెనే
హతవిధి యౌచు కానన విహార వినోద మనోభిలాషతో
ప్రతిహతుడయ్యె, ఈ విధిని ప్రాణము తీతువె! దుర్గ పేరునన్.

కం|| అవ్యక్తపు శత్రుత్వము
క్రవ్యాదులకైన లేదు కలియందైనన్
అవ్యాజ జనహితంబే
అవ్యయ పుణ్యంబు యశము నాయుష్యంబున్.

శా|| ఈ దీనుండొక శిష్టవంశజుడు ఆ ఈశాను కారుణ్య దోః
పాదాంతఃకరణుండు, ఆశ్రితబహిః ప్రాణుండు, వంశాంకురం
బై దీపించు నిశీధి పూర్ణ శశియౌ ప్రహ్లాద పక్షాహియున్
కాదాచిత్క విహార వాంఛరతి నీకానన్ ప్రవేశించినన్. 556

ఉ॥ బాలుని బంది చేసి, తన బందుగు లందరి వేరు చేసి, యీ
పాలికి తెచ్చి కట్టి చెరబట్టితి వేమియు జాలి లేక, యా
భీల పరాక్రమ క్రమము పిన్నపయిన్ అసహాయు పైన, భూ
పాలక చూపి తీవు, జనపాలక నామము వ్యర్థమై చనన్.

కం॥ పదునారేడుల బాలుడు
ముదుసలు లీతని జనకులు, మురిపెము తోడన్
ముదమార పెంచినారలు
తుద కీగతి చెంద నెంత దూరపిల్లెదరో!

ఉ॥ ముద్దుల మూటగట్టు నవమోహను డీతడు తల్లిదండ్రియున్
ఎద్దడి తీర్చు ప్రోపరయి యీ భవ సాగరమందు నావయై
అద్దిక యౌ నటంచు మనమందున నమ్మిక తోడ నిల్చి రీ
ప్రొద్దున జీవితాంత పరిపోషకు డీవిధి నీల్గ ఏమగున్.

ఉ॥ పాయును ప్రాణముల్ జనని పాపని ప్రాణము పోవ, తక్షణం
బాయువు తీరు తండ్రికి, వయస్యులు పల్లె జనంబులున్ మహా
పాయము నొందువారు, నరపాలక వారి వినాశ హేతువై
కాయక మే విధిన్ సుఖముగా గడపంగను నేర్తు వీ భువిన్.

శా॥ నా మాటల్ విని యీతనిన్ విడువుమా ! న్యాయంబు ధర్మంబగున్
ప్రేమంజూపుము వీనిపైన, తగదీ భీతాత్ము చెండాడుటల్
గ్రామంబందు వసించు ముగ్ధ జనులాక్రందంబు నాలింపుమా
భూమీశా ! ఇది నాకు దేవతలకున్ భూతాలకున్ ప్రీతియౌ !

ప్రాసభేద కందము॥

శాసించకు జీవంబుల
నాశించకు దుష్ట శక్తు లాశ నిరాశౌ;
పోషింపుము ప్రేమ యెదను
వాసించును వచ్చు జన్మ వాంఛిత ఫలమై.

ఉ॥ మానుము బాలహత్య అభిమానము చూపుము తోటి వారిపై
మానుగ సర్వ మానవుల మంచిని గోరుము ప్రేమ పెంచి, నీ
మానస మందు నున్న పరమాత్ముడె సర్వ జనాళి నుండుటన్
మానవ సేవయే నిజము మాధవ సేవను సూక్తెరుంగవే !

వ॥ అని బ్రాహ్మణుండు సృష్టి స్థితి లయ కారణ తత్త్వంబును, సనాతన మత ప్రధాన ధర్మంబగు నహింస, జీవకారుణ్య సిద్ధాంతంబును, జగదధినాయకుండైన భగవంతుని సర్వ వ్యాపకత్వంబును విశదపరచి భూతబలి ప్రధానంబైన క్షుద్ర దేవతారాధానను ఖండించి, రాయపుత్రుని ప్రాణదానంబు చేయుట ధర్మంబని సూచించి యూరకుండిన, ఆ యద్భుత వాగ్ధాటికి సనాతన ధర్మ విశ్లేషణకు సేనాధ్యక్షుండు విభ్రాంతుడై, సంతుష్టాంతరంగుండగుచు,

564

## 26. సామంతుడు మునీంద్రుని వినుతి చేయుట.

మ|| ముని వ్యాసంగము కాకతీయునకు సమ్మోహంబు గల్పింప, ఆ
నన సీమాంకురమందు హర్షమున నానందంబు చిందాడగన్
ఘనవేదాంత సమీర ఘాతమున సాకల్యాంతరంగంబుతో
తను వుప్పొంగ మహా విభూతి మది నుత్సారించు భక్త్యాత్ముడై.

శా|| ఆనందాశ్రులు చెక్కుటద్దములపై నంకిళ్లపై వ్రాలగా
కౌనుందూగ, విశాల ఫాలమున నౌత్కంఠ్యంబు గన్పట్ట, ఆ
భూనాథుండు మునీంద్రు జేరి మన ముప్పొంగంగ సాష్టాంగియై
ధ్యానాంతఃకరణీయ యోగభవ తదాత్మ్యానుసంధానియై.

వ|| బహు ప్రకారంబులు బ్రాహ్మణుని పొగడుచు,

కం|| ముని పదములు విడువక నతి
వినయము కనబడ దళపతి వివశతతో నా
తని మనమున కలిగిన భా
వనలను తెలిపెను రసమయ వాక్యంబులతో.

ఉ|| నేటికి ధన్యమయ్యె మహనీయ తపోవిభవాత్మ! నీవు నా
వీటికి వచ్చి ప్రేమ కురిపించి వివేక వచః తరంగిణీ
ధాటిని అస్మదీయ మద తాడన చేసి విశిష్ట యోగమున్
పాటవ మొప్ప చాటితివి భాగ్యము నొందె మదీయ జన్మయున్.

ఉ॥ స్వామి మదీయ పాప పరిపక్వము నేడు ఘటించె తావకీ
నామృత వాక్కులన్ మదిని హర్షము నిండె, సనాతనార్య హిం
దూమత ధర్మ సూక్ష్మముల స్తోమత తెల్పి తరింప జేసి, నా
పామర వృత్తి బాపితివి ప్రాజ్ఞుడ నైతిని నీ కతంబునన్.

సీ॥ నేడుగా నా జన్మ నియమ బద్ధంబయ్యె
నిగమాగమాచార్య నియమ చర్య
నేడుగా నా బుద్ధి నీతి మార్గము బట్టె
సురగురు సన్నిభ సూరివర్య
నేడుగా ఈ జీవి కేడుగడ చేకూరె
నైకాద్భుత సమరనాట్యధుర్య
నేడుగా నా మది నెమ్మికి పొడసూపె
శ్రీ మహాదేవ గౌరీ సపర్య
తే॥గీ॥ నేడు నామద మాత్సర్య నిర్వృతయ్యె
నేడు నా మనస్సానంద నిలయమయ్యె
వేదవేదాంత ధౌరేయ ! విశ్వ వేద్య !
అవని నను బ్రోవ వచ్చిన అతివదాన్య !

ఉ॥ వందనమో మహావిభవ వర్ధన ! భారత తత్త్వ సంస్కృతి
స్యందనమందు పార్థివుని సంశయముల్ విడిపోవ నాడు గో
విందుడు గీత పార్థునకు విస్ఫుట దర్శన చేసినట్లు మా
కంద మధూ వచో నిరతి, కమ్మని సూక్తుల తెల్పినాడవే.

తే||గీ||

విశ్వ మానవ కళ్యాణ విభవ పతివి
ఆగమామ్నాయ సిద్ధ వేదాంత యతివి
కర్మ సిద్ధాంత నిక్షేప మర్మమతివి
ఏక మద్వితీయం బ్రహ్మ మెఱుక నీకు!

కం|| కదళీ ఫల సన్నిభమౌ
మధు మృదుల వచోరుచులను మతతత్త్వము నా
యెద నాటగ కదలించగ
మదమడగగ బోధచేసి మంత్రించి తహో !

నవనందిని||

పరశక్తు లెల్ల పరితాప భరమంచున్
పరహింస హేయమతి పాపకృతమంచున్
పరమేష్ఠి  నా హృదయ వ్యాపకుడటంచున్
పరమాత్మ నాకెరుగగా పలికి నావే.

వ|| స్వామీ ! తమ ఉపదేశంబులు నా జీవన విధానంబును దిద్దెను. నా జీవితాశయంబును మార్చెను. అది ఎట్లంటివేని,

ఉ|| చేసితి నేమొ శీతనగశృంగ నివాసిని సేవ కొంత, ఆ
యాసము లేక స్వర్గ విభవాస్పద సన్నిభ రాజ్య మబ్బె, ల
క్ష్మీసమ లక్షణాన్విత సుశీల కరంబు గ్రహించి, సాహసా
గ్రేసర శౌర్య ధైర్య వర కీర్తుల పుత్రుల గాంచి మించితిన్.

ఉ॥ పంటవలంతి పుణ్యమున పల్లెల కర్షక హర్ష మయ్యె, ఏ
తంటయు లేక రాజ్యరమ ధర్మపథమ్మున మెల్గుచుండ, నే
కంటక వృత్తి శత్రునృప కంఠవిలుంఠన కార్యవర్తినై
తుంటరి స్నేహ బృందముల దుర్నయ దుర్వ్యస నానుభూతితో.

సీ॥ నా యాజ్ఞ దాటని నాయక బృందంబు
విక్రమోన్నత శౌర్య వీరతతులు
కనుసన్న మెలిగెడు కామినీవ్రాతంబు
సతతమ్ము కొలిచెడి సన్నిహితులు
పేరు విన్నంతనే భీరులౌ శత్రువుల్
సమ్మాన మొసగెడి చక్రవర్తి
ఎన లేని యారోగ్య మేపారు సంపదల్
ఘనమైన విఖ్యాతి కలిగియుండి
తే॥గీ॥ మదము మాత్సర్య మత్యాశ యెదను నిండ
తృప్తి లేకుండ దుర్వార తృష్ణ తోడ
దుష్ట శక్తులు పొందంగ దురితమైన
తంత్ర విద్యల నాసక్తి తవులు కొనగ.

తే॥గీ॥ శాకినీ ఢాకినీ భూతచయము గొల్వ
మంత్రవేత్తల రావించి మంపు గొనుచు
ఘోర కాపాలికా పథ క్రూర కర్మ
చేయరానట్టి పాపాల చేసినాడ.

580

శా॥ నేనజ్ఞానత దుర్మదాంధత కృతానేకౌఘ దుశ్చారినై
రాణందేలుచు క్రూరతన్ పరమ మూర్ఖంబైన మార్గంబునన్
ఏనాక్షీ కుచకుంభ సౌఖ్యరతిలో ఏరాళముం దేలుచున్
నానాజీవుల హింస పెట్టి బలు లన్యాయంబుగా నిచ్చితిన్.

తే॥గీ॥ మధువు మాంసంబు మీనంబు మైథునంబు
హస్త ముద్రల క్షుద్ర విహారి నౌచు;
పాశుపత శాక్తేయతతుల పథము పట్టి
పంచపాతక పాపాల పాలుబడితి.

కం॥ ఇది సరిపోదని రౌద్రులు
మది నూదిన వారి మాట మంత్రంబనుచున్
పదియా రేడుల బాలుని
చిదుమంగను పూనినాడ సిద్ధులు పొందన్. 583

వ॥ ఆ సమయంబున నీ వరుదెంచి క్రతు నాయకత్వంబు చేపట్టి నీ ప్రజ్ఞా విశేషంబున అధ్వరంబు వేదోక్త ప్రకారంబు నిర్వహించి బలి కార్యక్రమంబు విఘ్నంబు చేసి మా అనాగరిక నాట్య ప్రదర్శనలను గర్హింపకయే, ఆర్య సంప్రదాయ విన్యాసంబుల మమ్ము సమ్మోహితులంజేసి మదీయ సంచితౌఘ వినాశన కాలంబును పూర్వ పుణ్య పరిపక్వ తరుణం బాసన్నంబగుట, నాకు

"ఓం తత్త్వమసి" యను సామవేదాంతర్గత ఛాందోగ్యోపనిష త్సంబంధ ఉపదేశ మహావాక్యంబున,
"ఓం ప్రజ్ఞానం బ్రహ్మ" యను ఋగ్వేదాంతర్గత ఐతరేయోపనిష త్సంబంధ లక్షణ మహావాక్యంబున,
"ఓం ఆయతాత్మ బ్రహ్మ" యను అధర్వణ వేదాంతర్గత మాండూకోపనిష త్సంబంధ అనుభవ మహావాక్యంబున,
"ఓం అహం బ్రహ్మాస్మి" యను యజుర్వేదాంతర్గత బృహదారిణ్యోపనిష త్సంబంధ సాక్షాత్కార మహావాక్యంబున గల అమృతోపమానంబౌ వేదాంత సూక్ష్మంబుల విశదపరచి,

శా॥ ఆద్యంతంబుగ తేటతెల్ల మగున ట్లద్వైత సిద్ధాంతమున్
విద్యాతీత విశిష్ట యోగ భవమౌ వేదాంత సారాంశమున్
సద్యద్బ్రహ్మ పథంబు, మిథ్యయగు విశ్వవ్యర్థమోహత్వమున్
ఉద్యత్ స్ఫూర్తిని బోధ చేసితివి నా యున్మాదమున్ బాపగా.

కం॥ వేదంబుల వాద్యంబుల
నాదంబుల సంప్రదాయ నాట్య ప్రభలన్
వాదంబుల వేదాంతము
మోదంబుగ తెల్పినావు మోహము తీరన్.

వ॥ అయినను యజ్ఞ వ్యర్థత్వంబునకు కారణభూతుండ వయితివని కొందరు తలంపవచ్చు, కాని నీవు ధర్మంబు రక్షించి నన్నుద్ధరించితివి. అది యెట్లనిన, 587

శా॥ విద్వచ్ఛ్రేష్ఠ! బలి ప్రధాన మఖమున్ విఘ్నంబు గావించి ఓ
సద్వంశంబును బ్రోచినావు, జననీ సంహూతు డాస్తీకుడున్
ఉద్వేగంబున పాండువంశజుని యజ్ఞోత్సన్నమున్ జేసి, జి
హ్వాద్వంద్వీయుల గాచినాడు తగవే న్యాయంబు ధ్యేయంబవన్.

## 27. సామంతుండు రాయకుమారుని విడిచి పెట్టుట.

శా॥ నాయభ్యున్నతి కోసమై ఋషివరేణ్యా ! నీవు కోరంగ ఇం
కే యభ్యంతరమున్ వచింపకయ నే నేకైక చిత్తంబుతో
నీయభ్యర్థన నాదరించెదను, వీనిం బ్రోచి రక్షించెదన్
నాయభ్యాగతు నిన్ను తృప్తి పరుపన్ నా రాజ ధర్మంబగున్.

వ॥ అంతియ కాక

శా॥ నీ యాజ్ఞన్ శిరసా వహించి యిక మున్నె నెట్టి జీవంబులన్
నే యాగంబుల నేతరిన్ బలులకై ఏ రీతులన్ ప్రాణముల్
తీయంబోవను, భైరవాది పరశక్తి ప్రోద్ధిత క్రీడలన్
చేయంగా సమకట్ట, సర్వజన సుశ్రేయంబె ధ్యేయంబగున్.

ఉ॥ బాలుని వెంటగొమ్ము నను పావన చేయుము క్షుద్ర శక్తు లే
మేలు వరమ్ము లిచ్చు నరమేధమె చక్కని మార్గమన్న కా
పాలిక మాంత్రికాధముల బైటకు నెట్టుదు, మానవాళి మా
పాలనలో మహాసుఖము పైకొన నేలుదు మన్యభూములున్.

గ్రామంబందున నుండెడి
ఘామండుల తోడ వీని గాణము తోడన్
భూమీశుడు మారె ననుచు
నా మాటగ చెప్పుమయ్య నమ్మిక పుట్టన్.

మన్యంబున చాటుము రా
జన్యుండిక ధర్మ మార్గ సంకల్పిత చై
తన్యుండై తన జనముల
వన్యంబుల నేలుననుచు వరవసితాఢ్యా.

కం॥ అని పరిపరి విధముల నా
ముని నాథుని నుతులు చేసి మురిపెము తీరన్
జన నాథుడు బహుమతులను
మన మలరగ నిచ్చి పనిపె మన్యము దాటన్. 595

## 28. వేము ముని రాయకుమారునితో మన్యము దాటి మలకపల్లె ప్రవేశించుట.

వ॥ అట్లు కాకతీయ ప్రతాపుండు తన్నునుప, వేము వంశ ప్రదీపుండు మలకపల్లి గ్రామ మార్గంబు పట్టి పోవుచు,

ఉ॥ బాలుని వెంటబెట్టుకొని బ్రాహ్మణు డంతట చేరె భూరి శా
ర్దూల సృగాల జాల గజ రోహిష భల్లుక వర్గ వాసమున్
తాల రసాల సాల వట దాడిమ కాంచన నారికేళ హిం
తాల తమాల విద్రుమ లతా కుసుమావృత మన్య ధామమున్.

వ॥ ఇట్లావని ప్రవేశించి, హరిత వర్ణంబును హరి నిలయంబును, మహా వృక్ష సముదాయ శోభితమ్మును మహా ఋక్ష విలసితమ్మును, దిక్కరోత్తుంగ పర్వత మేఖలావృత్తంబును మత్తకరి వాసంబును, కర్కశ శిలాఖండ సముదయమ్మును కర్కోటకాది మహా భుజంగ విహారంబును, ద్యుమణి మయూఖ నిరాకర సాంద్రంబును, వివిధ మణి ధాతు ఖనిజ గర్భితమ్మును, ఆఘ్రాణితానంద నానా సూన వితాన వాసనా సుగంధ మలయ మారుత సంసేవితమ్మును, వ్యాఘ్ర శార్దూల భల్లుక చమరీ మృగ భయదర్పిత ఘోషా వ్యాపితంబును, వియత్పతిత వర్ష బిందు సందోహ సముదాయ జాత జలపాత నిర్ఝరిణీ ప్రవాహ నిమ్న ప్రదేశ వాటికా నిలయమ్మును, అమిత సుందర మనోహ్లాద కమలేందీవర షండమండిత కాసార మనోజ్ఞంబును, పిక శుక కాక కోకిల కుక్కుట మయూర గండభేరుండాది అండజ మండితమ్మును, గోండు కోయ సర బర్బర ప్రముఖ పర్వతపుత్ర వాసంబునయి సర్వాలంకార భూషితయై ప్రకృతి కాంత నితాంత సంతోషాంతఃకరణియై ఏకాంత శయనాంతః పురమందిరంబున నిర్భయంబున శయనించెనో యన, పర పురుష దుర్భేద్యంబైన కాననంబున,

కం॥ బిలబిల చిలుకల పలుకులు
కిలకిల కులికెడు పులుగుల కెలవుల రవళుల్
అలనల వెలుతురు నీడలు
జలజల వ్రాలెడు సుమములు చలిచలి గాలుల్. 599

కం|| తలతల తగిలెడు తరుశా
ఖలలో లతలత ముడివడి గాలికి కదలన్
మెలతల వలపుల కలిసిన
పులకింతల దూగు పురుష పుంగవుల బలెన్.

వ|| ఆ విధి నందన సుందరంబైన వనంబును దాటుచు ప్రకృతి సందర్శనానంద తత్పరత మార్గ శ్రమంబెరుంగక, కురుచ కాలంబుననే

ఉ|| ఆ వనకాంత సోయగము లా మధుమాస విలాసలాస్యముల్,
భావ పరంపరా హృదయ పల్లవ రంజితరాగ మాధురీ
రావము లుప్పతిల్లగ, ధరామర రాయకుమారులంత గో
దావరి నిమ్నగా విమల ధామము చేరిరి నందికేశమున్.

తే||గీ|| చేరి తిలకించి పులకించి శిరము వంచి
నంది వినుతించి నుతియించి నయము మించి
భవుని భజయించి ప్రణుతించి పరవశించి
బాలు క్షమియించి కరుణించి పనుపు మనుచు.

కం|| నంది వివర్ధను యోగా
నందుని ఇందుధరు నర్ధనారీశ్వరునిన్
మందార కుసుమ శోభితు
నందీశ్వర నామధేయు నాగ విభూషుణ్. 604

కం|| అత్తరి స్తుతించె విప్రుడు
కృత్తత్రిపురుని, మదేభ కృత్తి వితానున్
నృత్త సుమాళావృత్తుని
వృత్తభుజంగున్, భుజంగ వృత్తంబులతో.

భుజంగ ప్రయాత వృత్తమాలిక||
భుజంగంబులే హారముల్ భూత సంఘం
బు జంగంబులున్ పంచభూతంబులున్ పై
తృ జాలంబులున్ నాట్య బృందంబులై శై
ల జార్ధంబుతో నీవు లంఘింపగా అ
ర్ధ జైవాత్రకుండాడ దింధిక్క దింధి
క్క జాళ్వాల మద్దెళ్లు కంపింపగన్ వి
ష్ణుజా ధారలన్ ధాత్రి శోభిల్ల భక్తిన్
అజుండున్ ఘనశ్యామలాంగుండు దేవ
ర్షి జంభారి సంఘంబు సేవింప నందీ
శు జోహారు భృంగీశు స్తోమంబు స్కంధే
శు జేజేలు విఘ్నేశు శుండాల శీర్షం
పు జాతవ్య ఘీంకార ముల్లంబరంబం
దు జృంభింప సంసార దుఃఖఘ్న ! ఓ శై
ల జామాత ! నీ నాట్యలాస్యంబు శ్రీ శై
లజా మాత క్రీగంట లక్షించుచో అం
గజానంద శృంగార కంజాక్షి యయ్యెన్
ప్రజా క్షేమమోదంబు ప్రాప్తించె భూ మా
త జంజాటమున్ మాన్పి ధర్తింపుమో దే
వ ! జోబిళ్లు సేతున్ శివా ! కృత్తివాసా !

అజస్రంబు నీ నృత్త మానంద కంద
బు జన్మంబు ధన్యంబు పూర్ణంబు కాగా
సజావై మనోనేత్ర సంయోగ మౌన
ట్లు జోజో వరంబిమ్ము, లోకేశ యీశా !
అజేయా ! మహేశా ! మహాదేవా దేవా !

*భుజంగ ప్రయాతము||
నమో దేవదేవా ! ఘనా దీనబంధూ !
మమున్ కావరావా ! సమగ్ర ప్రభావా !
తమిస్రా వినాశా ! సదాశాంతి దాతా !
సమజ్ఞా వదాన్యా ! అసాధ్య ప్రదానా ! 607

సీ|| ఒక వంక నెలవంక ఒకవంక సురగంగ
శిరమున చెలగంగ శివు డనంగ
ఒకవంక హిమజాత ఒకవంక గణరాజు
విస్రబ్ధ మూర్తులై వినతి చేయ
ఒకవంక నందీశు డొకవంక స్కంధేశు
డాది దేవుని కీర్తి నాలపింప
ఒకవంక చాముండి ఒకవంక చర్చిక
పరిచర్య సేయంగ నొరిగి యుండ
ఆ||వె|| యతులు, త్రిదిశ తతులు అంతర్ముఖస్థులై
ఆత్మ లోన నామ మాలకింప,
కొలువు తీరియున్న కుసుమాస్త్ర సంహార
నంది శైలవాస వందనమ్ము.

---

* స్రగ్విణీ గర్భిత భుజంగ ప్రయాతము వివరణ-7 చూడుడు.

వ॥ అని యీ విధంబున కొంత కాలంబు ధ్యానాధ్యయన స్తోత్రంబుల నందీశ్వరుని సంతృప్తి పరచి ఆ బ్రాహ్మణోత్తముండు రాయ కుమారునితో గోదావరి నిర్గమించి పోలవరంబు దాటి హుటాహుటి మలకపల్లె చేర.

ఆ॥వె॥
వేము వంశవార్ధి సోముని దర్శింప
మలకపల్లి ప్రజయు వెలికి వచ్చి,
రాయసుతుని బ్రోచి రక్షచేసిన వాని
తనివి తీర మ్రొక్కి ధన్య మయిరి.

వ॥ ఆ సందర్భంబున గ్రామ ప్రాంగణంబున ప్రోవైన పుర ప్రముఖులు స్వస్తి వాచకంబులతో, స్వాగత వచనంబులతో స్వామి నాదరించు తరి, సకుమార బ్రాహ్మణాగమనంబు విని, రాయ కుటుంబంబు పరుగున నేతెంచి,

## 29. రాయుడు మునికి కృతజ్ఞతలు తెల్పుట.

ఉ॥ చూచిరి రాయుడున్ సతియు సుందర రూప కుమారు, మోమునన్
పూచిన నవ్వుతో నొనరు పూర్వ విచార విముక్త దేహునిన్,
మోచిత చండికా యజన మోహన దివ్య శరీరు, తావులన్
లేచిన ప్రాణముల్ తిరిగి లీలగ లోనికి పోయినట్లుగన్.

వ॥ ఆ సమయంబున రాయకాంత అంతరంగం బుప్పొంగ వేగంబున పుత్రు డాసి మాటలు తడబడ నిట్లనియె.

శా॥ ఎన్నాళ్లైనది చూచి నిన్విడిచి నేన్నెన్నండు లేనోయి ఓ
కన్నా రమ్మని కౌగిలించి తనయున్ కన్నార వీక్షించుచున్
చన్నుల్ చేపగ మూర్ధచుంబనల వాత్సల్యంబు దీపింపగన్
అన్నారీమణి యేడ్చె బావురనుచున్ వ్యాలోల సోత్కంఠియై.

వ॥ అంత,

శా॥ అస్తోకాంబుధి పూర్ణచంద్రు గనినన్ హర్షించు చందంబునన్
అస్తవ్యస్త జగత్తు నున్న జనకుం డా డింభకుం గాంచుచున్
హస్త ద్వంద్వము సాచి మోదమున నాహ్వానించి యుద్దీప్తుడై
మస్తిష్కంబును చెక్కిలిన్ నెమరుచున్ మారాడ నిర్వేదుడై.

తే॥గీ॥ కొంతకాలంబు పుత్రుని కూర్మి చేర్చి
ఆ పరిష్వంగ సౌఖ్యంబు ననుభవించి
మ్రోల నున్నట్టి గురువరు మోము గాంచి
సుతుని తోడను మునినాథు నుతులు చేసె. 617

కర్ణాట చౌపదులు॥

గురుని పాదాలపై కోరికల్ తీర
ఒరిగె రాయుడు భక్తి యుల్లసిల్లంగ
నరుడు గా డీతండు ననుగన్న తండ్రి
నరపతిని మెప్పించి నా పుత్రు గాచె.

పురహరుని యంశ మీ పరమ పావనుడు
పరుల కెట్లౌను ఈ నరమేధ మాప
సురుల కైనను లేని స్ఫూర్తి యీతనిది
మరి యెట్లు తీర్తు నీ మహనీయు ఋణము.

పాదాలు వీడకయె ప్రార్థనలు చేసి
వేదాల రూపుడని వినుతించి యపుడు,
ఎద నున్న యానంద మెగసి పైబడగ
కదలంగ నయనాల కన్నీరు గార్చి. 618

వ|| తనలో ఇట్లని తలంచె.

చతుష్పదులు||

మా పుణ్య భాగ్యమై మా గురువులు
మా పురములోన కాపురంబుండి
మా పౌరులందు మక్కువను జూపి
మాపు రేపనక మము గాచినారు.

మా పాప డిపుడు మన్యంబు పోవ
పాపాత్మ డంత బలికి బంధింప
ప్రాపుకై నేను ప్రార్థించి నంత
కాపాడ గురుడు కదలె తా నడవి.

తీపార నటన ధీరుడై చేసి
ఉపనిషత్తులను ఉపదేశమిచ్చి
ఏపుగా బలిని ఆపు చేయించి
మా పుత్రు తెచ్చి మా కిచ్చినారు.

ఏ మందు నే నికే మందు నిపుడు
ఏ మివ్వగలను ఏ రీతి తీర్తు
ఈ మూర్తి దయకు ఏ మిచ్చు కొందు
ప్రేమింత చింద వేమారు కొలుతు.

ఆ॥వె॥ అనుచు రాయు డంత అంతరంగంబందు
గురుని తలచి యొడలు గరులు పొడువ
కండ్ల నుండి వేడి కన్నీళ్లు కారంగ
కనులు మూసుకొనుచు కదలకుండ.

త్రిపదులు॥ కొంతకాలం బట్లు కూర్చుండి మ్రొక్కుచు
నింతలోనను లేచి నిలిచి
యెంతయో భక్తితో నపుడు.
వినయాన వినుతించి విశ్వాస మొనరంగ
మనసంత మౌనిపై నిలిపి
తన పత్నితో గూడ కొలిచి,

వ॥ ఇట్లని స్తుతించె. 623

సీ॥ ఇతడెగా నావెత నీడేర్ప మన్య దు
ర్గంబు హుటాహుటి కదలినాడు,
ఇతడెగా రెడ్డి వాహిని భర్త ప్రౌఢ వా
క్చాతుర్య గరిమకు చాలినాడు,
ఇతడెగా భైరవీ క్రతువు యాజ్ఞికమును
ప్రీతి చేపట్టి మెప్పించినాడు,
ఇతడెగా మన్య మహీపాలు తన నాట్య
విన్యాస కలిమితో వెరగు పరచె,
తే॥గీ॥ ఇతడె అద్వైత సారంబు నినుమడించి
విశ్వ ధర్మంబు రాజుకు విశద పరచె,
ఇతడె క్రూర కబంధ నరేంద్రు కలుష
హస్తముల నున్న నాపుత్రు నాదుకొనియె.

ఉ|| చేకొని వచ్చె నా సుతుని చేతుల నెత్తి నమస్కరించెదన్
మా కులవర్ధనుం డితడు, మమ్ముల బ్రోవ తలంచు వీరభ
ద్రాకృతిగాని వేరొకరు డా శిశు హంత నివాళు లందుచున్
చేకొనిరాడు వధ్యశిల చేరిన మృత్యు ముఖాంతరాయువున్.

*తే||గీ|| గురుని ఋణ మెట్లు తీర్తును కరుణ నతడు
నా కొమరుని కాకతి పృతనావరు సభ
బలి పశువును భూవరుని ప్రపత్తి గొనుచు
విడివడగను చేసెన్ గదా వింత గాదె.

మధురాక్కర||
ఇతడు పరమ పవిత్రుడు హితుడును గురుడు మాకు
వెతలు పడనీక నిరతము ప్రేమతో బ్రోచు మమ్ము
ఇతర దైవంబు నెరుగము ఈతడే దిక్కుమాకు
ప్రతిదినమ్మును మ్రొక్కక బ్రతుకంగ నేరమయ్య.

వ|| అని ఇట్లు స్తుతించుచు, ఆనందాశ్రువులతో గురుని పాదంబులను సేవించుచున్న సమయంబున, 628

---

*కందగర్భిత తేటగీతి. వివరణ-8 చూడుడు.

## 30. మలకపల్లె పౌరులు వేము మునిని ప్రశంసించుట.

చ|| పురవరు లంతటన్ వినయ పూరిత వందన మాచరించి రా
పురహార భక్తుకున్ పురుష పుంగవ మూర్తికి రెడ్డి రాజ్య భూ
వరకరబద్ధ రాయసుతు బంధవిమోచన పుణ్యశీలికిన్
సురుచిర రూపతేజ పరిశుద్ధ తపఃఫల పూర్ణయోగికిన్.

వ|| మనః పూరక నమస్కారంబుల మదన దమన నామ మననా నందుండైన మునినాథు ఘనతను వేనోళ్ల వినుతింపంబూని యిట్లనిరి. 630

ఉ|| ద్వాపర కల్ప మందున కృతాంతుని సన్నిధి జేరినట్టి సాం
దీపని నందనున్ ప్రతిభ తీర్పడ ప్రాణము లిచ్చితెచ్చె నా
గోపకుమారు డా పగిది ఘోరకలిన్ మన వేము వంశ సం
దీపుడు తెచ్చె శిష్యసుతు తెంపరియై నరమేధ మాపుచున్.

మ|| ప్రళయాగ్నిచ్ఛట భంగి నర్జునునిపై రాముండు దండెత్తి ఆ
యిలనాథుం దునుమాడి ధేనువును తెచ్చిచ్చెన్ పితౄణంబుగా
బలిబాధా పరితప్తు రాయసుతు భూవాల్లభ్యు నొప్పించుచున్
విలయంబేమియు లేక తెచ్చె తరమే విప్రున్ ప్రశంసింపగా.

ఉ|| నిండు మనమ్ము తోడ మహనీయ కృపాత్మత రాయపుత్రునిన్
మండిత పాండితీ మహిమ మండల నాథు ననార్య దూష్య పా
షండ వితండ తాండవ విజాతి వికార విషాద వేదనల్
ఖండన మాచరించి శిశుకంఠ విలుంఠన మానిపించెనే.

ఉ॥ దక్షుడు, ధారుణీ సురుడు, దాత, ఉదారుడు, ధర్మపాలనా
దక్షుడు, దుష్ట మార్గగత దంభ నృపాల వివేక శిక్షణన్
దక్షుడు, క్రూర యజ్ఞ మద దర్పిత దక్ష వినాశనక్రియా
ధ్యక్షు కృపావిశేష భవితవ్య విభూతి విరాగ చక్షుడున్.

కం॥ మా జన్మ ధన్య మయ్యెను
మా జీవన సరళి క్రొత్త మార్గము పట్టెన్
జేజేలు నీకు భూసుర
పూజింతుము నిన్ను ప్రేమ పూతచరిత్రా.

శా॥ నీ మూలంబున మల్కపల్లె బహుధా నిశ్రేయస శ్రీసఖీ
ధామంబై విలసిల్లె మా ప్రజలు నీ దైవత్వ తత్త్వజ్ఞతా
ప్రామాణ్యంబున ధర్మమార్గ గతులై బ్రహ్మత్వ జిజ్ఞాసులై
రీ మాయావృత మేదినీ విషయ రాగేచ్ఛన్ విసర్జించుచున్.

ఉ॥ అందున నీవు రాయవిభు నందరి కన్నను మిన్నజేసి యు
న్నందున వా డమంద కరుణాంబుధి గ్రుంకి విశేషభక్తి నీ
యందున బూని ఇంద్రియ సుఖాగ్నుల నాహుతి గాక ప్రాజ్ఞుడై
డెందమునందు నందిరథు డింగరియై విహరించు నేతరిన్.

శా॥ నానాసూనము లందు వ్రాలి మధుపానానంద సంతృప్తముల్
తేనీగల్ వలె గాక, యేక గురు వర్తిష్ణుం డభిష్వంగుడై
స్నానంబాడును వీడహర్నిశము నీ తత్త్వామృతాంబోధిలో
జ్ఞానోత్పాదిత శేముషీ విభవ మోక్ష ద్వార లక్ష్యంబునన్.

శా।। కాంతా పుత్రుల క్షేమముల్ సతత సౌఖ్యప్రాప్తి సంతోషముల్
స్వాంతంబందున కృత్తివాసు నిజదీక్షా యోగ సౌభాగ్యముల్
వంతల్ లేక చరించు వీడెపుడు నిర్ద్వంద్వ ప్రభారాశియై
అంతేవాసిగ నిన్నుగొల్చు భవితవ్యంబబ్బ యోగీశ్వరా !

కం।। భారంబౌ సంసారపు
పారావారంబు నీదు ప్రావీణ్యంబున్,
ఆరాధిత గౌరీశ్వరు
స్మేరార్ణవ కృపను తేలు మేధా ప్రజ్ఞల్.

కం।। మా రాయని కిచ్చి కృపా
పారీణత వాని సాక పరిపరి విధముల్
ఏ రీతి తీర్తు ఋణ మను
నారాటము చెంద మాకు హాస్యాస్పదమౌ. 641

## 31. వేము ముని విగ్రహమును రాయ వంశము పూజింప నిశ్చయించుట.

ఉ।। ఏ విధి నిన్ను గొల్తు నని, యేవిధి నీ ఋణముక్తి పొందగా
బోవుదు నంచు రాయుడు ప్రభూత కృశాత్మత క్రుంగ నేల, నీ
కేవిధమైన నస్థిర ధనేహల యందు జుగుప్స యౌట, నీ
కీవియె గాని పుచ్చుకొను నిచ్ఛయు లేదని వాడెరుంగడే !

ఉ।। ఐనను వాని తృప్తి కొరకై యొక మార్గము చెప్పు వార మీ
రౌనని కాదనంగ వలదయ్య మహామహితాత్మ ! భక్తితో
పూనిన వేడ్క తోడ నినుబోలిన విగ్రహమున్ రచించి, నీ
యానను గొల్చు వీడు గృహమందున నుంచి విశిష్ట నిష్ఠతో.

చం।। ఇతడును, పుత్రుడున్ వరుస నీతని పుత్రులు, పుత్రు పుత్రులున్
వెతలను బాసి శాంతి సుఖవృద్ధికి వంశ పరంపరాదిగా
సతతము నిన్ను గొల్చుటకు శాశ్వత రూపము చేయ శిల్పికిన్
అతులిత కుందనమ్ము నిదె యర్పణ సేతురు మా పురీవరుల్

కం।। ఆమాట విన్న రాయుడు
ఆమోదంబున కృతజ్ఞతార్ణవు డగుచున్
ఆ మోతుబరుల మధుర
ప్రేమాదర హావభావ ప్రేక్షణపరుడై.

శా।। ఆనందించెను రాయుడంత తనపై నాప్యాయమున్ జూపు పౌ
రానీకంబును గాంచి జన్మ సఫలంబైనట్లు భావించుచున్
ఆనందించెను వారు చెప్పిన హితంబాలించి సంతృప్తి, యో
గానందేశ్వరు మోముగాంచి హృదయంబాపోవ కేల్మోడ్చుచున్.

మ।। మన మువ్పొంగగ నిట్లనెన్ గురుని సమ్మానించి, ఈ చంద్రుడీ
యిను డీ ధారుణి సాక్షి ఈ ప్రతిన నే నీడేర్చెదన్ నా కుటుం
బినితో గూడి కృతజ్ఞతా నిరతి శోభిల్లంగ మా వంశజుల్
మునిరాజ ప్రతిమాకృతిన్ నియతులై పూజింతు రే ప్రొద్దునన్.

వ।। అంత,

కం।। రాయుని మాటల కలరిరి
ఆ యూరి జనులు యువకులు ఔత్సాహికతన్
జే యంచు నాడిరపు డా
రాయసుతుడు తండ్రి ప్రతిన రహి రెట్టింపన్. 649

# 32. మలకపల్లె సుందరాంగులు మునిని సేవించుట.

కం॥ ఆలోన పల్లె లోపలి
లోలాక్షులు సొగసు లొలకు లోలక కర్ణుల్
వేలాయుత కుచధీరలు
లీలాచలిత కచభార లిప్త సుగంధుల్.

కం॥ ఇంతుల వదనము శశి పూ
బంతులు వారి కుచముల్ రవంతలు నడుముల్
దంతములు వజ్ర పంక్తులు
కంతుని కాంతను హసించు కంజదళాక్షుల్.

కం॥ ఆ లేబ్రాయపు సుదతులు
నీలోత్పల వదన కాంతి నిగనిగ లాడన్,
ప్రాలేయ కుసుమ కోమల
చేలాంచల తను మనోజ్ఞ సీమంతినులై.

కం॥ విచికిల కిసలయ వేణీ
నిచయము చిలువల విభవము నిరసన చేయన్,
కుచముల సౌష్ఠవ సంపద
అచలములన్ గ్రేణి సేయ ఆ యెలనాగల్.

కం॥ చెంపకు చారెడు కన్నులు
సంపగి పూవంటి ముక్కు సరిసిజ ముఖమున్,
సొంపుల నింపెడు చనుగవ
ఇంపగు రాయంచ నడల నింతులు రాగా.

కం॥ కులుకుల తనులత తడబడ
విలసిత ముఖసరసిజరమ విందులు చేయన్;
పులకిత కుచభర యుగళులు
మలయజ లతికా వితాన మాధురు లొలకన్.

కం॥ కిలకిల పలుకుల మెలతలు
అలనల నడయాడ పైట లదురు పడంగన్,
ఎలనాగలు వలపు చిలుక
నలదిన కస్తూరి తావి యలజడి రేపన్.

ప్రియంవద॥
కవిలవర్ణ ముఖకాంతి లాస్యముల్
భువన మోహన విఫుల్ల హాసముల్
పవన లోలిత విపంచి రాగముల్
యువక మానసము లుల్లసిల్లగా

657

పంచచామర మాలిక॥
సరాగ రాగ మాధురీ ప్రసార సార రావముల్
మరంద పూర పుష్పగంధ మత్త భృంగ జృంభణల్
మరాళ రాజ రాజస ప్రమత్త మందయానముల్
వరాంగనా వసంతతాప పంచబాణ సాయకా

తరంగ రంగ భంగ బాధితాంతరంగ భంగిమల్,
సురాంగనా సరాళ రూప సుందరీ సుగంధముల్
పురారి పాద యుగ్మ ఫుల్ల పుండరీక శీర్షుడౌ
గురూత్త మాంఘ్రి చంద్రికా చకోరులై చలించుచున్.

వ॥ అరుదెంచి ఆ మదవతులు,

చం॥ వెనుకటి జన్మ లందు నృపవీరుల శాంతనవున్, పురూరవున్,
మునివరు గాధినందనుని, ముగ్ధ కుమారుని ఋశ్యశృంగునిన్,
పనిబడి బ్రహ్మచర్య పథ భంగ మొనర్చిన దివ్యకాంత లీ
తనువున మౌని జూచి అనుతాప భరమ్మున మ్రొక్కిరో యనన్.

కం॥ గాజులు గలగల లాడగ
రాజిత కరయుగముల మునిరాజ పదంబుల్
పూజించిరి లాలసలై
లాజుల కుంకుమ సుగంధ లతికాంతములన్.

కం॥ ఉల్లము ఝల్లన తనులత
వల్లరి యుల్లాస లాస్య వైచిత్ర్యంబై
మొల్లల మాలతి మల్లెల
జల్లులు కురిపించి రపుడు జలజదళాక్షుల్. 663

ఉ॥ పూత సుగంధు లా పగిది పూత చరిత్రుని కొల్వ, లాహిరీ
పాత నిపాత లాస్యమున పాతరలాడు కుచద్వయిన్ గనన్
ద్వైతమతానుభూతి యని తల్చిన తల్వగ వచ్చు గాని, అ
ద్వైతమె సూచ్యమౌను గురుతత్త్వ తదేక మనమ్ము నెంచినన్.

## 33. వేము మునికి మలకపల్లి ప్రాంత ప్రజలు సభా సత్కారము చేయుట.

వ॥ ఇట్లనేక ప్రకారంబులు గ్రామవాసులు స్వామి నారాధించి, తదుపరి సభా సత్కారంబు చేయ నిశ్చయించి,

ఉ॥ శ్రీయుత కీర్తియైన ముని సింహుని జేరి మహోత్సవంబుగన్
రాయుడు బందుగుల్ సఖులు రాయతనూజుడు వాని మిత్రులున్
తోయరుహాననా చయము తోడ్కొని పోయిరి యూరిలోనికిన్
గాయక వాద్య నాట్య సహకార పురస్సర వేద ఘోషతో.

వ॥ అంత రాయుడు తన భార్యను వేము వారి ఆశ్రమంబున కేగి అచటి స్త్రీ బంధు జనంబుల సభకు సగౌరవంబుగా తోడి తెమ్మని పుత్తెంచిన,

మ॥ కుసుమాలంకృత నీల మేఘ కబరీ కూలంకషా వేణులై
కుసుమాంగుల్ తనవెంట రాగ చనియెన్ కుంభస్తనీభారయై
వసుధానిర్ఝర వాటికిన్ ప్రముదిత వ్యాలోల తన్మంగి, రా
యసతీరత్నము మౌనిపత్ని సభ కాహ్వానించు కార్యార్థమై.

ఆ॥వె॥ అటుల రాయకాంత అపరూప బహుమాన
వస్తుచయము గొనుచు, వాద్య తూర్య
ఘోష లలరుచుండ, భేషజమ్ము విడిచి
నడిచె గురుని యింటి నడవ కడకు.

ఉ|| ఆ విధి నిల్లుజేరి మదనాంగులు తెచ్చిన పెట్టెలందు ర
త్నావళులాదిగా గల యనంత వినూతన తారహారముల్
పూవులు పండ్లు కుంకుమము పూతచరిత్ర మునీంద్రు పత్నికిన్
వావిగ నిచ్చి రాయసతి బ్రాహ్మణి క్షేమము తెల్పి యిట్లనెన్.

మ|| మునికాంతా! మహిమాన్వితుండు మన వేము స్వామి మా వారిపై
ననురాగమ్మున మన్యకానన మహాహంకార దుర్గాధినా
థుని వాక్ప్రౌఢిమతో జయించి నటనోద్భూతాద్భుతోద్బోధనా
ఘనచాతుర్యమునన్ కుమారు విడువంగా చేసి రక్షించెనే.

కం|| చతురుడు చతుర్విధ నట
ప్రతిభుడు పశుపతి పదయుగ పద్మాశ్రితుడున్,
అతులిత సంయమి వరుడును
ఇతరుల కెట్లౌను సుతుని ఈవిధి బ్రోవన్.

వ|| ఈ అసమాన వాత్సల్యంబునకు మేము జన్మ జన్మల మీకు మ్రొక్కినను మీచేసిన ఉపకారంబు తీరద దట్లుండె

మ|| మన గ్రామస్థులు స్వామివారి నిపుడే మర్యాదతో భక్తితో
ఘనమౌ రీతి కృతజ్ఞతల్ తెలుప సత్కారించు చున్నారు, నే
మనవారందరి తోడి తెచ్చుకొరకై మాతా యిదే వచ్చితిన్,
వినుమమ్మా ! తమరాకకై సభికు లువ్విళ్లూరుచున్నారికన్.

వ|| అని విన్నవించి, ఆ పతివ్రతా లలామను తక్కుంగల కుటుంబికుల నాయత్తపరచినంత, 675

కం।। మంజిష్ఠా బృందిష్ఠము
రంజిత రమణీయ శకట రాజము మీదన్
కంజదళాక్షులు వెడలిరి
రంజౌ జవనాశ్వతతుల రౌతులు నడపన్.

వ।। ఆలోన,

ఆ।।వె।। రాయసుతుని గాథ రయమున వ్యాపింప,
పరిసరాన నున్న పల్లెటూళ్ల
ప్రజలు కూడి పరుగు పరుగున వచ్చిరి,
బ్రోచినట్టి యతిని చూచి పోవ.

వ।। అదే విధంబున మలకపల్లె గ్రామంబున నుండెడి వివిధ వర్గంబులు తండోప తండంబులుగా నుత్సాహంబున యుత్సవంబున పాల్గొను కోరిక తమ తమ పనులు మానుకొని గ్రామ మధ్యంబున సమకూడ నారంభించిరి.

తే।।గీ।। పాలు పితికెడి పనిలోని పాలెగాళ్లు
పెయ్యలను కట్ట మరచిరి పెనల తోడ;
గడ్డి కోయ నేగిన ఆడుబిడ్డ లెల్ల
బుట్టల కొడవళ్ల విడిచి పెట్టిరపుడు.

తే।।గీ।। ఎరువు నింపిన చేలలో నేరువాక
లంత మధ్యలోన నిలిపి హాలికులును,
యాజమాన్యంబు పిలుపు లక్ష్యంబు లేక
ఉత్సవంబును చేరంగ నురికినారు. 681

పణవము||

గ్రామంబందున గల ఖామందుల్
భామా పుత్రులు పరివారంబుల్
స్వామిన్ జూడగ పరువెత్తంగా
రామందాడయె రహదారంతన్.

వ|| ఆ ప్రకారంబుగా బహుళ జన సందోహంబైన యుత్సవంబు గ్రామ మధ్యంబున నేర్పాటు చేయబడిన సభా మండపమునకు పయనించె.

ఉ|| ఉత్సవమంత గ్రామమున నున్న సభాస్థలి చేర, పౌరులున్
ఉత్సుకతన్ మునీంద్రుని మహోజ్వల వృత్తిని కీర్తి చేయుచున్
తత్సమయంపు పుష్పిత వితాన కదంబ సుగంధ మాలికా
వత్సుని ఉన్నతాసనముపై నధిరోహితు చేసి రుద్ధతిన్.

ఉ|| మానుగ మౌని నో యువతి మంచి సుగంధ విలేపనమ్ములన్
మేను నలంద, వేరొకతె మెల్లన కస్తూరి బొట్టు దిద్దె, స
మ్మానిత పౌర కుట్టిమ సమజ్య సమున్నత రత్న పీఠికా
సీనుని వస్త్రయుగ్మములచే నొక భామ అలంకరించినన్.

రథోద్ధతము||

మౌని కంఠమున మల్లె దండలన్
పూని ముచ్చటగ పుండరీకముల్
మానుగా సురభి మంచి గంధముల్
చాన లాయెడను సంతరించగా 686

వ|| అంత గ్రామ ముఖ్యులు, ఆహ్వానిత పరిసర గ్రామ జన ప్రముఖులు, ఉత్సవ కార్యక్రమోద్యోగ నిర్వాహకులు వివిధ తెరంగుల బ్రాహ్మణుని ఆరాధించి, సత్కరించి, ఉపన్యాసంబులు చేయదొడంగిరి.

నవనందిని||

వినయంబు తోడ సభలో వివిధ వక్తల్,
మననంబు చేసిరి మహామహుని కీర్తిన్;
పునరుక్తి దోష విరతిన్ పొగడినారల్,
ఘను వేము వంశు ప్రతిభన్ కథల తోడన్.

సీ|| ఒక వక్త వివరించె నొడుపుతో విప్రుని
వేద విద్యా ప్రౌఢ వినుత గరిమ,
ఒక ఉపన్యాసకు డోజతో వర్ణించె
బ్రాహ్మణు మంత్ర తంత్ర ప్రతీతి,
ఒక కవి వినిపించె నుద్ధతి భూసురు
బహుభాషా పాండిత్య పాటవమ్ము,
ఒక నాట్య ధౌరేయు డుగ్గడించెను స్వామి
బహు విధ నటనా ప్రపంచ మహిమ,
తే||గీ|| ఒకడు శివతత్త్వ మెరిగిన యోగి యనియె,
ఒకడు జీవకారుణ్య ప్రయోక్త యనియె,
ఒకడు తమ యూరి సౌభాగ్య మీత డనియె,
ఒక్కడొక్కొక్క ప్రతిభను నొక్కి పలికె.

మందాక్రాంత||

వక్తల్, మేధావులు, కవులు, సర్వజ్ఞ సంగీత గానా
సక్తుల్, వేదాంతులు, యతులు, సంసార గాఢాంధికా ని
ర్ముక్తుల్, స్వాధ్యాయులు, ఋషులు, ఆముష్మి కాలోచనా సం
పృక్తుల్, వేమూద్వహు బహువిధిన్ ప్రీతి చేయంగనంతన్

మేఘ విస్ఫూర్జితము ||

మునీంద్రున్ వాగ్గేయంబుల కవులు సమ్మోదితున్ చేయుచుండన్
మనీషిన్ మేధావర్గము మధుర నామంబులన్ మెచ్చుచుండన్
వినీతున్ యోషారత్నములు కడు నిర్వృత్తులై సత్కరింపన్,
అనన్యంబై యొప్పెన్ సభ, యతిముఖంబంత వెల్గొందు చుండన్ !

వ|| ఆ సమయంబున వృద్ధ పౌరుడొక్కరుడు స్వామికి ప్రణామ పురస్సరంబుగా నిట్లు విన్నవించె.

శా|| దేవా! మీ చరితమ్ము ఈ పురికి ఖ్యాతిందెచ్చె, ఇంకెన్నడున్
రావీ రోజులు, చూడ మా బ్రతుకులా ప్రారబ్ధ పాశావృతా
జీవాలై చనె నిన్నినాళ్ళుగ, ఇకన్ శేషించు సంసార పా
రావారమ్మును దాటు ముక్తి పథమున్ రంజిల్ల బోధింపవే.

కం|| వినగన్ వీనుల విందై
కనగన్ భావంబు మనోజ్ఞ కమనీయంబై
మనమున మననము మధువై
తనువుల్ పులకింప జేయు తమ భాషణముల్. 694

కం॥ మిమ్ముల జూడగ ముచ్చట
గమ్మున పరువెత్తి వచ్చి గౌరవ మొప్పన్
ఇమ్ముల జేరిన జన సం
ఘమ్ముల కాదేశ మిమ్ము కరుణాసాంద్రా !

ఉ॥ పామరు లైన మాకు సులభమ్ము, సనాతన శాస్త్ర బద్ధమున్
భామలకైన ఆచరణ పాత్రము, మోక్ష విధాయకమ్ము నై
నీమము లేక సంతతము నిర్వృతి గొల్పెడు తత్త్వమార్గమున్
ప్రేముడి తెల్పగోరెదము ప్రేక్షిత మాత్ర కటాక్ష రక్షణా.

# 34. పామర ప్రజకు వేముముని భక్తిమార్గ ప్రాముఖ్యము వివరించుట.

వ॥ అని ప్రార్థించిన బ్రాహ్మణుండు ప్రజలు తనపై జూపిన ఆదరాభిమానంబులకు సంతుష్టాంతరంగుండై ముఖంబు దేదీప్యమానంబై ప్రకాశింప, కొన్ని క్షణంబులు తన యిష్ట దైవంబును మననంబు జేసుకొని, తదుపరి ప్రజల నుద్దేశించి యిట్లనియె.

ఉ॥ వందన మయ్య యీ సభకు వచ్చిన వారలకున్ మనోహరా
నంద మహావిభూతి నవనందన సుందర మందిరా విహా
రేందిర యందు చింద, నను నిందర లోన నమంద వాక్సుధా
చందన చంద్రికా కుసుమ చర్చితు జేయగ సంతసించితిన్.
698

మ॥ అభిమానంబును జూపి మీరిపు డనూహ్యాంబైన సత్కార వా
గ్విభవాప్యాయము తోడ మీ ఋణమున్ కీలించినా రన్నిటన్
అభవుండే కద కర్త కర్మ క్రియ, ఈ యాహ్వాన మర్యాదలున్
ప్రభునే చేరు, ఎరుంగు డే పనికి కర్తల్ గారుగా మానవుల్.

ఆ॥వె॥ గండు రెడ్డి రాజ్య కర్కశ సేనాని
దుష్ట మార్గ గమన దురితములను
బాపి జీవహింస నాపి రాయ సుతుని
విడువ జేయు ఘనత మృడుని దేను. 700

ఉ॥ నేను నిమిత్త మాత్రుడను నిక్కముగా నిది దైవ యోగమే,
కాని యెడన్ తరంబె కడు కల్మష జన్ముడు రెడ్డిరాజ్య సే
నాని మనంబదే తెరగు నా నటనంబున స్ఫూర్తి చెంది ఈ
దీనుని బంధ మూడ్చి మము దీటుగ పంపె బహూకరించుచున్.

వ॥ కనుక రాయకుమార విమోచనంబు దైవసంకల్పము. దైవమన మనలో వివిధ భావ, రూప కల్పన లున్నవి. భగవంతుడన నెవ్వరు. ఈ ప్రపంచమున కర్థమేమి? మానవుల ధ్యేయమెద్ది? ఈ ప్రశ్నలకు నిర్వివాదమైన సమాధానము లతిక్లిష్టములు. శ్రీకృష్ణ పరమాత్మ శ్రీమద్భగవద్గీతలో బ్రహ్మతత్త్వమును మోక్షసాధనా మార్గంబులను విశదీకరించి యున్నాడు. భారతీయార్ష సంప్రదాయానుగుణముగా అనేక మహానుభావులు, మేధావులు, ఋషి పుంగవులు, ప్రవక్తలు సృష్ట్యాదినుండి నేటివరకు ఈ విషయములను విశ్లేషించుచునేయున్నారు.

అందు శంకర భగవత్పాదులు సిద్ధాంతీకరించిన అద్వైతము పండిత పామరజన ప్రయోజనకరమై, సుప్రసిద్ధమై, జగద్విఖ్యాతమై ప్రకాశించుచున్నది.

విశ్వము బహు విశాలమైనది. ఆది యంతములు లేనట్లు తోచును. ఇదమిద్ధమని నిర్వచించుట కష్టము. లెక్కించ లేనన్ని నక్షత్ర మండలములు, వాటి నాధారము చేసుకొని గ్రహ క్షేత్రంబులు, ఉప గ్రహంబులు, అనంతవ్యాప్తి గల ఆకాశంబున నున్నవి. అందు ఒక చిన్న నక్షత్రమండలము మన సౌర కుటుంబము. భూమి సూర్యగోళము నాధారము చేసుకొని నిత్య పరిభ్రమణము చెందుచున్న సామాన్య గ్రహము. దానిపై అనేక లక్షల జీవరాశి వర్గము లున్నవి. పెక్కుతెగలకు చెందిన మానవులు భూభాగములపై వివిధ ప్రాంతములలో, దేశములలో నివసించుచున్నారు.

చ|| జగతి ననేక దేశములు, సంస్కృతు లున్నవి, అట్లె, వేరు వే
రగు మతసంప్రదాయములు, ప్రాజ్ఞ గురుప్రవరుల్ మునీంద్రు లా
దిగ మహిమాన్వితుల్ గలరు, ధీరులు పూర్వు లనేక వత్సరాల్
ప్రగతి తపంబొనర్చి ప్రతిపాదన చేసిరి దైవతత్త్వమున్.

ఉ|| ఎన్ని మతంబు లున్నను, మరెందరు దైవప్రవక్తలున్న, వా
రెన్ని విధంబులౌ విధుల నేర్పడ చేసిన మానవాళికిన్
ఉన్నది విశ్వమందు ప్రభు వొక్కడె, ఆతని జేర వేరు లౌ
తెన్నులు పద్ధతుల్ మనకు తెల్పు విభిన్న మతాల సంస్కృతుల్.

ఉ|| అన్ని మతంబులందు భువి నార్యుల వేదమతం బపూర్వమై
యెన్నిక చెందు, ఇందున మునీంద్రులు జ్ఞానులు యోగ దృష్టితో
కన్నది దైవ మొక్కడని, కంటికి కానడు, ఊహ కంద డు
త్పన్నత లేని వాడు, నిరవద్యుడు, నిత్యుడు, సర్వవర్తుడున్.

మ|| ఘనుడా బ్రహ్మము నిర్గుణుండును నిరాకారుండు నిర్గంధుడున్
తన మాయన్ భువి సృష్టిజేయు, నడచున్, ధర్మొచు పాలించు, నీ
తని తేజంబు సమస్త భూతముల విస్తారింపగా, సాక్షియై
అణు రూపంబున సర్వజీవముల యందాత్మ స్థితిన్ నిల్చెడిన్.

వ|| అట్లు ప్రపంచము, దానిపై స్థావర జంగమంబులు, చేతనా చేతనము లన్నియు మాయా కల్పితములు. కాన అశాశ్వతములు, క్షణికములు, నాశన మొంది తిరిగి ఉత్పత్తి నొందెడివే. బ్రహ్మ మొక్కడే నిత్యుడు, శాశ్వతుడు, సర్వ వ్యాపకుడై సర్వ భూతము లందున్నను సాక్షీ భూతుడు మాత్రమే.

ఉ|| జీవిత నిత్య కృత్యములు, జీవిక లింద్రియ లంపటాదులున్
జీవుల భోగ భాగ్యములు, స్నిగ్ధత, రాగము, ద్వేషమున్, మనో
భావ పరంపరావగతి, ప్రాక్తన కర్మల పాప పుణ్యముల్
దైవము నంట వెన్నడును, తాదృశ కర్మకు మాయ కర్తగున్.

తే||గీ|| సర్వ జగతి నిండి కలడు శాశ్వతుండు
నిత్యుడౌ బ్రహ్మ మొక్కడే, నీవు, నేను,
అన్ని జీవంబు లంగున నంతరాత్మ,
అట్టి పరంధాము నందైక్య మగుటె ముక్తి. 709

తే।।గీ।।

అందు ఇందున ఎందైన అణువు వోలె
నున్న భగవంతున కెపుడు నుద్భవంబు
వృద్ధి నాశంబులును లేవు, విశ్వ వేద్యు
డాది మధ్యాంతములు లేక అడరి యుండు.

తే।।గీ।।

జగతి కధికారి పరమాత్మ సర్వ సాక్షి
నెరుగుటే జన్మ సార్ధక్య మెవరికైన;
వాక్కుకందదు, వర్ణింప వలను గాదు
నరులు ఊహింపగా లేరు పరమ పురుషు.

వ।। అందువలన భగవంతుని ఇదమిద్ధమని తేల్చుటయే కష్టము.

ఉ।। తెల్లని సూర్యరశ్మి ఘనతేజము వక్రపు దర్పణంబునన్
భళ్లున సప్తవర్ణ పరివర్తన చెందిన యట్లవిద్యయన్
కల్లగు దైవ మాయ తెర కన్నుల కడ్డు పడంగ నజ్ఞులై
కల్లరులైన మానవులు కానరు బ్రహ్మనిజస్వరూపమున్.

ఉ।। ధీరులు, పుణ్య మూర్తులు, యతి ప్రవరుల్, ఋషి సంయమీంద్రులున్
ధారుణి కోటి కొక్కరుగ ధ్యాన విభూతిని జ్ఞాన దృష్టులై
ధారణ తోడ కర్మఫల త్యాగము తోడను జన్మ జన్మలన్
ప్రేరితు లౌచు మోక్షపథ విశ్రుతులై చరియింతు రీ యిలన్

వ॥ ఆర్ష హిందూమత సంప్రదాయమున ధర్మమున కధిక ప్రాధాన్యము కలదు. భూమిపై ధర్మమును రక్షించు బాధ్యత రాజులది, ప్రభుత్వములది. అయిననూ కాలాను గుణముగా ధర్మము దిగ జారుచుండును ఇందుకు ముఖ్య కారణము మానవుని స్వార్థము, పేరాశ శారీరక సైనిక సాంకేతిక సామాజిక ధన తపోబల గర్వితులు విపరీత కామ క్రోధ లోభ మద మాత్సర్యంబులకు లోనై అధర్మ కార్యములకు పూనుకొందురు. ఇది రాక్షస ప్రవృత్తి వీరినే రాక్షసులని గూడ అందుము.

ధర్మ మధిక భాగము దిగ జారినపుడు భగవంతుడు తనంత తానే సృజించుకొని భూమిపై నుద్భవించి అధర్మ వ్యాప్తికి కారణ భూతుల నడచి, ధర్మమును పరిరక్షించును.

ఆ॥వె॥

ధర్మహాని జరుగు తరుణంబు నందున
యుగ యుగాల లోన జగతి యందు
అభవుడైన విశ్వ విభు డుద్భవించును
ధర్మ రక్ష చేసి ధాత్రి బ్రోవ 716

వ॥ ఈ విధముగా భగవంతుడు పుట్టుక లేని వాడైననూ, వివిధ రూపంబుల మానవుని శ్రేయస్సు కొరకు ధరపై తన యంశలను విస్తరింప జేయును. ఈ అవతారము లన్నియు పూజనీయములే. ఇంతియగాక, సర్వాంతర్యామియైన పరబ్రహ్మ ప్రతిజీవి యందును ఆత్మరూపంబున నుండునని చెప్పి యున్నాను గదా!

తే॥గీ॥
చేతనాచేతన సకల చిత్ర జగతి
జీవ రాశుల జన్మంబు శ్రేష్ఠమగును;
అందు మానవ జన్మయే యధిక మయ్యె
జ్ఞాన మేధలు గల్గి విజ్ఞాను లగుట.

వ॥ విజ్ఞానులైన మానవులు సనాతన సంప్రదాయ మార్గంబుల నిరంతర భగవచ్చింతనతో తపో బలంబున తమలో నున్న దైవాంశను జన్మ పారంపర్యా వృద్ధి పరచుకొని, ఆధ్యాత్మికోన్నతి పొందగలరు అట్టి వారినే మనము మహాత్ములు, జ్ఞానులు, సాధువులు, యతులు, అవధూతలు, గురువులుగా పిలుచుచున్నాము. వారు సామాన్య మానవులను ముక్తి మార్గంబున నడిపించు స్తోమత కలిగి యుందురు. వీరే భగవదర్చన సులభము చేయుటకు పూజనీయమైన కొన్ని భగవద్రూపంబుల ప్రతిపాదించి యున్నారు. మానవులు ఈ రూపంబులను గాని, లేక ఈ మహాత్ములనే గాని భగవంతునిగా నమ్మి ఆరాధించి ప్రథమతః మనశ్శాంతిని, ఇష్ట కామ్యార్థంబులను సాధించ గల్గుట మనకు పరిచితమే. భగవంతుడు

మ॥ జను లే రూపము తోడ కొల్చిన మనోజ్ఞంబైన ఆ రూపుతో
కనికారంబున వారికోరికలు వీకందీర్చు, నట్లౌటచే
జను లీ తీరున తృప్తి చెంది తమ కచ్చంబైన దైవంబు వా
డని యూహింపగ, భూమిపై వెలసె నాయా దైవరూపంబులున్.
720

మ॥ అనురాగమ్మున కొల్తురీ శిలల మాయావేశులై మానవుల్,
అనుకంపన్ భగవాను డిచ్చు ననుభావ్యంబైన ధర్మార్థకా
మనలన్ భక్తులు తృప్తి చెంద, సగుణామ్నాయంబులై చెల్లు, ఆ
మనుజుల్ ప్రార్థన చేయు రూపములు ప్రామాణ్యంబులై యొప్పుచున్.

వ॥ మానవ ప్రతిపాదితంబులైన వివిధ రూపంబులు ఆ విశ్వేశున కాపాదించుటం జేసి తదారభ్యా, అత్యంత భక్తితో తర తరంబుల నారాధించుటంజేసి యవి యెల్ల పూజనీయంబు లగును. అవే భగవంతుని ప్రతి రూపంబులు. నిర్గుణ నిరాకార బ్రహ్మకు సగుణ రూపంబులు. నిర్మల భక్తితో తను నమ్మిన రూపంబు నారాధించిన పురుషార్థ సాధన సుగమంబగును. ఈ విధంబున ఐహిక వాంఛలు తీర్చు కొనుచు మోక్ష మార్గమున పయనింప గలము. అయినను, చివరకు నిర్గుణ బ్రహ్మోపాసన వల్లనే ముక్తి పొందనగునని తెలియనగును.

ఆ॥వె॥
నిశ్చలాత్మ తోడ నిలకడ ధ్యానింప
దైవరూపమొకటి దయను జూపు;
అట్టి వరము లన్ని ఐహిక సాధనల్
స్వాత్మ జాగృతేను శాశ్వతంబు.

ఆ॥వె॥
తాను గాక వేరె దైవంబు గలడంచు
నమ్మి వాని కొలువ వమ్ము గాదు;
ముక్తి మార్గమందు మొదటి సోపానంబు
భక్తి యనుచు మునులు పలుకలేదొ. 724

ఆ॥వె॥

సకల జీవులందు సర్వేశు గాంచుడు
అంతరాత్మయందు నధిపు గనుడు;
తానె దైవమంచు తాదాత్మ్య మందుచు
తన్ను తాను తెలియ తత్త్వ మగును.

వ॥ మేధావులు, విధ్యాధికులు, విజ్ఞానులు నయిన మానవులు ధ్యాన, కర్మసన్న్యాస యోగంబుల నిర్గుణ బ్రహ్మము నారాధించి ముక్తి పథంబున పయనింప ప్రయత్నింపగా, సామాన్య సంసారి తను నమ్మిన దైవ రూపంబును అనన్య సాధ్యంబైన నిశ్చల భక్తి విశ్వాసములతో సగుణోపాసన చేసి, జన్మ చరితార్ధత సాధించి మోక్ష పథగామి కాగలడు. పసివాడైనను పట్టుదలతో తనకు లభించిన మంత్రోచ్చారణ తపంబున భగవంతుని సాధించిన ధ్రువు డిందుకు తార్కాణము. మూఢ భక్తితో శివ సాయుజ్యంబు జేరిన భక్త కన్నప్ప యిందు కుదాహరణము. రాక్షసకుల సంజాతుండైననూ సంతత చింతన, మనన, ధ్యానాది వివిధ భక్తి మార్గంబుల భగవంతుని వశము చేసుకొనిన ప్రహ్లాదు డుపమానము. ఆలోచించి చూసిన భూతకాలంబున నిట్లనేక నిదర్శనములు తెలియగలవు.

ఈ కాలంబున ప్రపంచమందు వివిధ ప్రాంతంబులం దనేక మతములు, సంప్రదాయములు వృద్ధి చెందినవి. మానవుడు ఇతర సంప్రదాయములెంత యుత్కృష్ట మని తలచినను తన సంప్రదాయమును విడువక స్వధర్మము ననుసరించి భక్తి జ్ఞాన మోక్ష సాధన చేయవలెను.

పామరులు, విద్యాగంధ దూరులు నైన సామాన్య మానవులు స్వధర్మంబును విసర్జింపక, న్యాయ మార్గంబున నడచుచు, నిర్ణీత నిత్య కర్మానుష్ఠానములను, తమ తమ వృత్తి వ్యాపార కర్మల నుల్లంఘింపక చేయుచు, ఫలాపేక్షను వదలి, తను నమ్మిన దైవంబును నవవిధ భక్తిమార్గంబులలో నేయొక్క దానితో నైనను ఆరాధించుచు, మానవ ధ్యేయమైన నిర్గుణోపాసనాధారమైన మోక్ష మార్గంబున ఉన్నత స్థానంబు లధిష్ఠింప గలరు.

తే॥గీ॥

ధర్మ మార్గంబు తప్పక కర్మ చేసి
ప్రతిఫలాపేక్ష లేకుండ ప్రతి దినమ్ము,
ఇష్ట దైవంబు సేవింపు డెల్ల వారు
భక్తి మార్గంబు నెన్నుచు ముక్తికొరకు.

వ॥ ఇదే మన కర్తవ్యము. మీకు శుభమగు గాక. అని బ్రాహ్మణుండు తన సందేశంబును ముగించి లేచి వేదిక డిగ్గి సభాసదుల మధ్యకు వచ్చుచుండ, ప్రజా బాహుళ్యంబు హర్షంబు నొందుచు, మిన్ను ముట్టిన జయ జయ ధ్యానంబులతో నిట్లని కీర్తించిరి. 728

ధ్రువకోకిల॥

ముని మహాశయ ! కీర్తి వర్ధన ! పుణ్య పూరుష ! శ్రీకరా !
మనము సంతస మందు దర్శన మాత్రమే గురు పుంగవా !
జనముపై దయ తోడ తెల్పితి సత్య మార్గము ముక్తికిన్
ప్రణతు లిత్తుము దేవరా నిను ప్రస్తుతింతుము భూసురా !

ధ్రువకోకిల||

పరమ పావన భక్త వర్ధన పార్వతీ పతి చింతనా !
సరస భాషణ శంక నాశన శంభు శంసన హర్షణా !
నిరత నిర్గుణ నిత్య నిర్మల నిర్వికార నిరంజనా !
కరుణ కల్మష కర్మ కల్పిత కామ్య కోప నికృంతనా !

వ|| ఆతరి సభాస్థలి వెడలి వచ్చుచున్న

తోటకవృత్తము||

ముని నాథుని డగ్గరి మోదముతో
చని బారులు తీసిరి జానపదుల్,
అనుబంధముతో యతి ఆ ప్రజకున్
తన దీవెన లిచ్చెను ధన్యులుగాన్.

మత్తకోకిల||

వేము మౌనిని పూజ చేసిరి వేవిధంబుల నాతరిన్
రామలందరు గూడి నాట్యము రమ్య రీతిని చేయుచున్
కామ నాశను భక్తుడీతడు కామితార్థ వదాన్యుడున్
ప్రేమ మాపయి జూపు యోగి వరేణ్యుడంచును పాడుచున్.

తోటకవృత్తము||

వినయంబున కాంతలు ప్రేంఖణలై
కనకంబున చేసిన కంచములన్
అనురాగము మెండుగ నారతులన్
మణికాంతులు జల్లిరి మౌని పయిన్. 734

వ|| ఈ విధంబున సభాసదులు భక్తి ప్రపత్తులతో మోహావేశులైయున్న సమయంబున బ్రాహ్మణుండు నిశ్చిత మనస్కుండై నిశ్చల వదనుండై, ఆ నిశీథిని తేజఃపుంజంబైన ధ్రువతారం బోలుచు, పట్టిసక్షేత్ర ముఖుండై పోవుచు కొంతలో అంతర్హింతుండయ్యె.

## 35. కృతిపతి ప్రశంస.

క్షామహారము||

శంభో శంకర పరమేశా ! జంభారి వినుత, సర్వేశా !
అంభోధీభవ విష ధుర్యా ! అంబా సహచర, విశ్వేశా !
గంభీరాకృతి ఘనలింగా ! కుంభీనస వృత, గౌరీశా !
సంభావించెద జగదీశా ! దక్షాధ్వరహర, భీమేశా !

రథోద్ధతము||

పార్వతీ పతిని ప్రస్తుతించెదన్
సర్వలోక విభు సన్నుతించెదన్
శర్వు నీశ్వరుని సంస్మరించెదన్
గర్వి నన్ను కృప కావవేడెదన్.

చంద్రిక||

శిరము వినతి చంద్రశేఖరా !
సరిగ కొలుతు భీమశంకరా !
తిరముగ నను పార్వతీపతీ !
కరుణ గనుము కాలకంధరా ! 738

మానిని||

పావన నాముని, పాశ విమోచను, పాప నిరోధుని, పాలకునిన్
ప్రావృత కృత్తుని, ప్రాక్తన వర్తను, వ్యావృత కేశుని, వ్యాపనునిన్
భావజు భంజను, భస్మ శరీరుని, భక్త వశంకరు, భవ్యపతిన్
భావుక రూపుని, భాస్కర తేజుని, భ్రాంతి విమోచను, భ్రాజితునిన్.

నాగర వృత్తము||

పట్టిస వీరభద్రునిన్
గట్టిగ భద్రకాళితో
పట్టుదు పాదపద్మముల్
పుట్టువులేని ముక్తికై.

ఇంద్ర వ్రజము||

ద్రాక్షార భీమాయ దయాపరాయ!
అక్షీణ రూపాయ హరి ప్రియాయ!
సుక్షేత్ర వాసాయ సుకర్మ దాయ!
రక్షార్తి లోకాయ రసస్రువాయ! 741

*సీ|| వేదముల్ వేదాంగ వేదాంతముల నేర్చి
ముక్తికాంతను చేరు శక్తి లేక,
బీషణ తపములు విరివిగా వ్రతములు
మహిమలు మంత్రముల్ అహితమగుట,
శంస చేయగ నాకు శబ్ద శాస్త్రము రాక
కట్టడ నిను కొల్చు పట్టు లేక,
రక్తితో మిమ్ముల రంజిల్ల చేయంగ
ముచ్చట్లు నా కేమి వచ్చు గనుక,
తే||గీ|| వ్రాయ నేర్చితి శంకరా పద్య కవిత;
సిద్ధ కన్యను దీనిని స్వీకరించి,
నగకుమారికి, గంగకు నచ్చ చెప్పి,
దిటవు దీపింప ఏలుమో నటవరేణ్య.

మంగళం మహాశ్రీ||
మంగళము నీకు శివ ! మంజిమల నా కవిత
ప్రాంజలుల మంగళము శంభో!
పొంగగను నా హృదయ పుష్పమిది, యీ కృతిని
పుచ్చుకొని యేలుకొను మీశా!
గంగ ఉమ లట్లు కృతికన్నె కలకాలమును
కాపురము చేయవలె స్వామీ!
సంగతము, సంపదలు, శాంతియు, చిరాయువును,
సౌఖ్యములు మా కొసగు దేవా!
743

---

*పాదాద్యక్షరక్రమ కవినామగర్భిత సీసము. వివరణ-9 చూడుడు.

# గద్యము.

ఇది పరమేశ్వర ప్రసాదిత పాండిత్య ప్రకాశ, సహజ కవిత్వ తత్వ విభవ, హరితస గోత్రసంభవ, వేము వంశ సుందరారామ మండిత రామయాహ్వాయ పౌత్ర, హూణ భాషా వ్యాసంగ వ్యాసక్త వ్యాసమూర్తి పుత్ర, కౌశికసగోత్ర యనమండ్ర వంశ కలానిధి నారాయణమూర్తి దౌహిత్ర, ద్రాక్షారామ భీమేశ్వర వర ప్రసాద సంభవ, బహువిద్యాకోవిద, భూభౌతిక శాస్త్ర విశారద, ఉస్మానియా విశ్వవిద్యాలయ భూభౌతిక శాఖా స్థాపక, అధ్యక్ష, ఆచార్య వరుండును, తత్ విద్యాలయ విజ్ఞాన శాస్త్ర వివిధ విభాగ పరిషత్ గురుండును, అన్వేషణా భూభౌతికశాస్త్ర స్వచ్ఛంద సమాఖ్య స్థాపకుండును, ఆంధ్రప్రదేశ ప్రభుత్వ ఖనిజాభివృద్ధి సంస్థ అధ్యక్ష, కార్యనిర్వహణాధికార ప్రకాశితుండును, బహుదేశ గమన, విద్యాసముపార్జిత, విజ్ఞాన శాస్త్ర సాంకేతిక పరిశోధన, ఆచార్యాది వృత్తి వర్తనుండును, కతిపయ సంవత్సర పూర్వ వృత్తి వ్యాపారాది లౌకిక కార్య విసర్జిత, సంతత హర చరణారవింద ధ్యానమగ్నుండునగు లక్ష్మీనారాయణ సుబ్రహ్మణ్య భీమశంకర నామధేయుండను, హైదరాబాదు నగరమందు రచించిన 'రసస్రువు' అను 'వేము వంశ గాథావళి' ఏకాశ్వాశ పద్య కావ్యము సర్వమును సంపూర్ణము.

మంగళం మహత్.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

వివరణ-1

# చతుర్విధ కందములు

ఈ చతుర్విధ కంద పద్యములలో మొదటి పాదము మొదటి గణమునుండి పద్యమును సాంతమును చదివిన ఒక కందమును, రెండవ పాదము రెండవ గణమునుండి చివరివరకు చదివిన, రెండవ కందమును, అదే విధముగా మూడవ పాదము మొదటి గణమునుండి చదివిన, మూడవ కందమును, నాల్గవ పాదము రెండవ గణమునుండి చదివిన నాల్గవ కందమును ఏర్పడును.

ఈ నాలుగు కందములును, గ్రంథములోని ఒక పద్యమునకు ఇచ్చట చూపబడెను.

మొదటి పద్యము:

మొదటి కందము:

కరుణాలవాల కరివర
వరదా! సురపూజిత మునివందిత చరణా!
మురహర నిరుపమ శమగుణ
చరితా! తిరుమల నివాస సంపత్కరణా!

రెండవ కందము:

సురపూజిత మునివందిత
చరణా! మురహర నిరుపమ శమగుణ చరితా!
తిరుమల నివాస సంప
త్కరణా! కరుణాలవాల కరివర వరదా!

మూడవ కందము :

మురహర నిరుపమ శమగుణ
చరితా! తిరుమల నివాస సంపత్కారణా!
కరుణాలవాల కరివర
వరదా! సురపూజిత మునివందిత చరణా!

నాల్గవ కందము:

తిరుమల నివాస సంప
త్కారణా కరుణాలవాల కరివర వరదా !
సురపూజిత మునివందిత
చరణా ! మురహర నిరుపమ శమగుణ చరితా!

ఇటులనే రెండవ పద్యమునకు గూడ అనునయింపనగును.

వివరణ-2

# విద్యున్మాలా గర్భిత విశ్వదేవి వృత్తము.

ఈ క్రింది విశ్వదేవి వృత్తమున విద్యున్మాలా వృత్తము గర్భితమై యున్నది.

విశ్వదేవి॥

ఉద్యఃస్ఫూర్తిన్ వెల్గున్ నరోద్భుండు, వీడో
విద్యా విఖ్యాతుండో గవేషుండు కాడో,
సద్యఃకర్మండౌనో విచారింప, ఈడీ
చోద్యంబెంతో వింతౌను, చోక్షంబు చూడన్.

గర్భిత విద్యున్మాలా వృత్తము॥

చూడన్ ఉద్యఃస్ఫూర్తిన్ వెల్గున్,
వీడో విద్యా విఖ్యాతుండో,
కాడో సద్యఃకర్మండౌనో,
ఈడీ చోద్యంబెంతో వింతౌ.

వివరణ-3

# కంద గర్భిత వచనము.

ఈ క్రింది వచనములో కందము గర్భితమై ఉన్నది.

వ|| ఆ విధంబున తలంచుచు, తనకు వేరు మార్గంబు లేదని నిశ్చయించి, ఆతడు తన మనమందున దహించు తాపంబు కతంబున వెలుదెంచెడి దుఃఖంబునంత కఠిన ప్రయత్నమున నాపంగా సమకట్టి, మహాదేవునిపై దృష్టి మరలించి యిట్లని ప్రార్థించె.

గర్భిత కందము||

అని నిశ్చయించి ఆతడు
తన మనమందున దహించు తాపంబు కతం
బున వెలుదెంచెడి దుఃఖం
బునంత కఠిన ప్రయత్నమున నాపంగాన్.

వివరణ-4

# కందగర్భిత మణిగణనికరము.

ఈ క్రింది మణిగణనికరమను వృత్తములో కంద పద్యము గర్భితమై యున్నది.

మణిగణనికరము॥

తన మనమున ముని తలచెను, కనగన్
కనికరమగు నధిక చకితు నితనిన్
కొనకొని మన యునుకువ నిక వినగన్
వినబడక నతడు విన తెలుప వలెన్.

గర్భిత కందము॥

తన మనమున ముని తలచెను,
కనగన్ కనికరమగు నధిక చకితు నితనిన్
కొనకొని మన యునుకువ నిక
వినగన్ వినబడక నతడు విన తెలుప వలెన్.

వివరణ-5

# మత్తకోకిల, ద్విపద, కంద, ఆటవెలది గర్భిత సీసము.

ఈ సీసములో ఎత్తుగీతితో సహా అన్ని పాదముల యందు రేఫ ప్రాస గలదు. ఎత్తు గీతిలో నన్నియు లఘువర్ణములే వాడబడెను.

సీ|| ధారుణీ వర! శత్రు దాంభిక దార్ఢ్య దా
రుణ దండనా! ధరరోషధీర!
మారఘట్టిత మధ్యమా రతి మాన సా
రళ సాధనా! అతిరమ్యరూప!
వీరభైరవ తంత్ర భీకర బిక్షు కా
రణ మారణా! ఘనరాజ వినుత!
హార కాంచన మౌక్తి కాభరణాంచితా
రవ హర్షణా! అనురాగహృదయ!
తే||గీ|| పురహరసతి నధిక ముదముగ పొనరి కొలిచి
వరములు కొనిన నరవర! ప్రతిభయహర!
కరుణమయ హృదయ! చతుర కదన విభవ!
పరగ కలుగు శుభములు నృప! తిరముగ.

గర్భిత మత్తకోకిల||
ధారుణీ వర! శత్రు దాంభిక దార్ఢ్య దారుణ దండనా!
మారఘట్టిత మధ్యమా రతి మాన సారళ సాధనా!
వీరభైరవ తంత్ర భీకర బిక్షు కారణ మారణా!
హార కాంచన మౌక్తి కాభరణాంచితారవ హర్షణా!

గర్భిత ద్విపద||

ధారుణీ వర! శత్రు దాంభిక దార్ఢ్య
దారుణ దండనా! ధరరోషధీర!
మారఘట్టిత మథ్యమా రతి మాన
సారళ సాధనా! అతిరమ్యరూప!
వీరభైరవ తంత్ర భీకర బిక్షు
కారణ మారణా! ఘనరాజ వినుత!
హార కాంచన మౌక్తి కాభరణాంచి
తారవ హర్షణా! అనురాగహృదయ!

గర్భిత కందము||

ధర రోషధీర! అతి ర
మ్యరూప! ఘనరాజ వినుత! అనురాగ హృదీ!
పురహర సతి నధికముగ పొ
నరి గొలిచి వరములు గొనిన నరవర ప్రతిభా!

గర్భిత ఆటవెలది||

పురహరసతి నధికముగ పొనరి కొలిచి
వరములు కొనిన నరవర! ప్రతిభయ
హర! కరుణమయ హృదయ! చతుర కదన వి
భవ! పరగ కలుగు శుభములు నృపతి!

వివరణ-6

# మత్తేభవృత్త, కంద గర్భిత సీసము.

ఈ క్రింది సీసమున మత్తేభ, కందములు గర్భితమై ఉన్నవి.

సీ|| వినతులున్, పూజలు, వేదమంత్ర పఠనల్,
నామంబు సంకీర్తనల్, తపంబు
విహితమై యుండగ వేనవేలుగను వి
శ్వేశున్ కనంగన్ మహిన్ ! నరేంద్ర
విగతమై పోయి వివేచనల్ పరమ మూ
ర్ఖంబైన మార్గంబుగా, నిరతము
సురత`ున్ దేలుచు క్షుద్రమైన బలులన్
రంజిల్లగా నేల ! రాజచంద్ర
తే||గీ|| దొరకొనునె భూరిశక్తులు, దురితము లోన
గూడుగాని దుష్కృతములకున్, నిరవధి
క సుఖము కలదే నరులకు ! గరళగళుని
కరుణ కలుగ కుండన్, వాని గరిమ గనక.

గర్భిత మత్తేభము||
నతులున్, పూజలు, వేదమంత్ర పఠనల్, నామంబు సంకీర్తనల్,
హితమై యుండగ వేనవేలుగను విశ్వేశున్ కనంగన్ మహిన్!
గతమై పోయి వివేచనల్ పరమ మూర్ఖంబైన మార్గంబుగా,
రతమున్ దేలుచు క్షుద్రమైన బలులన్ రంజిల్లగా నేలరా.

గర్భిత కందము||

దొరకొనునె భూరిశక్తులు,
దురితము లొన గూడుగాని దుష్కృతములకున్,
నిరవధిక సుఖము కలదే
నరులకు గరళగళుని కరుణ కలుగకుండన్.

# స్రగ్విణీ వృత్త గర్భిత భుజంగప్రయాతము.

ఈ భుజంగ ప్రయాత వృత్తమునందు స్రగ్విణీ వృత్తము గర్భితమై యున్నది.

భుజంగ ప్రయాతము।।

నమో దేవదేవా ! ఘనా దీనబంధూ !
మమున్ కావరావా ! సమగ్ర ప్రభావా !
తమిస్రా వినాశా ! సదాశాంతి దాతా !
సమజ్ఞా వదాన్యా ! అసాధ్య ప్రదానా !

గర్భిత స్రగ్విణి।।

దేవదేవా ! ఘనా దీనబంధూ ! మమున్
కావరావా ! సమగ్ర ప్రభావా ! తమి
స్రా వినాశా ! సదాశాంతి దాతా ! సమ
జ్ఞా వదాన్యా ! అసాధ్య ప్రదానా ! నమో!

వివరణ-8

# కంద గర్భిత తేటగీతి.

ఈ క్రింది తేటగీతిలో కందపద్యము గర్భితమై యున్నది.

తే॥గీ॥ గురుని ఋణ మెట్లు తీర్తును కరుణ నతడు
నా కొమరుని కాకతి పృతనావరు సభ
బలి పశువును భూవరుని ప్రపత్తి గొనుచు
విడివడగను చేసెన్ గదా వింత గాదె.

గర్భిత కందము॥
గురుని ఋణ మెట్లు తీర్తును
కరుణ నతడు నా కొమరుని కాకతి పృతనా
వరు సభ బలిపశువును భూ
వరుని ప్రపత్తి గొనుచు విడివడగను చేసెన్.

వివరణ-9

# పాదాద్యక్షరక్రమ కవినామగర్భిత సీసము.

ఈ క్రింది సీసములో

సీ॥ వేదముల్ వేదాంగ వేదాంతముల నేర్చి
ముక్తికాంతను చేరు శక్తి లేక
భీషణ తపములు విరివిగా వ్రతములు
మహిమలు మంత్రముల్ అహితమగుట
శంస చేయగ నాకు శబ్ద శాస్త్రము రాక
కట్టడ నిను కొల్చు పట్టు లేక
రక్తితో మిమ్మల రంజిల్ల చేయంగ
ముచ్చట్లు నా కేమి వచ్చు గనుక
తే॥గీ॥ వ్రాయ నేర్చితి శంకరా పద్య కవిత
సిద్ధ కన్యను దీనిని స్వీకరించి
నగ కుమారికి, గంగకు నచ్చ చెప్పి
దిటవు దీపింప నేలుమో నటవరేణ్య.

ప్రతిపాదం మొదటి అక్షరము సీసపద్యం మొదలు ఎత్తుగతితో సహా - క్రమంలో చదివితే "వేము భీమశంకరము వ్రాసినది" అని వచ్చును.

## అనుబంధము-1

వ|| ఈ వేమూరు పల్లె చుట్టునున్న విషయమున, బహుశః వేమూరు గ్రామము నందే వేము వంశజుల పూర్వీకులు, సుమారు క్రీ||శ|| 12-13 శతాబ్దుల మధ్య నివసించి యండవచ్చునని ఊహించ వచ్చును. అది కాకతీయ రాజ్యము వ్యాపించుచున్న కాలము. కాకతీయ రుద్రదేవుడు (మొదటి ప్రతాప రుద్రుడు) ప్రస్తుతం మనం తెలంగాణము అనే ప్రాంతాన్ని కన్నడ రాజుల నుండి విముక్తిచేసి ఆంధ్ర ప్రాంతానికి దిగ్విజయం చేసిన రెండవ ప్రోలరాజు తదుపరి రాజ్యమునకు వచ్చెను. క్రీ||శ|| 12వ శతాబ్ది చివరి భాగములో పల్నాటి యుద్ధం జరిగి కృష్ణా, గుంటూరు, నెల్లూరు, పల్నాడు ప్రాంతాలలో బీభత్సం వ్యాపించింది. రుద్రదేవుడు తెలంగాణంలో మిగిలిన చిల్లర రాజులను జయించి శతాబ్దులుగా ఆంధ్రదేశమును పరిపాలించిన వెలనాటి చోళులను పతనం చేసెను. అయినా, ఈ వేమూరు ప్రాంతాలు కాకతీయుల ఆధీనములో గాక ప్రాంతీయ రాజుల పాలనలో నున్నట్లు తోచుచున్నది. దేశమంతా అరాచకము వ్యాపించి యుండవచ్చును. పరిపాలనా యంత్రాంగము పటిష్ఠంగా లేని కారణము వలననో లేక సాంఘిక పరిస్థితుల వలననో, ఒక పెద్ద గ్రామము దాని చుట్టునున్న చిన్నపల్లెలతో సహా గ్రామపంచాయతీల వంటి పరిపాలనా సంఘముల ఆధీనంలో నున్నట్లు కనబడుతున్నది. వేము వంశ పూర్వీకుల కుటుంబము వేమూరులో చాలా వృద్ధిలో నున్నదని అనుకోవచ్చును.

అనుబంధము-2

వ।। ఈ కాలము  సుమారు క్రీ।।శ।। 14 - 15 శతాబ్దుల మధ్య అని ఊహించవచ్చును. దక్షిణ భారతములో విజయనగర సామ్రాజ్యము స్థాపించబడి, వృద్ధి చెందుచున్న సమయము సంగమ వంశస్తుడైన రెండవదేవరాయలు ప్రస్తుతము మనము రాయలసీమ అని వ్యవహరించు ప్రాంతమును తన ఆధీనంలోకి తీసుకొనెను. రాచకొండ పద్మనాయకులు, రాజమహేంద్రవర రెడ్డిరాజుల ఆధీనంలో కోస్తా ఆంధ్రదేశము వుండెడిది. వారు విజయనగర ఆధిపత్యాన్ని అంగీకరించినారు.

ఎక్కువ ప్రచారములో లేనిది, గోదావరి పట్టిసీమ నందకేశ్వరమునకు (దీనినే నందీశ్వరమని గూడ వ్యవహరింతురు) సంబంధించిన సాహిత్య విషయము ఒకటి ఉన్నది.

కం।। శివలీల విలాసమ్మను
నవమును నిశ్శంక కొమ్మన కవివరుండున్
నవపథమున చెప్పె నిచట
కవయొనిది కాశిఖండ కావ్యంబునకున్

శ్రీనాథుని సమకాలికుడు (15వ శతాబ్ది మొదటి భాగం), నందికేశ్వరవాసి అయిన నిశ్శంక కొమ్మన 'శివలీలా విలాసము' అను గ్రంథమును, శ్రీనాథుడు కాశీఖండమును వ్రాయు నాటికే రచించెనని ఆచార్య ఆరుద్ర గారు తమ "సమగ్ర ఆంధ్ర సాహిత్యం"లో (మూడవ సంపుటం, పద్మనాయక - రెడ్డి రాజుల యుగాలు, 385-399 పేజీలు) పేర్కొన్నారు.

ఈ నందీశ్వరము గోదావరి మధ్యస్థ ద్వీపము. పట్టిసీమ ద్వీపము పోలవరమునకు 2-3 కి.మీ. దిగువ గోదావరి. నందీశ్వరము 2-3 కి.మీ. ఎగువ. కాని, నందీశ్వర ప్రాంతము అడవిలో నున్నది. అందువలన జనులు ఆ ద్వీపములో నివసించరు.

కనుక, నందీశ్వరమునకు (బహుశః స్థానాపతి అయిన) ఈ నిశ్శంక కొమ్మన ప్రతి ఉదయం వెళ్లివచ్చుచూ పూజాది నిత్యానుష్ఠానములను దేవునికి చేయిస్తూ ఉండెడి వాడై యుండవచ్చునని తోచుచున్నది.

మన కథలోని మలకపల్లె, ఈ గ్రామం ఉన్నదేశం, అనగా మన ప్రస్తుత గోదావరి జిల్లాలు, మన్య ప్రాంతములో కొంత, రెడ్డి రాజుల ఆధిపత్యంలో నుండెడివి. మన్యం అంటే తూర్పు కనుమల అరణ్యం. మన కథావసరాలకు అనుగుణముగా భద్రాచలము నుండి పోలవరము దాకా ప్రవహించే గోదావరికి ఇరు ప్రక్కల అడవి అని అనుకోవచ్చు. ఈ మన్యంలోనే రెడ్డి రాజ్య సరిహద్దు. ఇక్కడే దొంగలు దోపిడీలు చేసే మార్గం. అందుకే సైన్యముతో చిన్న చిన్న సరిహద్దు సైన్యాల మధ్య చిరు యుద్ధములు జరుగు చుండెడివి. వాటివలన మన్య ప్రజలకే కాక (వీరు ఎక్కువగా కోయ జాతి కొండ ప్రజలు) సమతల ప్రాంతాలైన పోలవరము అంతకు దిగువ ప్రాంతాల ప్రజలకు గూడా శాంతి సౌఖ్యముల లోపము కలుగు చుండెడిది. రాజ్య సరిహద్దు ఈ చిన్న సంఘర్షణల మూలంగా అటూ ఇటూ కదులు చుండెడిది అందు వలననే ఈ సరిహద్దు భద్రతకై రెడ్డిరాజులు గట్టి ప్రయత్నాలు చేసే వారు. ఒకకోట కట్టిరనీ, అక్కడ సైన్యం ఉండెడిదని కథలున్నవి.